




# వేదములు

విచారణ

## విశ్వబ్రాహ్మణులకు ప్రథమ సత్కారార్హత





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books  Journals  Newspapers  Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్రీ విశ్వకర్మణేనమః

# విశ్వబ్రాహ్మణులకు ప్రథమ సత్కారాష్టత



సంగ్రహీత :

విమర్శకాచార్య శిల్పకళాకోవిద

**బ్రహ్మశ్రీ స్వర్ణ సుబ్రహ్మణ్య కవి**

ప్రకటనకర్త :

**బ్రహ్మశ్రీ తుమపాల విజయశేఖరరావు**

వీరరాఘవులు వీధి

షరాబు బజారు

**తెనాలి - 522 201**

కాపీరైట్]  1979  [వెల : రు. 10-00

# పరిచయము

(క్రీ. పూ. 1500 - 1400 సంవత్సరములు)

తైత్తిరీయ బ్రాహ్మణము ద్వితీయాష్టకము "ప్రజాపతి ర్విశ్వకర్మా తస్య మనోదేవం యజ్ఞేన రాధ్యాసం ॥ ఐతరేయ బ్రాహ్మణము 4 పం. 22 ఖం. 3 అ॥ "విశ్వకర్మా భవత్ప్రజాపతిః ప్రజాః సృష్ట్వా, విశ్వ కర్మాభవత్ సంవత్సరో విశ్వకర్మైంద్ర మేవత దాత్మానం ప్రజాపతిం సంవత్సరం విశ్వకర్మాణ మాబ్రువంతీంద్ర ఏవ తదాత్మని ప్రజాపతౌ సంవత్సరే విశ్వకర్మణ్యాం తతః ప్రతిష్ఠంతి య ఏవం వేద ॥

తా॥ విశ్వకర్మ ప్రజలను సృష్టించి ప్రజాపతి యయ్యెను. ఆ విశ్వకర్మయే సంవత్సర (యజ్ఞ) స్వరూపుడయ్యెను. ఐశ్వర్యరూపుడగు తననే ప్రజాపతిగను, సంవత్సరం (యజ్ఞరూపు) నిగను, చెప్పుదురు. అంతమునందు ఐశ్వర్యరూపుడును, ప్రజాపతి రూపుడును(సంవత్సరయజ్ఞ) రూపుడును, అగు విశ్వకర్మయందు (సర్వము) ప్రతిష్ఠించుచున్నాడు.

క్రీ. పూ. 3000 సం॥ నాటి కాత్యాయన బోధాయన అశ్వలాయన మున్నగు సూత్రములయందు రథకార బ్రాహ్మణత్వమును గురించి నిర్ణయింపబడిన విషయముల నెఱుగకయు, తరువాత మీమాంసాకారునకు తెలియని విషయములు, అష్టాదశ వర్ణములు నిర్ణయించిన మనువునకు తెలియని విషయములు నిన్న మొన్నటి బౌద్ధమతస్థుడై శాబ్దికస్థానమునకు వచ్చి తనకు సంబంధములేని వర్ణవిచక్షణ సంకీర్ణ సంకరాధి వివరములు,

తన్నా మకరణములు, సిద్ధాంత కౌముది తరువాత యెన్నాళ్లకో యేజాతిలోనో యే విధముగానో తన జన్మస్థానము కాలము నైతము గ్రహించలేని. యతమ నిఘంటువు వ్రాసెననుకొందము. ఇట్టి శబ్దానుశాసను లెందఱు లేరు? 'రథకార ద్విజోత్తమం' మున్నగు పదములెన్ని లేవు? క్రీ. శ. 1898 ఏప్రిల్ పత్రికలో మద్రాసులోని ప్రసిద్ధ పండితుడు ఎం. నారాయణ శాస్త్రిగారు (ఎం. ఏ.) "విశ్వకర్మ వంశబ్రాహ్మణులు ఋగ్వేదకాలము నుండి యున్న పూర్వపువంశమై యున్నది. వారు హిందుస్థానములో బ్రాహ్మణులకంటె పూర్వమునుండి యున్నట్లు పుష్కలమైన యుత్తమ ఆధారములు కనుపడుచున్నవి" అనినారు.

తైత్తిరీయ బ్రాహ్మణము అ 1, అ 1. అ 5 ఋభూణాం, త్వా, దేవానాం, వ్రతపతే, వ్రతేనాదధామీతి రథకారస్య, భృగు, అంగిరస్, ఆదిత్య. వరుణ, ఇంద్ర, మను, ఋభు, ఇత్యాది 7 విధములుగా శ్రౌతాగ్ని మంత్రములున్నవి. పద్మసంహిత ఇది చాల పురాతనమైనది,

"శ్లో॥ ప్రసాదం ప్రవిశేచ్ఛిల్పీ రథకార ద్విజోత్తమః" ఇట్లు ప్రసిద్ధి గలదు. స్కందపురాణము క్రీ॥ పూ 5 వ శతాబ్ది నాటిది 6 వ అధ్యాయము

శ్లో॥ సర్వోజాతాది పంచభ్యో ముఖేభ్యః పంచనిర్మమే ।
విశ్వకర్మసుతాహ్యేతే రథకారస్తు పంచచ పాంచరాత్రమహోపనిషత్॥

క్రియాపాద, శూలస్థాపన విధి శ్లో॥ తస్మిన్ కాలే సమాహూయ రథకార ద్విజోత్తమమ్ ॥ (44 పుట) శ్లో॥ స్థపతిః ప్రతిమాం, పశ్చా ద్రథకారా, ద్యనుజ్ఞయా మానోన్మానైః ప్రమాణై, స్తాం ప్రతిమాం కారయేచ్ఛుభామ్॥ (57 పుట)

క్రీ. శ. 3 వ శతాబ్ది నుండి (5 వ శతాబ్ది వరకు పాలించిన) ఆంధ్ర

దేశభాగమైన, వేంగీదేశము నేలిన. శాలంకాయనభూపాలురచే నొసంగ బడిన అగ్రహారదాన వివరము.

చతుర్వేదోపాధ్యాయుడగు రథకార బ్రాహ్మణునకు వేంగి రాజగు మహారాజశ్రీ నందివర్మ, స్కందవర్మ అగ్రహారములిచ్చిన తామ్రశాసన పత్రములు ;

ఇప్పటి కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా కానుకొల్లు గ్రామమున 1935 సం॥ ప్రాంతమున మట్టికొరకు కోట గోడలను త్రవ్వుచుండగా, దొరకినవి. రాగిరేకుల గుదులు రెండును శాసనములు కలిగియున్నవి. రాజముద్రికయు, కడియము (రాగితీగెతో తగిలించినవనుట) 16 తులములు బరువున్నవి, ఈ శాసనము నందివర్మ మహారాజుయొక్క దానకార్యమును చాటుచున్నది. దానము వేంగీపురి నుండి చేయబడినట్లు ఆజ్ఞాపించబడెను, బప్పభట్టారక పాదపరిగృహీతుడైన నందివర్మ మహారాజు 'పిడహ' గ్రామమును తనకు ధర్మ, ఆయు బలము, వృద్ధిపొందుటకును, బాలక మహారాజగు కుమారఖండ పోతన (స్కంద పోతన) యశము వృద్ధి పొందుటకును, ఒకానొక రథకార కులజుడైన చతుర్వేదోపాధ్యాయునికి, అగ్రహారముగా, రథకార విధాన (వాస్తుపురుషార్చనముగా) దానముచేసెను, శాసనపు తేదిని విజయనామ సంవత్సరము పుష్యమాసము. కృష్ణపక్షము దశమి అని తెలుపబడినది.

నెల పేరు శుక్ల కృష్ణ పక్షములు తిథులు తెలిపిన శాసనములు. ఋతువులు తెలిసిన శాసనముల కంటె కొంచెము తరువాతవి. కావున యీ కారణమునుబట్టి కూడ విజయదేవవర్మ (రెండవ శాసన స్కందవర్మ) కంటె మన (యీ మొదటి శాసనం) నందివర్మ యెక్కువ ప్రాచీనుడని అతనికి నిశ్శంకగా పూర్వుడని నిశ్చయింప వీలగుచున్నది. కానుకొల్లుకు 5-6 మైళ్ల దూరమున పడమటి దిశగా పెయ్యేరు, అను ప్రాచీన అగ్రహారము కలదు. ఒకవేళ ఆ పెయ్యేరు, ప్రాచీనపు ఈ శాసనము

లోని 'పిడహా. కావచ్చు నని ఊహింపవచ్చును. జనులనోట పిడిహా పెయ్యి, ప్యేమె అయి పెయ్యేరు అగుటకు అవకాశమున్నది, ఈ శాసనము లన్నింటిలో ప్రతిగృహీత విషయము ముందుగా మనసు కెక్కును. అగ్రహారమును గ్రహించిన చాతువెజ్జు (చతుర్వేది) రధకార కులజుడు బ్రి॥ సూరిగుచ్చి కృష్ణమూర్తి ఎం. ఏ (మద్రాసు గవర్నమెంటు ఆర్ట్సు కాలేజి లెక్చరరు) గారి సహాయమున వేంగీప్రాకృత శాసన (4 రేకులు) సంస్కృతమును తెలుగు లిపి నొనర్చినట్లు ప్రచురించి యుండుటచే శ్రీ వారికి మా కృతజ్ఞత తెలుపుచు వాని నిట ప్రచురించు చున్నాను.

## ఆంధ్రము

విజయవేంగీ పురమునుండి బప్పభట్టారక పాదారాధనముచే అను గ్రహింపబడిన శ్రీనందివర్మ మహారాజు వాచాయిరీనిగా ఆజ్ఞాపించు చున్నాడు. 'పిడహా, గ్రామమునందు రాజాజ్ఞను యధావిధిగా పాటించు ముచ్చాద ప్రముఖునకును సర్వసమగ్రులైన వియోగులందఱికిని, కులపుత్ర కులకును, భటమనుష్యులకును (కావలి భటులు) మా యాజ్ఞను తెలుప వలయును, మాకు ధర్మము. ఆయువు, బలము, వృద్ధి పొందుటకును. బాలక మహారాజు కుమారఖండనికి (స్కందపోతనకు) యశము, బలము, సుఖము, వృద్ధి పొందుటకును, అభిలషించి మేము శాపానుగ్రహ సమర్థుడును. సనాతన గోత్రచరణ తపఃస్వాధ్యాయ నిరతుండును, అగు అగ్రహార వాస్తవ్యుండును, రథకార కులము వాడయిన చాతువెజ్జకు (చతుర్వేదికి) రథకార విధానముగా "పిడహ" గ్రామమును అగ్రహారముగా దానము చేసితిమి. ఆ యగ్రహారమునకు ఈ పరిహారములు కూడ యిచ్చినాము, రాజకీయోద్యోగులు చారులు మొదలైనవా రాయగ్ర హారమును చొరరాదు. ఏ రీతిగను రాజపురుషులు ఆ యగ్రహారమునందు జోక్యము కలిగించుకొనరాదు, రాజపురుషులు ఉప్పుచేసుకొనుటకై ఆ

గ్రామము నుండి చవిటిమట్టిని త్రవ్వుకొనువారు రాష్ట్రియులు అనగా రక్షక భటశాఖ పోలీసు ఉద్యోగులు ఆ గ్రామమునకు చొరరాదు. ఆ యగ్రహారము నుండి రాష్ట్రియులు మొదలైన నియోగము కలవారు. రాజ్యపాలన కార్యములందు అవసరమునుబట్టి వండిన యన్నము గుడ్డలు కుండలు సైనికులకు మంచములు, మొదలైనవి తెప్పించుకొనరాదు. ఆ యగ్రహారీకులకు కాయగూరలు విస్తళ్ళు, పుల్లలు, పూలు, పండ్లు పెరుగు పాలు నెయ్యి మొదలగు వస్తువులు రాజకీయోద్యోగులకు సాగింపను బాధ్యత లేదు. ఈ పరిహారములే కాక చిల్లర పరిహారములు కూడ అన్నింటిలో ఆ యగ్రహారమును దానము చేసితిమి, కావున యీ వృత్తాంతమును తెలిసికొని నియోగులందరు, ఆ యగ్రహారమున సర్వకర్మ పరిహారముగా కాపాడవలయును, ఎవరికైనను ఈ యాజ్ఞ నుల్లంఘించి అగ్రహారీకునకు ఎట్టి బాధను గాని, పీడను గాని కలుగజేసినచో వానిని తత్‌క్షణము యముడు చంపగలడు. (అనగా రాజశిక్షకు పాత్రుడగుచున్నాడు) ఇంతనొక విషయము, తా నిచ్చిన దానమునైనను పరనృపు డిచ్చిన దానములైనను, ఎవ డుద్ధరించి పాలించి రక్షింపడో వాడు జన్మజన్మములందు హాలాహలము కంటె భీకరమైన విషము త్రాగుచుండును. అనేకమంది రాజులచేత భూమి దానమీయబడినది, అనేకమంది నృపులచేత దానములు పాలింపబడినవి, వారి వారి కార్యములను బట్టి ఫలము ననుభవించుచున్నారు. విజయ రాజ్య వర్షములు 14 వ యేట వర్షర్తువు రెండవ పక్షమున ప్రథమ దివసమున ఈ దానము చేయబడినది, హస్తిస్వామి (గజ సైన్యమునకు సాహిణి కావచ్చును) ఈ శాసనమునకు అణత్తి (ఆజ్ఞప్తి) అనగా అమలులోకి తెచ్చువాడు, మఱియు కొగల మహారాజు పుత్రుడైన 'హడప్ప' శ్రేష్ఠమైన యీ దానమును కాపాడును. క్రీ. శ. 4 వ శతాబ్దమున శాలం

కాయన స్కందవర్మ మహారాజుచే రథకార చాతు వెజ్జకు (కొంపెర) క్షుద్రహారమను గ్రామమును దాన మీయబడినట్లు రెండవ కానుకొల్లు తామ్ర శాసనము ఈ క్షుద్రహార గ్రామము కానుకొల్లుకు సుమారు 10 మైళ్ళ దూరమున తూర్పు ప్రదేశమునన్న కోమర్రు గ్రామమని కొందరూహించుచున్నారు. "కొంపెర" గ్రామమే "క్షుద్రహార" మనియు అదియే రూపాంతరమును పొంది గుడివాడ యైనదనియు కొందఱు చెప్పు చున్నారు.

స్వస్తిశ్రీ విజయవేంగ్యా అనేక సమరముఖ విఖ్యాత కర్మ(ర్మ)ణః మహారాజశ్రీ హస్తివర్మణః ప్రపౌత్రస్య స్వప్రతాపావనీతాహిత వర్మణః మహారాజశ్రీ నందివర్మణః పౌత్రసక చతురుదధి తరంగాలింగిత యశ సోమ మహారాజశ్రీ హస్తివర్మణః పుత్రస్య భగవచ్చిత్ర రథస్వామి పాదాను ధ్యాతస్య మహారాజశ్రీ స్కందవర్మణో వచనేన కుద్రహారే ... గ్రామే, యథావక్తవ్యా అస్తి అస్మాభి రస్మత్కుల యశశ్రీ విజయ కల్యాణాభి వృద్ధయే ఏష గ్రామః రథకార వాస్తవ్యాయ చాతు ... ఘ్యాయ సర్వ పరిహారేణ బ్రహ్మదేయం కృత్వాదత్తః తదవగమ్య పూర్వ మర్యాదయసాధుప్రేమాం కర్తవ్యమపిచ సర్వ నియోగనియుక్తా యుక్తా ... తం గ్రామం పరిహారస్తు ప్రవర్తమాన శ్రీ విజయరాజ్య సంవత్సరే ప్రథమే కార్తికమాస శుక్ల పక్ష ప్రతిపధి దత్తా పట్టికా బహుభిర్వసుధా దత్తా వసుధా వసుధా ధిపైః యస్య యస్య తదాభూమి తస్య తస్య తదాఫలమ్ ॥

## ఆంధ్రము

స్వస్తిశ్రీ అనేక సమరములందు విఖ్యాతమైన వీరకృత్యములు

నెరపిన మహారాజశ్రీ హస్తివర్మకు ప్రపౌత్రుడును, తన ప్రతాపాతిశయము చేత శత్రువుల కవచములను భేధించిన శ్రీ సందివర్మ మహారాజునకు పౌత్రుడును, నాలుగు సముద్రముల తరంగములచేత ఆలింగనము చేసుకొనబడి వ్యాప్తమైన యశముగల రెండవ హస్తివర్మ మహారాజునకు పుత్రుడును, చిత్రరథస్వామి పాదములను ధ్యానము చేయువాడును, బప్పభట్టారక పాదభక్తుడును, శాలంకాయనుడును అగు శ్రీ స్కందవర్మ మహారాజు కొప్పెర గ్రామవాస్తవ్యులైన గ్రామస్థులకు ఈ విధముగా తెలుపవలసిన దనుచున్నాడు, ఇట్లగుగాక మా కులము. యశము, సిరి, విజయము, కల్యాణము అభివృద్ధి నొందుటకొరకు ఆ గ్రామమును (కొప్పెర గ్రామమను రథకార వాస్తవ్యుడు, చతుర్వేదికి సర్వపరిహారము తోడను అనగా ఎట్టి పన్నులు బాధ్యత లేకుండచేసి, బ్రహ్మదేయముగా విడదీసి యొసగినారము. ఈ వృత్తాంతమును తెలిసికొని పూర్వ మర్యాద ననుసరించి ప్రతిగృహీతను ప్రేమతో ఆనందించెదరు గాక, మఱియు అన్ని వియోగముల వారును నియుక్తకులు, అయుక్తకులు అనగా రాజకీయోద్యోగు లందఱును ఆ గ్రామమును తమ ఆధికారములోనుండి తీసివేయుదురుగాక. ఈ పట్టిక ప్రవర్తమాన విజయరాజ్య సంవత్సరము ఒకటవయేట కార్తిక శుక్ల పాడ్యమినాడు ఒసగబడినది. అనేకమంది భూమీశులు అనేక విధములుగా భూమిని దానమిచ్చిరి. ఎవరేరీతిగా దానమిచ్చిరో వారా రీతిగా అత్యంత పుణ్యఫలము ననుభవించుచున్నారు. మానవసృష్టియైన నాటినుండి నేటివరకు విశ్వబ్రాహ్మణులగు రథకార బ్రాహ్మణుల పూర్వాపరములు. బ్రాహ్మణత్వ ఋషిత్వ దేవత్వములు సమస్త శిల్పాభివృద్ధులు షణ్మత స్థాపనా చార్యత్వము రాజు సభాగౌరవము

లోకమెఱిగియున్నను కొందఱు అసూయాది దుర్గుణములలో భూతావేశమును జోలిన సంభాషణోత్సాహులై యున్నను సంపూర్ణ పాండిత్యము శమదమాది సుగుణ సంపత్తి కలవారు సత్యమును గ్రహించి లోకమున కెఱుకపఱచి ప్రజానీకమును సత్ప్రవర్తనలజేయ దలంచుచుందురు. ధర్మంచర సత్యం వద అను వాక్యములను మఱచువారు సభాపూజ్యులు కాజాలరు.

సంపాదకుడు
విమర్శకాచార్య, శిల్పకళాకోవిద
**స్వర్ణ సుబ్రహ్మణ్యకవి**
ఆంధ్రశిల్పకళా పరిషదధ్యక్షుడు
ది. 20-6-79



గిరిధర్మర్షి గోత్రజులగు

బ్రా॥ శ్రీ తుమపాల సన్యాసిరాజాచార్యులు, లింగమాంబ

దంపతులు

శ్రీ

శ్రీ విశ్వకర్మ పరబ్రహ్మణేనమః

# విశ్వబ్రాహ్మణులకు ప్రథమ సత్కార్వార్త

క్రీ. శ. 1899 వికారి సంవత్సరమున కృష్ణాజిల్లా నూజివీడు తాలూకా, బాహుబవేంద్రపురమను అగ్రహారములో యజనాది షట్కర్మనిరతులును వేదమూర్తులును, శమదమాది సుగుణ సంపన్నులును, వయోజ్యేష్ఠులును, అగు శ్రీ బొమ్మగంటి జోగిచయనులు గారొనర్చుచున్న నాచికేతుక్రతు సమాగత వేదవేదాంగాది సర్వశాస్త్ర పారంగతులును, కర్మజ్యేష్ఠులును అగు మహాపండిత సమాజము వారికిని.

తద్గ్రామవాసియును, పౌరుషేయ బ్రాహ్మణును, అహభూన గోత్రోద్భవుడును, వింజవరపు శంభులింగాచార్యుల పుత్రుండును, సుబ్రహ్మణ్యాచార్య పాకయాజిగారికిని ప్రశ్నోత్తర పూర్వకముగా జరిగిన విశ్వబ్రాహ్మణులకు ప్రథమ సత్కార్వార్తను గురించిన శ్రుతిస్మృతి పురాణేతి హాసాది దృష్టాంతములతో విమర్శించి లోకమున కెఱుక పడునట్లు వ్రాయించి యిప్పించిన తీర్మానమునకు సరియైన గ్రంథమును శ్రీ వింజవరపు పున్నయ్యగారు. క్రీ. శ. 1900 లలో చెన్నపట్నమునకు బోయి శ్రీ నేలటూరి రామానుజయ్యగారి విద్యాతరంగిణీ ముద్రాక్షరశాలయందు ముద్రింపించి ప్రకటించి యుండిరి. వర్తమాన 1979 సిద్ధార్థిలో పరిశీలించగా ఆ గ్రంథము లెచ్చటను కనుపించక పోవుటయు, సంఘమునకత్యంతోపకారముగ గన్పట్టుచున్నందున ఇట్టిలో దీనిని పునర్ముద్రణమొనర్చ దీక్షవహించెదనని శ్రీ తుమపాల విజయశేఖరాచార్యులుగారు నన్ను గట్టిగా పట్టుపట్టినందున మూలమును భిన్నము కానీయకుండ తగిన యాధారములను గ్రంథములను గూడ చక్కగా పరిశీలించి నిర్దుష్టముగా వ్రాయబూనితిని.

# సుబ్రహ్మణ్యాచార్య పాకయాజిగారి విజ్ఞాపన పత్రిక

శ్రీ మద్యజనాది షట్కర్మ నిరతులును, శ్రీ వేదమూర్తులునగు బాహుబవేంద్రుని అగ్రహారములో శ్రీ బొమ్మకంటి జోగిచయనులు గారొ నప్పు నాచిరేతుక్రతు సమాగత విద్వత్సమాజము వారికి ఏతద్గ్రామ నివాసియు, పౌరుషేయ బ్రాహ్మణుడును, అహభూనగోత్రుడును, వింజ వరపు శంభులింగాచార్యుల పుత్రుండును, అగు సుబ్రహ్మణ్యాచార్యులు వ్రాసుకొనిన విజ్ఞాపన పత్రిక ప్రథమమునుండి షట్కర్మాధ్యధికారములు గల మాకున్ను, వైశ్యులకున్ను, ఇప్పుడు తాంబూల, మంత్రపుష్ప, శివాభిషేక, రుద్రపాద, శఠగోప, ఇత్యాదులయందు, ప్రథమ సత్కార విషయమై వివాదగ్రస్తమై యున్నది. ఇందువిషయమై జాత్యనుసారముగా సర్వకర్మలయందు ప్రవర్తింపజేయు వారలకు మీరు జాతి ధర్మ కర్మా ధారులగు వేదశాస్త్ర శ్రౌత స్మార్తాద్యనేక గ్రంథస్థమైనటువంటిన్ని, మామతానుసార గ్రంథములలో నుండునట్టి న్యాయమును చక్కగా పరిశీలన చేసి సహేతుకముగ పర్యవసానమును తెలియపరచ వేడెదను, నిర్ణగించ వలెను.

## సమాజము వారు చేసిన ప్రశ్నలు

1) ప్ర॥ ఇదివరలో ఈ దేశమందు ఈ పౌరుషేయ బ్రాహ్మణులకు ప్రథమ సత్కారము యే యే కాలమందు జరిగియున్నది. సాదృశ్య సహితముగను జవాబు చెప్పవలసినది.

ఉత్తరము :- మాకు నూతన దేవాలయములకు శంకుస్థాపన (ఆధార శిలాన్యాసము) చేసేకాలమునను, యజ్ఞాదులయందును, యూపప్రతిష్ఠ కాలమందునను, నూతన గృహప్రవేశ కాలమందునను, వివాహోపనయన కాలముల యందునను, సభల యందునను, గంధపుష్ప తాంబూల వస్త్రా భరణములతో బ్రాహ్మణాది చతుర్వర్ణములవారును బహూకరించడము విశదమైయే యున్నదికదా ?

2) ప్ర॥ వైశ్యులకు మీకు వివాదము జరుగుటకు కారణమేమి ?

ఉ :- వారలు ఐశ్వర్యోపేతులగుట వలన ధనాది దానములచేత కొంత మంది బ్రాహ్మణులను, శివాలయములలో శివార్చకులను, విష్ణ్వాలయములలో కూడ వైఖానసులులను, ధనాదులతో సంతుష్టి పఱచుచు, వారివల్ల అభిమాన పూర్వకముగా (అనగా తెలియని ధనాశ చేతననుట) మాకు పూర్వము నుండి యేర్పడియున్న ప్రథమ సత్కార స్థానమును నాక్రమించుకొనుటకు శుభపు యోజనములు జరుగు సమయములయందు ప్రయత్నము చేయుచుండగా మాకును మా బంధువులకును, అప్పుడప్పుడు వారితో వివాదము జరుగుచున్నది. అందువలన పెద్దల నాశ్రయించ వలసి వచ్చినది.

3) ప్ర॥ బ్రాహ్మణాది చతుర్వర్ణములలో మీరేవర్ణ సంభూతులరు ? మీ కర్మ వేదోక్తమైనదా ? లేక పురాణోక్తమైనదా ?

ఉ॥ బ్రహ్మముఖావిర్భూతమైన బ్రాహ్మణజాతి పౌరుషేయమని విదితమైయున్నది, పౌరుషేయులమగు మేము విశ్వబ్రాహ్మణుల మనియు రథకార బ్రాహ్మణులమనియు, లోకములో ప్రసిద్ధమై యున్నది. మేము చేయు కర్మలు వేదోక్తమైనవి. కాని పురాణోక్తములు కావు.

4) ప్ర॥ మీరు బ్రహ్మముఖము వలన పుట్టినటువంటివారు. పౌరుషేయ బ్రాహ్మణులనుటకు శ్రుతి, స్మృతి, పురాణాది సాదృశ్యము లెవ్వియైనను కలవా ?

ఉ :- మాకు శ్రుతి, స్మృతి, పురాణచోదితములగు దృష్టాంతములు పెక్కులు గలవు. అవియేవి యనగా॥ (1) శ్రుతి, యజుర్వేదే, చతుర్థాష్టకే షష్ఠప్రశ్నే, తృతీయోఽనువాకః ॥

ప్రాచీదిశాం వసంతఋతూనామగ్నిర్దేవతా బ్రహ్మద్రవిణం త్రివృత్స్తో

మః స ఉపంచదశవర్తని స్త్ర్యవిర్వయః కృతమయానాం పురోవాతోవా

స్వానస్స ఋషిః॥ దక్షిణాదిశాం గ్రీష్మ ఋతూనామిన్ద్రో దేవతా క్షత్త్రం ద్రవిణం పంచదశస్స్తోమః స ఉపంచదశవర్తని ర్దిత్య వాడ్వయ స్త్రేతా యానాం దక్షిణాద్వాతోవాతః సనాతన ఋషిః॥ ప్రతీచీ దిశాం వర్షా ఋతూనాం విశ్వే దేవా దేవతా విట్॥ ద్రవిణగ్ం సప్తదశస్స్తోమ స్స ఉ వే కపఞ్చశ వర్తని స్త్రివత్సో వయోద్వాపరో౽ యానాం, పశ్చాద్వాతో వాతో౽హభూన ఋషిః॥ ఉదీచీ దిశాగ్ం శరదృతూనాం మిత్రావరుణౌ దేవతా పుష్టంద్రవిణమేకవిగ్ంశ స్తోమః స ఉత్రిణవ వర్తనిస్తుర్య వాడ్వయ ఆస్కందో యానాముత్తరాద్వాతోవాతః ప్రత్న ఋషిః॥ ఊర్ధ్వా దిశాగ్ం హేమంతశిశిరావృతూనాం బృహస్పతిర్దేవతా వర్చోద్రవిణం త్రిణవస్తోమ స్స ఉత్రయస్త్రిగ్ంశ వర్తనిః. పుష్టవాడ్వయో౽భి భూరయా నాం విష్వగ్వాతోవాతః సుపర్ణ ఋషిః॥ పితరః పితామహాః పరేవరే తే నః పాంతుతేనో౽వంత్వస్మిన్ బ్రహ్మన్నస్మిన్ క్షత్త్రేస్యాన్నాశిషస్యాం పురోధాయామస్మిన్ కర్మన్నస్యాం దేవహూత్యాం॥

విద్యారణ్యభాష్యము :- హే ఇష్టకే! దిశాంమధ్యేయా ప్రాచీ, సాత్వమసి, ఋతూనాంమధ్యే, యోవసంతః, త్వం తద్రూపాసి, దేవతానాం మధ్యే, యో౽గ్నిః, తం తద్రూపాసి, స్వకీయత్వేన సంపాదనానాంమధ్యే విశిష్టబ్రాహ్మణ్యరూపం, యద్ధనం, తద్రూపాం, త్వమసి, స్తోమానాంమధ్యే త్రివృన్నామకః, యస్తోమఃవర్తా, త్వం, తద్రూపాసి। స ఉ. సో౽పి, త్రివృత్స్తోమః, పంచదశవర్తనిః, పంచదశస్తోమస్య ప్రవర్తకః। బహిష్పవమానస్తోత్రే, త్రివృత్స్తోమఃప్రవర్తా, సత్యాంతతఊర్ధ్వం భావిషు ఆద్యస్తోత్రేషు, పంచదశస్తోమః ప్రవర్తంతే, తత్ప్రవర్తనరూపా త్వమసి। వయసాం

మధ్యే త్ర్యవిసార్ధ సంవత్సరరూపం, యద్వయ స్తద్రూపాత్వమసి. త్ర్య
విశబ్దః సార్ధసంవత్సర, ముపలక్షయతి, అవిజాకాత్ప్రాయేణ గర్భధారణ
మారభ్యసార్ధమాస్యేవ శిశుర్జాయతే, త్రిసంఖ్యాకాః, అవిజన్మకాలాః యస్య
వయసఃతతో త్ర్యవిసహిచోచ్యతే, అయానాం యుగానాం మధ్యేయతో
కృతయుగం, తద్రూపాత్వమసి, నాయూనాంమధ్యే, పురోవాతోవాయుః
తద్రూపాత్వమసి, ఋషీణాంమధ్యేపానగాఖ్యః। తద్రూపాత్వమసి, సోఽపి
మహానుభావః॥ దక్షిణస్యాం దిశ్యుపదేయానాం ఇష్టకానాం మంత్రమాహ ॥
దక్షిణాదిశాం సనాదనఋషిః ॥ మా ధ్యందినపవమానే. పంచదశస్తోమ మను
ష్ఠాయ తత ఊర్ధ్వంగావిషుపృష్ఠస్తోత్రేషు, సప్తదశస్తోమోఽనుష్ఠాతవ్యః.
తథా సం॥ర పంచదశస్తోమః, సప్తదశస్తోమ పరివర్తయతి, యా పరివర్తన
శక్తిః, పాత్వమసి, వయసాంచమధ్యే ద్విసంవత్సర రూపాసి, దిత్య
వాతో శబ్దేన సంవత్సరద్వయము పలక్షతే. దిత్యంపురుషంబాలం, వహతీతి
దిత్యవాట్ అన్యాదిబేదేయః కశ్చిదవాంతర జాతిరేశకః, ససంవత్సరద్వయేన
బాలంవహతీతి దిత్యవాడితి దిత్యవాట్ఛబ్దః సంవత్సరద్వయోపలక్షకః,
దక్షిణాత్, దక్షిణస్యాందిశి, సప్తమ్యర్థకావ్యయతో శేషంపూర్వవత్ ॥
ప్రతీచీదిశామహభూనఋషిః. త్రయోవత్సాః యస్యాసాత్రివత్సః, తత్సరి
మితం, యద్వయః తద్రూపాత్వమసి, అయానాం యుగానాం మధ్యే
ద్వాపరః, తద్రూపాత్వమసి, పశ్చిమవాతరూపోఽసి, అహభూనఇతికస్య
చిదృషేర్నామసతు మహాప్రభావః, త్వష్టవాణా యజ్ఞాది ప్రవర్తకః ॥
ఉదీచీ దిశాం ప్రత్నఋషిః, పుష్టశబ్దం వర్ణత్రయపోషకత్వా చ్ఛూద్రజాతి
మాచష్టే, ఆతఏవనాజనసేయినః, సహూమనంతి, సశౌద్రంవర్ణ మసృజత
పోషణమితితురీయం చతుర్థసంవత్సరం వహతీతి, తుర్యవాతో సార్ధత్రి
వత్సరః ధర్మాన్ అస్కందయతీవ్యాస్కందః, కలియుగయాగాది ధర్మాన్,
శిథిలయతి, ప్రత్నయితి, కస్యచిదృషేర్నామ॥ ఊర్ధ్వాదిశాం సువర్ణఋషిః,
పర్చ్ఃబలంచతుర్ష్వపి వర్ణేషు, వయోబలవాన్ తద్రూపం ధనంత్వమసి,
పృష్ఠే, పృష్ఠే భారంవహతీతి పృష్ఠవాతో స ఏవవదకారాంతశబ్దే న ఉచ్యతే

వర్ష చతుష్టయకాలరూపోసి, కృత్స్నంధర్మం అభిభవతీత్య భిభూః కల్యావసానకాలః, తదూర్ధ్వపాత్వమసి, నానాదిక్షు సాంకరేణ్య, సంచరన్ నాయుః విష్వగ్వాతః, సుపర్ణఇతి కశ్చిదృషిః, సోఽపిమహానుధావః ॥ పితరః పితామహాః, పరేవరేతేనః పాంతుతేనోఽవంతస్మిన్ బ్రహ్మన్నస్మిన్ క్షత్రేస్యామా శిష్య స్యాం పురోధాయా మస్మిన్ కర్మన్నస్యాం దేవహూత్యాగ్ం స్వాహా ॥ హేపితరః, హేపితామహాపి, హేపరే ప్రపితా మహాదయః, ఆపరేధాత్రృ పుత్రాదయః, ఈదృశాః యేభవంతః, స వి వేనః అస్యాన్ పాంతు పాలయంతు, ఆవంతు, రక్షంతు, అస్మిన్ బ్రహ్మన్ అస్యాం బ్రాహ్మణజాతౌ అస్మిన్‌క్షత్రే, అస్యాం క్షత్రియజాతౌ, అస్యామాశిషి ఏతస్యాం కామనాయాం, అస్యాం పురోధాయాం, రాజపౌరోహిత్య, వృత్తౌ అస్మిన్‌కర్మణి దేవతాహ్వాన క్రియాయాం హేఇష్టకే త్వా ముపదధామి ॥

ఆంధ్రతాత్పర్యము:- ఇష్టతోపధానమందు అయిదు ఇష్టకలయందును సానగ సనాతన, ఆహభూన, ప్రత్న, సుపర్ణ అను ఆయిదుగురు ఋషులును, ఐదుస్థలములయందును, ఆరాధించుచున్నారు. ఇందుముాడవఋషి అయిన అహభూన ఋషిని, విద్యారణ్యులవారు కశ్చిృషిః మహాప్రభావః, ప్రష్టవాణాం యజ్ఞాది ప్రవక్తః, అని వ్రాసి యున్నారు. మాకు గోత్రములు వేద చోదితములై యున్నవికదా ?

బ్రహ్మాండ పురాణే। స్కాందపురాణ నాగరఖండే।

శ్లో॥ బ్రాహ్మణానాకులం పూర్వం। ద్వేధావిరచితం సురైః।
ఆర్షేయం పౌరుషేయంచ జన్మ కర్మ విశేషితః (1)

ఆర్షేయంతు వసిష్టాద్యా హ్యాముష్మిక్ మునిసత్తమాః।
పౌరుషేదు మితిఖ్యాతం, పంచగోత్రం మహత్కులం॥ (2)

(వజ్రసూచ్యపనిషత్) - (శిల్పశాస్త్రే)

జన్మనాజాయతే శూద్రః। కర్మణా జాయతే ద్విజః ॥
వేదపాఠేన విప్రస్స్యా ద్బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణః (3)

శ్లో॥ విశ్వకర్మ కులేజాతః గర్భేబ్రాహ్మణ నిశ్చయం।
శూద్రత్వం నాస్తితద్వంశే బ్రాహ్మణో విశ్వకర్మణః॥
మనుర్మయ స్తథా త్వష్టా శిల్పీవిశ్వజ్ఞ ఏవచ।
పంచైతే దేవఋషయో విశ్వకర్మ ముఖోద్భవాః॥

అనియును- ఈ విశ్వకర్మ వంశజులు పౌరుషేయు లనియును, దేవఋషులైన సానగాది పంచఋషుల గోత్రజులనియును, బ్రాహ్మణు లనియును పై శ్లోకముల వల్ల తెలియుచున్నది తద్వంశజులకు

స్కాందే నాగరఖండే ఈశ్వర ఉవాచ

శ్లో॥ ఏకః పంచాననో విశ్వ కర్మాజజ్ఞే షడాననః।
ముఖేభ్య స్తస్య పంచభ్యః కుమారాః పంచజజ్ఞిరే।
వదనేభ్యోథ ఇత్యేషాం పంచపంచ కుమారకాః।
శతంచ వింశతిః పంచ వంశజా విశ్వకర్మణః॥

ఇందులో మనువు సానగ గోత్రుడు మయుడు సనాతన గోత్రుడు త్వష్ట అహభూన గోత్రుడు, విశ్వజ్ఞుడు సుపర్ణ గోత్రుడు, ఈ విధమున మాకు నూట యిరువదియైదు గోత్రములు పారంపర్యముగా వచ్చుచున్నవి. ఇట్లు శ్రుతి స్మృతిపురాణసాదృశ్యములవలన ఈ విశ్వబ్రాహ్మణులు యోగ్యు లనియును, వీరి గోత్రములుగా నుండు సానగాది పంచమహర్షులు మహాను భావులనియును, సర్వకర్మలకుధారభూతులనియును, సమాజమువారికి గోచర మైనది కదా? మేము బ్రహ్మముఖావిర్భూతులమయిన- బ్రాహ్మణుల మనుటలో సందియము లేదు.

(5) ప్ర॥ ఈ విశ్వబ్రాహ్మణులు ఉపనయనాది కర్మలను ఏ కాలముల యందు జరుపుకొనుచున్నారు ?

ఉ:- నాగరఖండే

శ్లో॥ విశ్వకర్మ సుతాశ్చైతే తద్వంశానాం విశేషితః।
వర్షే గర్భాష్టమేచైవ ద్విజత్వం క్రియతే సదా॥

కర్తవ్యంత ద్విశేషేణ హ్యాచార్యేణ సమాధినా ।
వసంతేమనువంశానాం గ్రీష్మేమయ భువాంతథా ॥
త్వష్టృణాం శరదిప్రోక్తం మతం ప్రావృషి శిల్పినాం ।
విశ్వజ్ఞానాంచ శిశిరే శ్రేష్ఠం బ్రహ్మత్వ కర్మణి ॥
మాఘ ఫాల్గున వైశాఖ చైత్రజ్యేష్ఠాశ్చ శ్రావణే ।
కార్తికేమార్గశీర్షే వా హ్యుపనీత విధిక్రమః ॥

ఈ పై జెప్పబడిన శాస్త్రముల ప్రకారము మేము ఉపనయనాది బ్రాహ్మణకర్మ కలాపములను చేయుచుందుము.

(6) ప్ర॥ ఈ పౌరుషేయ బ్రాహ్మణులు విశ్వకర్మమయుడు మొదలగు మహనీయు లాచరించిన యజ్ఞాది క్రతువులు ఇష్టకలు పాషాణాది నిర్మాణములను చేయుచున్నారా ?

ఉ:- తద్వంశజులమైన మాకు శిల్పశాస్త్రే నాగరఖండే

శ్లో॥ విశ్వకర్మకుల శ్రేష్ఠోధర్మజ్ఞో వేదపారగః
సాముద్రం గణితానాంచ జ్యోతిశ్శాస్త్రే స్తథైవహి ॥

లోహపాషాణ కాష్ఠానా మిష్టకానాంచ శర్కరే।
సుధానాం చిత్రకానాంచ విద్యాశ్చైషష్టికర్మకః ॥

సూత్ర శాస్త్ర క్రియా ప్రాజ్ఞోవాస్తు విద్యాబ్ధి పారగః ।
శైవవైష్ణవ శాక్తేయ గాణాపత్యంచ సౌరవమ్ ॥

కాపాలికంషడ్దర్శం నిర్మితం స్థాపనంతథా ।
శ్రౌతస్మార్తక్రియాప్రాజ్ఞో మంత్రతంత్రార్థ కోవిదః ॥

సంకల్పంచాసు వాకంచ మార్జనంచాఘ మర్షణం ।
పంచాంగ లక్షణం స్నానం సంధ్యాది జపతర్పణమ్ ॥

పంచయజ్ఞ మహాధ్యానం వైశ్వదే వంచసంతతమ్।
సత్యవాక్యం సదాచారం విద్యాకుశల బుద్ధిమాన్ ॥

సర్వలక్షణ సంపన్నః సర్వావస్థా సుశోభితః
ఆరోగ్యంచ ప్రమాణేన స_ప్తవ్యసన వర్జితః ॥

వేదకర్మా సదాచారః ఏకపత్నీ పుత్రి_స్తథా।
మనుసూత్రాది శాస్త్రజ్ఞో గుణవాఁసత్యవాచకః
ఏవంగుణగణై ర్యు_క్తః శిల్పాచార్యస్య లక్షణం ॥

పైన నుదహరింపబడిన శ్లోకోదాహరణముల ప్రకారము ఈ విశ్వ బ్రాహ్మణులు వేదాధ్యయనము, సాముద్రికము గణిత శాస్త్రము, జ్యోతి శ్శాస్త్రము, ఛందస్సు, లోహ పాషాణ కాష్ఠాదివృ_త్తుల యొక్క ధర్మములు చతుష్షష్టి విద్యలయొక్క రహస్యములు. వాస్తువిద్యాధ్యయనము, శైవ, వైష్ణవ శా_క్తేయ గాణాపత్యసౌరబౌద్ధషడ్దర్శనాది మతములయొక్కసాంప్రదాయాదులు నిర్మించడము, శ్రౌతస్మార్తాదికర్మములయందు ప్రవ_ర్తకత్వము బ్రహ్మయజ్ఞ, దేవయజ్ఞ భూతయజ్ఞ, మనుష్య యజ్ఞములు, వైశ్యదేవాది షట్కర్మలు, ఆధానాది నిరతత్వము, సత్యవాక్యము ఇత్యాదులయందు ప్రవ_ర్తించు చుండవలసినదని శ్రుతిస్మృతులయందు సిద్ధాంతమై యున్నది కొన్ని స్థలములయందు కొందఱు చక్కగా ఈ కర్మలు మొదలైనవి జరుపుకొనుచున్నారు. అందఱు ఈ కర్మలు బాగుగా జరుపుకొనుటకు ఋత్విక్ సంపద తక్కువగా నుండే కారణమువల్ల లోకులకు విపులముగా కనుపించుటలేదు. ఈ హేతువును బట్టియును, మీరు విచారించకుండుట యును, కర్మలను జరుపుకొనుట కలదా? అని చేసిన ప్రశ్న ఇతర జన మనోరంజనము కాదు. మీలో ఋత్విక్ సంపద బహుళముగా నుండినను అందఱును ఆచరించుటయును లేదు.

(7) ప్ర॥ ఇంత ఉత్కృష్టత్వముగల మీవంశము విషయమై అమరములో అమరసింహుడుచేసిన –

శ్లో॥ రథకారస్తు మాహిష్యాత్ కరణ్యాం యస్య సంభవః ।
స్యాచ్చండాలస్తు జనితో, బ్రాహ్మణ్యాం వృషలేనయః ॥

ఈ శ్లోకమును బట్టిచూడగా రథకారులు సాంకర్యులని తోచెడిది. దీని విషయమై సహేతుకమగు ఉత్తరమీయగలరా ?

ఉత్త॥ అమరేణకృతేరూప్యే, నామలింగానుశాసనే, తద్వక్త్రే క్రిమి జాతంస్యాత్, ద్విశ్వకర్మాన్వయం పునః ॥ మూలస్తంభేన గ్రంథేన, తద్వ్రం శాధిక్యకర్ణనం, కరిష్యామితి వక్తారం రక్షమాం చ జగద్గురో ॥ దేవదేవ మహాదేవ, విశ్వకర్మన్ నమోఽస్తుతే, అని మూలస్తంభ పురాణ రచనకు భక్తితో పూనినాడు. శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణుః గురుర్దేవో మహే శ్వరః, గురుఃసాక్షాత్పరబ్రహ్మం, తస్మై శ్రీగురవేనమః ॥ వాచాతీతం, మనోఽతీతం, భావాతీతం, పరంశివం, నాదబిందు కళాతీతం, తస్మై శ్రీగురవేనమః॥ సమస్తుంగ శిరస్తుంభి, చంద్రచామరచారయోః, త్రైలోక్య నగరారంభే, మూలస్తంభాయ శంభవే ॥ శ్రీమత్పరమశివునియొక్క లీలా వినోదమహోన్నతకరమగు నట్టి మూలస్తంభ పురాణమును నుడివెదను, గాన అట్టి త్రిలోక నగరారంభమునకు మూలముగా ఛత్ర చామర కలశ స్వరూపమును పొందిన పరమాత్మైక యీశ్వరునికి నమస్కారము. శ్లో॥ న భూమిర్నచలంచైవ న తేజో నచ వాయవః, నచ బ్రహ్మా నచ విష్ణు. నచ నక్షత్ర తారకాః, సర్వాహ్యస్య నిరాలంబం, స్వయంభూః విశ్వ కర్మణః॥ భూమిలేనివేళయందును,పర్వతములులేని వేళయందును, తేజస్సు లేనివేళయందును, వాయువులేని వేళయందును, ఆకాశములేనివేళయందును, బ్రహ్మలేని వేళయందును, విష్ణువులేని వేళయందును, నక్షత్రాదులు లేని వేళయందును, విశ్వకర్మ స్వయంభూరూపమై జనియించెను. ఇట్లని శ్లోకార్థ మునకు శ్రుతి. శ్లో॥ చతే బ్రహ్మాచతేవిష్ణు శ్చతే రుద్రాస్తథైవచ, తేవిశ్వం, కర్మనామోహ, వేదవాక్యం యథాశ్రుతిః ॥ బ్రహ్మదేవుడును, విష్ణువులు, ఈశ్వరుడును, విశ్వకర్మయనేపేరు వేదవాక్యమందు చెప్పె యున్నది. శ్లో॥ హేబ్రహ్మశ్చ, హేవిష్ణుశ్చ, హేరుద్రాశ్చ, హేవిశ్వకర్మ నామైవ, వేదేవదన నిర్ణయమ్ ॥ ఓయి బ్రహా, ఓయి విష్ణూ, ఓయి రుద్రా, ఓయి విశ్వకర్మాయని వేదాలయందు నిర్ణయమాయెను. ఇట్లారం

భించిన యీ మూలస్తంభపురాణము జర్మనీలో బెర్లిన్ నగరమునగల గ్రంధాలయములోగూడ నున్నది. శ్రీమత్పరశివవిశ్వకర్మలీలా వినోదంబను మహిమతో ప్రకాశించుచున్న సమయమున చెన్నపురియందు శ్రీమాన్ శ్రీనివాసాచార్యులుగారు 1915లో తాత్పర్యమువ్రాసి ఓసింగారవేలుమొదలి యార్‌వారి అమెరికన్‌డైమండ్ ప్రెస్సులో ముద్రింపించి ప్రకటించిరి.

శ్రీ బమ్మెర పోతనామాత్య కవిగారు ....

> ''భాగవతప్రబంధమును భాసురలీల రచింపదక్షుడు।
> ర్యాగ కథాప్రసంగముననాడిన వాక్కులకారణంబుగా
> నాగతవక్త్రిదోషపరిహారముగా శివదీక్షతోడ శై
> వా గమ వీరభద్ర విజయంబురచింతు జగత్ప్రసిద్ధిగన్ ॥

అని వచించి వీరభద్రవిజయమును వ్రాసిరి.

ఈ మూలస్తంభమనుగ్రంధము ; విశ్వకర్మ జగత్ సృష్టి విషయమైనదియేకాని లోకులకు సామాన్యముగా చదువదగినంత యవసరమైనది కాకుండుటచే ఆగ్రంధములు ఎచ్చటనో ఒకానొకచోట లభించుటగాని, ఏదైన విశాలయమైన గ్రంధాలయమున్నచో అచ్చటలభించునేమో ? రథకారుడు బ్రాహ్మణుడనుటకు వ్యాకరణశక్తి "ధాతు ప్రకృతి ప్రత్యయాదీనాంశక్తి గ్రహః వ్యాకరణాద్భవతి" అను వ్యాకరణసూత్ర వాక్యమువలన ధాతు, మూల, శబ్ద, ప్రత్యయాదులనుండి వ్యాకరణశక్తి గ్రహింపవలెనని తెలియుచున్నది. "కుర్వాదిభ్యోణ్యః" అనునది పాణిని సూత్రము. 4-1-151 గణసూత్రము. ఈ గణపాదమధ్యమందు కురు, గర్గ, మంగుష, అజమార, రథకార, వావదూక, కవి, మతి. కపింజల, ఇత్యాది 47శబ్దములు. కుర్వాది గణాంతములు, మధ్యంగతరథకార శబ్దపఠితములు. అందుచే రథకార శబ్దమునకు బ్రాహ్మణశబ్దముయొక్కశక్తి సాపేక్షత కలుగుచున్నగుది, రథకార శబ్దపఠితమైన కుర్వాదిగణము. బ్రాహ్మణజాతి బోధకమగు ణ్య, ప్రత్యయాంత నిపతితమగుటయె యిందులకు కారణము. అనగా కురుశబ్దము,

మొదలుకొని వావదూక్యశబ్దమువఱకు, అపత్యార్థమునందు ణ్యప్రత్యయాంత నిపాదితములై బ్రాహ్మణజాతి బోధకములగును. (కుర్వాదిభ్యోణ్యః, 4-1-151) అపత్యే కౌరవ్యాః బ్రాహ్మణా, వావదూక్యాః, ఉదా॥ "క్షౌరవ్యాః" కురుకులోత్పన్న బ్రాహ్మణాః) "గార్గ్యాః" (గర్గకులోత్పన్న బ్రాహ్మణాః) "మంగుష్యాః" (మంగుకులోత్పన్న బ్రాహ్మణాః) "అజమర్యాః" (అజమరకులోత్పన్న బ్రాహ్మణాః) "రాథకార్యాః" రథకారోత్పన్న బ్రాహ్మణాః) మాత్యాః, కావ్యాః, కాపింజల్యాః, నావదూక్యాః, బ్రాహ్మణాః, ఈయుదాహృత వాక్యములవలన రథకారశబ్దము బ్రాహ్మణ పర్యాయముగ పరిగణింపబడుట నిస్సందేహము. మఱియు, పాణిని సూత్రము, శిల్పినిచాకృఞః, 6-2-76 - శిల్పివాచినిసమాసేఽణ్ణంతే పరే పూర్వమాద్యుదాత్తం, నచేదణ్ కృఞఃపరోభవతి, తంతువాయః, శిల్పిని కిం, కాండలావః, అకృఞః కిం, కుంభకారః॥ పాణినిసూత్రం, సంజ్ఞాయాంచ 6-2-77॥ అణ్ణంతేపరే, తంతు వాయోనామకృమిః. అకృఞఇత్యేవ రథకారోనామబ్రాహ్మణః॥ పూర్వోక్తమగుఅణ్ ప్రత్యయాంతశబ్దము సంజ్ఞా వాచకమై శిల్పి వాచకమయ్యేనేని ఆద్యుదాత్తమగును. ఉదాహరణము:-

తంతువాయః (ఒకే ప్రకారము తంతురచనచేయు సాలెపురువు.)

కృఞ్ ధాతువు, అణ్ ప్రత్యయాంతము, సంజ్ఞార్థకము, శిల్పివాచక మయ్యేనేని ఆశబ్దమంతోదాత్తమగును. ఉదాహరణము । రథకారః. (వాజపేయాది యజ్ఞసంబంధియు, దేవసంబంధియు, ముఖ్యవిధానముగ రథాది శిల్పకర్మచరించు రథకారసంజ్ఞకుడగు బ్రాహ్మణజాతి విశిష్టుడు.) ఇటట 'నామ' అను అవ్యయము ప్రశ్నార్థకమగును.

కొందఱీ శబ్దము సంజ్ఞార్థకమగుటవలన బ్రాహ్మణులలో ఒకానొకడు రథకారుడని పేరుగలవాడనియు, అది జాతివాచక పర్యాయము కాదనియు చెప్పుదురు.

అటులను తగియుండదు. అంతోదాత్తమువచ్చుటకు కృఞ్ ధాతువు, అణ్ప్రత్యయము సంజ్ఞార్థకము, శిల్పివాచకముకూడ నయియుండవలెను.

సంజ్ఞార్థకముగాక ప్రత్యేక శిల్పివాచకమయ్యేనేని ఆద్యుదాత్తమగును. ఇంక మఱియొక సందర్భముకూడ విచారించెదము. ఈపాణిని సూత్రములు, సిద్ధాంతకౌముది, స్వరప్రకరణమునందు ప్రయోగింపబడినవి. ఈస్వర ప్రకరణము వేదములో ప్రయోగించు శబ్దములయొక్క స్వరభేదముల నిర్ణయించునది. కావున ఈశబ్దములు వేదములలోనుండియే తీరవలెను. వేద భాగమునందు జాతివాచకముగాక రథకారుడను పేరుగల వాడొకడుండినటుల కనబడదు. జాతివాచకముర రథశబ్దము ప్రయోగించినపట్టుల నంత్యోదాత్త ముగనే బ్రాహ్మణజాతి విశిష్టత స్వరయుక్తమైనదిగనే కానవచ్చుచున్నది.

శ్రుతి:- ఋభూణాం త్వాదేవానాం వ్రతపతే వ్రతేనాదధా మీతిరథ కారస్య॥

(తైత్తిరీయ బ్రాహ్మణము) ఇట్లె మఱికొన్నిచోట్ల గూడ ప్రయోగములు కలవు. ఇటుల నంత్యోదాత్తములుగ నుండుటచే బ్రాహ్మణజాతి వాచకమగుననుటకు సందేహములేదు. కావున "రథకారో నామబ్రాహ్మణః" అనునది ప్రత్యేక వ్యక్తికిననుట పొసగనేరదు. వ్యాకరణ శాస్త్రముచే రథకారుడు బ్రాహ్మణజాతి విశిష్టుడగుననుట విస్పష్టమయ్యెను. రథకార బ్రాహ్మణబోధక కోశవాక్యము.

శ్లో॥ రథకారస్తక్షణీ స్యాన్మహిష్య కరణీసుతే ।
ఇతి విశ్వమేదినీ హేమచంద్రః ॥

రథకారుడనగా తక్షుడు. తక్షుడన విశ్వకర్మయే. ఓ తక్షుడా ! (ఓ విశ్వకర్మా) నీ దయయుంచి శీఘ్రముగా నాకుప్రియమొసర్పుము! అందుచే మానవులు యజ్ఞములయందు పశువుయొక్క ఉత్తమాంగభాగమును, ఒసంగెదరు. అను భారత ప్రయోగమువలన తక్షుడు విశ్వకర్మయనియు, యజ్ఞభాగార్హుడనియు అందుచే బ్రాహ్మణుడనియు తెలియుచున్నది. మఱియు. శ్రుతి ॥

తక్షన్ రథం సు వృతం వి ద్మనావ స్తః తక్షన్ హరీ ఇంద్రవాహో వృషణ్వసూ తక్షన్ పితృభ్యాం ఋభవః ॥ (ఋగ్వేదం 1-7-3-2)

మఱియు క్రీ శ॥ 1751 ధాత సం॥ ర చైత్ర శు 2 గురువారమున విజయనగర సంస్థానాధీశులగు శ్రీమద్విజయ రామరాజభూమీశుని సన్నిధానమున శ్రీకృష్ణా గోదావరీమండల మధ్యవాసులును ద్వైతాద్వైత విశిష్టాద్వైతులగు వైదిక వైష్ణవ బ్రాహ్మణులగు బ్ర॥ ముగొండ్రగహారనిలయ ముక్కామల దక్షిణామూర్తి శాస్త్రి, ముక్కామల భవానీ శంకరశాస్త్రి, కదళీపురాగ్రహారనిలయ మారేమండ అచ్యుతాచార్య, కంభంమెట్టు వెంకటాచార్య, బుక్కపట్టణ అనంతాచార్య, బొబ్బిలి వేంకటకృష్ణదీక్షిత ప్రభృతులగు నేబదిమంది మహాపండితులును, శ్రీ మత్సావిత్రీపీఠాధిపతులును. తపస్సంపన్నులును, అగు బ్ర॥ కనుపర్తి బసవాచార్య స్వాములవారును, కూడియుండిన మహాసభ యందు సర్వశాస్త్రములను, పురాణములను, శ్రుతులను స్మృతులను పరిశీలించి రథకార బ్రాహ్మణులకు విశ్వకర్మనుండి సానగాది మహర్షులకును, వారినుండి నూటయిరువదియైదు గోత్రముల వారికిని, వారి తరువాత ఋభువులకును, బ్రహ్మత్వము పారంపర్యముగా వచ్చియుండుటచే శ్రేష్ఠబ్రాహ్మణులనియును, ఆగమాదికార్యములు నిర్వహించుచుండుటచే శమదమాది గుణసంపత్తియు, బ్రాహ్మణత్వమున దశగుణము లధికము గను, త్రింశత్కోటిదేవతలకు ఆచార్యత్వముచేసి నిర్వహించుటయును, స్వతస్సిద్ధమై యుండుటచేత సామాన్యముగ చెప్పబడిన 'వసంతే బ్రాహ్మణః అను వాక్యము లెంత మాత్రము చాలవు. 'తల్లి గర్భమునుండి భూలోకమునకు వచ్చునప్పుడే బ్రహ్మచారిగ లోకమున కగుపడిన ఆంజనేయుని బ్రహ్మత్వమువలే విశ్వబ్రాహ్మణులము బ్రాహ్మణత్వ దేవత్వమునుండి వచ్చియుండుట సమస్త శాస్త్రములు నిరూపించుచున్నవి. ఈ జాతికే యే కాలమునసైన అవాంతరము లున్నట్లు తెలియవు. ఈ

రథకార బ్రాహ్మణులకు మతత్రయాంతర్గత విశిష్టాచార ధర్మములును, వానిచే నియమింపబడిన బ్రాహ్మణ ధర్మములును, సిద్ధమగుటచే ఈ రథ కారాధికరణము, అను శ్రేష్ఠగ్రంధమును ఏకగ్రీవముగా ఆమోదించుటయే కాక (శ్రీ) స్వామివారిని పేరూరగ్రహారములో బ్రహ్మరథారూఢుని జేసి వేదమంత్రములతో గ్రామోత్సవమును జరిపి శ్రీ స్వామివారి యాశీర్వచనము లందిరి. తరువాత శ్రీ రాజావారు సకుటుంబ సపరివారముగ శ్రీ స్వామివారి సన్నిధిలో వేయినూటపదార్లు రూప్యములును, కాశ్మీరు శాలువయును, ఫల పుష్పాది సన్మానములను స్వీకరించి యెల్లరను ఆశీర్వదించిరి. మఱియు ఉపాకర్మ ప్రకరణమునందు ఋగ్వేదులు శ్రవణ నక్షత్రమున చేయవలెను. సామవేదులు హస్తనక్షత్రమున చేయవలయును అని చెప్పుటచే సామ వేదులకు హస్తనక్షత్రమును చెప్పినంత మాత్రమున శూద్రులు గాక బ్రాహ్మణులగుటయే యిందుల కుదాహరణము. ఆపస్తంబసూత్రముల యందు రథకారాదుల కుపనయన కాలవిశేషము నిర్ణయింపబడక పోవుట వలన ఎనిమిదవ సంవత్సరమునం దుపనయనము చేయుటెట్లు? అట్లు కాదు వైఖానసయాజ్ఞవల్క్యాదులకు కాలవిశేషముంచెనేని రథకారులకును కాలవిశేషంబుండును. అందువలన వైఖానసాదులకు అంగిరసాది ఋషి గోత్రజులకును, కాలవిశేషము లేకపోయినను, బ్రాహ్మణులగుచుండ నష్టమ వర్షమునం దుపనయనము సిద్ధము. ఇట్లయ్యేనేని యనుపపత్తి యేమియును లేదు. కావున రథకారులకును అష్టమ వర్షమునందే ఉప నయనము వేదవిహితము. ఋగ్వేదంబువలన వైశ్యుడు జన్మించె, యజుర్వేదము క్షత్రియులకు జన్మస్థానము. సామవేదము బ్రాహ్మణుల కుత్పత్తిస్థానము, అని చెప్పబడియుండెను. "బ్రాహ్మణోస్యముఖమాసీత్, అను దానికి వ్యతిరిక్తముగ క్రమనిరూపణము. ఇట్లు చెప్పబడిన మాత్రమున వైశ్యునకు శ్రేష్ఠత్వము కల్గునా ?

శ్రుతి॥ ఋభూణాం త్వా దేవానాం వ్రతపతే వ్రతేనాదధా మీతి రథకారస్య॥

అనియుసు. తథైవాస్మాకమపి యాజమానస్యోక్తత్వాత్. అస్మాకంబు ఋగణ సంజ్ఞత్వే ఋగ్వేదే ప్రమాణం। శ్రుతి॥ సౌధన్వనాస్నూ ఋభవ స్సూరచక్షసః ॥ అనియుసు, నాగరఖండే.

శ్లో॥ దారుకారః స్వర్ణకారః శిలాకారస్తథైవచ।
అయస్కారోలోహకారః పంచైతేరథకారకాః ॥

అనియుసు -

శ్లో॥ వచనాద్రథకారస్య॥ అని మీమాంస సూత్రము శిల్పశాస్త్రే

శ్లో॥ స్థపతిః స్థాపకశ్చైవ ఆచార్యో విశ్వకర్మణః।
ఆచార్యో విశ్వకర్మాచ ఆది బ్రహ్మకులోద్భవః ॥
దేవకోరథ కారాణాః విశ్వకర్మా మహాతపః॥ భారతే విరాటపర్వే॥
రథకారమిమంక్వేతి క్రియాయుక్తం ద్విజన్మనా ॥

అనియుసు - నాగరఖండే

శ్లో॥ మనుర్మయశ్చ త్వష్టాచ। శిల్పీవిశ్వజ్ఞ ఏవచ।
పంచైతే దేవఋషయో విశ్వకర్మ ముఖోద్భవాః ॥
అయస్కర్మమనూనాంచ మయానాందారుకర్మచ।
త్వష్టాకాంస్యాదిలోహానాం కర్తాకారస్సపండితః ॥
శిల్పీస్యాచ్ఛిలాభేదీ। బ్రహ్మాది సురకల్పకః।
దైవజ్ఞోహేమకృద్యోగీ। నానాభూషణ నైపుణః ॥
తేషాం సర్వకులశ్రేష్ఠో। నానా విద్యాగురుః ప్రభుః।
ఏతానిపంచకర్మాణి। విశ్వకర్మేత్యహం ప్రభుః ॥
ఏవాంచపైక మేకంచ సురేభ్యః ప్రవదామిచ।
ఋషీణాంతస్య పంచస్య। కుమారాః పంచజజ్ఞిరే ॥
పవనేభ్యో భవంత్యేషాం పంచపంచ కుమారకాః।
శతంచ పంచశతిః పంచ।వంశజావిశ్వకర్మణః ॥

తద్వంశ సంభవాః సర్వే। పంచ పంచాస్య సంభవాః।
విశ్వకర్మసుతాహ్యేతే। రథకారస్తు పంచచ ॥
వైదికేనైవ మార్గేణ। తద్వంశానాం విశేషతః ॥

ఇతిస్కాందే నాగరఖండే॥ పంచమాధ్యాయే॥ రథకారాణాం। విశ్వకర్మజత్వ ప్రతిపాదనేవచ। రథకారాణా మవాంతర జాతిత్వం నాస్తి॥

మీరు పైన చెప్పబడిన యంశములను బాగుగ విచారించిన మా వంశములు సంకరజాతులు కావనియును, బహుయోగ్యతా పాదితమైన దనియును స్పష్టమగుచున్నది.

(8) ప్ర॥ అమరములో చెప్పియున్న రథకారులము మేము కాదంటిరి గదా? వారు యెవరు యెచ్చట నున్నారు?

ఉః- బ్రాహ్మణ భేదములును వారి యాచారములును గూర్చి క్రీ. శ. 1901 లో పూనా సుధారక పత్రికనుండి యనువదింపబడినది. ది, 1-1-1900 మహారాష్ట్ర మందలి బ్రాహ్మణ జనుల భేదములు, కర్ణాటదేశము నందును, మద్రాసు ప్రాంతమునందును, అంతగాలేవు, మిక్కిలి భేదములు కలవు. వంగ, కాశ్మీరదేశములందు బ్రాహ్మణులలో అనేక భేదములు కలవు. బ్రాహ్మణుల యందందరిలోను వేషభాషల, ఆచారములు, సమానముగాలేవు, బ్రాహ్మణులయొక్క చరిత్రను ప్రకటించితిమేని దానిని చూచి యెల్లరు సంతోషపడెదరు, వంగదేశీయులు మాంసమును భక్షింతురు, గృహమునందు స్పర్శభేదము దోషములేదు. కాశ్మీర బ్రాహ్మణులు గృహములందు మహమ్మదీయులు గృహకార్యములు నిర్వర్తింతురు, పంజాబు బ్రాహ్మణులు అంగీలు తలగుడ్డలు పెట్టుకొని మంచములపై భోజనములు చేయుదురు, వారి వేషస్థితికి మహమ్మదీయుల వేషస్థితికి భేదములేదు. వారిలో కొందరు మాంసమును తిందురు కొందరు తినరు, కాశియందు శూద్రస్పర్శ దోషములేదు. ఘూర్జరులు కాపువారి యిండ్లలో జలపానమును చేసెదరు. బొంబాయియందు కొందరు సారస్వ

యిండ్లలో పౌరోహిత్యము చేసెదరు. వారు జైనులకు గురువులయ్యెదరు. పంజాబులోని గౌడ, సారస్వత బ్రాహ్మణులు. హీనజాతి స్త్రీలను వివాహం చేసికొందురు. వారే ధర్మపత్నులు. పంజాబులోని కొందఱు గౌడ బ్రాహ్మణులు విధవలను వేశ్యలవలె జూచెదరు. సింధు రాజపుత్ర దేశములోని బ్రాహ్మణులు మాలాకార (పూలదండలు అమ్మే వేశ్య జాతి) నాపితగృహములలో (మంగలిగృహములలో) భోజనముచేయుదురు.

(9) ప్ర॥ మీరు విశ్వకర్మ వంశజులనియు, వైశ్యులకన్నను అధికులమనియు, చెప్పుచున్నారు గదా ? వసంతే బ్రాహ్మణః, గ్రీష్మే రాజన్యః. శరది వైశ్యః, వర్షాసురరథకారః' ఈ ధర్మమునను సరించి మీకు వైశ్యులకంటే వెనుక చెప్పబడినదిగదా ? ఇట్లుండటకు కారణమేమి ?

ఉ॥ మాకు విశ్వకర్మనుండియే ఋషిత్వము. దేవత్వములు వరుసగా వచ్చియున్నవి. మనుబ్రహ్మ వంశమువారికి వసంతర్తువు, మయబ్రహ్మవంశమువారికి గ్రీష్మర్తువు, త్వష్టృబ్రహ్మవంశమువారికి వర్షర్తువు. శిల్పిబ్రహ్మ వంశమువారికి శరదృతువు, విశ్వజ్ఞబ్రహ్మ వంశము వారికి హేమంతశిశిరఋతువులు ముందే చెప్పబడియున్నవి. ఇందలి రహస్యమేమనగా వైశ్యునకు వర్షఋతువు చెప్పక శరదృతువునను నెట్టివేయుట. సృష్టి స్థితి లయములకు వసంత గ్రీష్మ వర్షర్తువులెలేయై యున్నవి. కనుక జాతి మూడవదయ్యెను వృత్తి నాలుగవదియై యున్నది వైశ్యుడు నిర్మించిన దానిని కాపాడుటకు మాత్రమే పనికి వచ్చుచున్నాడు. ఋగ్వేదము మొదటి మెట్టుగను, యజుర్వేదము, దానిపై మెట్టుగను సామవేదము దానిపై మెట్టుగను. అభివృద్ధి ధర్మములు చెప్పబడినవి గాని, వైశ్యుడే మెదవాడని, ఆయన తరువాత క్షత్రియుడని, అంతకంటె తక్కువ బ్రాహ్మణుడని లోకమున నెవరైనను చెప్పియుండిరా ? ఇకముందైనా చెప్పుదురా ? శర్మ వర్మ గుప్త దాస నామములు. నాలుగు జాతులకు నిర్ణయింపబడినవి కనుక గుప్త నామార్థ మేమనగా – పాడిపంటలను పశు

వదనేభ్యోభవం స్తేషాం పంచపంచకుమారకాః ॥
శతంచ వింశతిః పంచ వంశజా విశ్వకర్మణః ।
తద్వంశ సంభవాః సర్వే పంచపంచాస్య సంభవాః ॥
విశ్వకర్మసుతాహ్యేతే రథకారస్తు పంచచ ।
వైదికేనైవ మార్గేణ తద్వంశానాం విశేషతః ॥

ఇతిస్కాందే నాగరఖండే పంచమాధ్యాయే రథకారాణాం విశ్వకర్మ వంశజత్వ ప్రతిపాదనేనచ, రథకారాణా మవాంతర జాతిత్వం నాస్తి. మీరు పైన చెప్పబడిన యంశములను బాగుగా విచారించిన మా వంశము సంకరజాతి కాదనియును, బహుయోగ్యతా పాదితమైన దనియును స్పష్ట మగుచున్నది.

(10) ప్ర॥ బ్రాహ్మణులు చతుర్వర్ణములవారికి సకల కర్మసంధాయకులై యున్నారు. అటులనే మీరుండక పోవుటకు కారణ మేమి ?

ఉ॥ అష్టాదశపురాణములలో సాత్విక, రాజస, తామస భేదములున్నవి. వానిలో సాత్విక పురాణములు ప్రబలమైనవి. కనుక రథకారులకు అనులోమ కులత్వప్రతిపాదకమగు ఆదిత్య పురాణమునకును ఇతర తామస పురాణములకును దుర్బలత్వము నిర్ణయింపబడియున్నది. దానికిపై సాత్వికత్వముచేత విష్ణుపురాణము ప్రబలమైనదిగా నెన్నబడినది. అట్టి విష్ణుపురాణమున ప్రథమాంశషోడశాధ్యాయమున రథకారబ్రాహ్మణులకు విశ్వకర్మవంశజత్వ ప్రతిపాదనమువలనను అవశ్యం విశ్వకర్మ సంశజప్రాప్తి అంగీకరింపదగినది. అందు వసూత్పత్తి ప్రకరణమున శ్లో॥ ప్రభావసోఽస్తుభార్యాయాం। వసూనామష్టమస్యహ । విశ్వకర్మా మహాభాగో । జజ్ఞేశిల్పి ప్రజాపతిః. కర్తాశిల్పి సహస్రాణాం, త్రిదశానాంచ వర్ధకిః। భూషణానాంచ సర్వేషాం, కర్తాశిల్పవతాంవదః । యః సర్వాసాం విమానాని దేవతానాంచ కారహ । మనుష్యాశ్చోప జీవంతి. యస్యశిల్పం మహాత్మనః, లబ్ధజ్ఞాత

గతి_స్త్వష్టా। పుత్రో వై విశ్వకర్మణః। త్వష్టుశ్చాప్యాత్మజః శ్రీమాన్ విశ్వరూపో మహాతపాః ॥

తామస పురాణమగు ఆదిత్యపురాణముకంటె సాత్త్విక పురాణమై ప్రసిద్ధిజెందిన విష్ణుపురాణ ప్రబలత్వమునే అంగీకరింపవలయును గాని, ఇతర పురాణము లాధారములు చేయరాదు. కనుక రథకారులకు విశ్వకర్మ వంశజత్వము ప్రతిపాదించుట వలన అవశ్యముగా విశ్వకర్మ వంశజులని అంగీకరింపవలయును గాని అనులోమ వంశ్యులనుట యెట్లు పొసగునో యూహింపుడు. వసూత్పత్తి ప్రకరణమున వసువులలో అష్టమ వసువగు ప్రభావసుని భార్యయందు శిల్పిప్రజాపతియగు విశ్వకర్మ జనించెను. ఆ విశ్వకర్మ వలన అనేకులగు శిల్పులుదయించిరి. ఆ విశ్వకర్మ అనంత శిల్పులకుకర్త అయ్యెను. దేవతలకు శిల్పనిర్మాతయు సమస్త భూషణముల నొసగ్చువాడును, శిల్పివరుడునుఅయి సమస్త దేవతలకు వ్యోమయానము లొసగ్చెనుచ్చెనో? ఏ మహాత్ముని శిల్పము వలన మనుష్యులు జీవించు చున్నారో, ఆ విశ్వకర్మ ప్రజాపతికి త్వష్టప్రజాపతి పుట్టెను. ఆ త్వష్టకు మహాతపోధనుండును. శ్రీ మంతుడును, అగు విశ్వరూపుడుదయించెను. అను ప్రమాణముచే ఆదిత్యపురాణము ప్రమాణము కాదు,

కృష్ణ యజుర్వేదము 2 కాం. 5-1

శ్రుతి ॥ విశ్వరూపో వై త్వాష్ట్రః పురోహితోదేవానామాసీత్ ॥

పై శ్రుతి వాక్యము ననుసరించి త్వష్టకుమారుడైన విశ్వరూపాచార్యుడే దేవతలకు పురోహితుడయ్యెనని తెలియుచున్నది కదా?

శ్రీ మద్భాగవతమున

శ్లో॥ కస్య హేతోః పరిత్యక్తా ఆచార్యేణాత్మనః సురాః।
ఏతదాచక్ష్వ భగవాన్ శిష్యాణామక్రమంగురౌ ॥ 1

ఇంద్రస్త్రిభువనైశ్వర్య మదోల్లంఘిత సత్పథః।
మరుద్భిర్వసుభీరుద్రై రాదిత్యై ర్ఋషిభిర్నృప ॥ 2

విశ్వేదేవైశ్చసా ధ్యైశ్చ నాసత్యాభ్యాం పరిశ్రితః ।
సిద్ధచారణ గంధర్వై ర్మునిభి ర్బ్రహ్మవాదిభిః ॥ 3

విద్యాధరాప్సరోభిశ్చ కిన్నరైః పతగోరగైః ।
నిషేవ్యమానోభగవాంస్తూయ మానశ్చభారత ॥ 4

ఉపగీయమానోలలిత మాస్థానాధ్యాసనాశ్రితః ।
పాండరేణాత పత్రేణ చంద్రమండల చారుణా ॥ 5

యుక్తశ్చాన్యైః పారమేష్ఠ్యై శ్చామర వ్యజనాదిభిః ।
విరాజమానః పౌలోమ్యా సహార్ధాసన యాభృశం ॥ 6

సయదా పరమాచార్యం దేవానా మాత్మ నశ్చహ।
నాభ్యనందత సంప్రాప్తం ప్రత్యుత్థా నాసనాదిభిః ॥ 7

వాచస్పతిం మునివరం సురాసుర నమస్కృతం ।
నోచ్చచాలాసనా దింద్రః పశ్యన్నసి సభాగతం ॥ 8

తతోనిర్గత్య సహసా కవిరాంగిరసః ప్రభుః ।
ఆయయౌ స్వగృహం తూష్ణీం విద్వాన్ శ్రీమదవిక్రియాం ॥ 9

తర్హ్యేవప్రతి బుధ్యేంద్రో గురుహేళన మాత్మనః ।
గర్హయామాస సదసి స్వయమాత్మాన మాత్మనా ॥ 10

అహోబత మమా నాధు కృతంవైదభ్ర బుద్ధినా ।
యన్మయైశ్వర్య మత్తేన గురుః సదసికాత్కృతః ॥ 11

కోగృధ్యేత్పండితో లక్ష్మీం త్రివిష్టప పతేరపి ।
యయాహమాసురం భావం నీతోద్య విబుధేశ్వరః ॥ 12

యేపారమేష్ఠ్యం ధిషణ మధితిష్ఠ న్నకంచన ।
ప్రత్యుత్తిష్ఠే దితిబ్రూయు ర్ధర్మంతేన విదుంపరమ్ ॥

తేషాం కుపథ దేష్టౄణాం పతతాం తమసిహ్యాథః ।
యేశ్రద్ధ ధ్యుర్వచ స్తేవై మజ్జంత్యశ్మ ప్లవాఇవ ॥ 14

అథాహ మమరాచార్య మగాధ ధిషణం ద్విజం ।
ప్రసాదయిష్యే నిశఠ శ్శీర్ష్ణా తచ్చరణం స్పృశన్ ॥ 15

ఏవంచింతయత స్తస్య మఘోనో భగవాన్ గృహాత్ ।
బృహస్పతిర్గతోఽదృష్టాం గతి మాధ్యాత్మమాయయా ॥ 16

గురోర్నాధి గతస్సంజ్ఞాం పరీక్ష్య భగవాన్ స్వరాట్ ।
ధ్యాయన్ ధియాసు రైయుక్త శర్మణా లభతాత్మనః ॥ 17

తచ్ఛ్రుత్వైవ సురాః సర్వే హ్యాశ్రిత్యౌశన సమ్మతం ।
దేవాన్ ప్రత్యుద్యమం చక్రు ర్దుర్మదా ఆతతాయినః ॥ 18

తైర్విసృష్టేషుభిస్తీక్ష్ణై, ర్నిర్భిన్నాంగోరుబాహవః ।
బ్రహ్మాణం శరణం జగ్మః సహేంద్రానత కంధరాః ॥ 19

తాం స్తథాభ్యర్దితాన్ వీక్ష్య భగవా నాత్మభూ రజః ।
కృపయాపరయాదేవ ఉవాచపరిసాంత్వయన్ ॥ 20

బ్రహ్మ॥ అహోబతసుర శ్రేష్ఠాః హ్యభద్రం వః కృతంమహత్ ।
బ్రహ్మిష్ఠం బ్రాహ్మణందాంత మైశ్వర్యా న్నాభినందత ॥ 21

తస్యాయమన యస్యాసీ త్పరేభ్యోవః పరాభవః ।
ప్రక్షీణేభ్యస్స్వవైరిభ్యః సమృద్ధానాంచ యత్సురాః ॥ 22

మఘవన్ ద్విషతః పశ్య ప్రక్షీణాన్ గుర్వతిక్రమాత్ ।
సంప్రత్యుపచితాన్ భూయః కావ్యమారాధ్య భక్తితః ॥ 23

ఆదదీరన్నిలయనం మమాపిభృగుదేవతాః ।
అజేయాస్తే సైతేయాః కిముత త్రిదశేశ్వరాః ॥ 24

త్రివిష్టపం కింగణయంత్యభేద్య మంత్రాభృగూణా మనుశిక్షితార్థాః ।
నవిప్రగోవింద గవీశ్వరాణాం భవంత్యభద్రాణి నరేశ్వరాణామ్॥ 25

తద్విశ్వరూపం భవతాశుఽప్రం తపస్వినంత్వాష్ట్రిమథాత్మవంతమ్ ।
సభాజితోఽర్థాన్ సవిదాస్యతేవో యదిక్షమధ్వంయదుతాన్య కర్మ॥ 26

తఏవముదితారాజన్ బ్రహ్మణా విగతజ్వరాః ।
ఋషింత్వాష్ట్రి ముపవ్రజ్య పరిష్వజ్యేదమబ్రువన్ 27

దేవాః॥ వయంతేఽతిథయః ప్రాప్తాః ఆశ్రమం భద్రమస్తుతే ।
కామః సంపద్యతాం తాత పితౄణాం సమయోచితః ॥ 28

పుత్రాణాంచ పరోధర్మః పితృశుశ్రూషణం సతాం ।
అపిపుత్రవతాం బ్రహ్మన్ కిముత బ్రహ్మచారిణం ॥ 29

ఆచార్యో బ్రహ్మణోమూర్తిః పితామూర్తిః ప్రజాయతే ।
భ్రాతామరుత్పతేర్మూర్తి ర్మాతాసాక్షాత్ క్షితేస్తనుః ॥ 30

దయయాభగినీమూర్తి ర్ధర్మస్యాత్మాఽతి థిః స్వయం ।
అగ్నేరభ్యాగతోమూర్తిః సర్వభూతాని చాత్మనః ॥ 31

తస్మాత్ పితౄణామార్తానా మార్తిం పర పరాభవః।
తపసాపనయం స్తాత సందేశం కర్తుమర్హసి ॥ 32

వృణీమహేత్వోపాధ్యాయం బ్రహ్మిష్ఠం బ్రాహ్మణంగురుం ।
యథాంజసా విజేష్యామః సపత్నాం స్తవతేజసా ॥ 33

నగర్హయంతి హ్యర్థేషు యవిష్ఠాం ఘ్ర్యభివందనః ,
ఛందోభ్యోన్యత్రనబ్రహ్మన్ వయోజ్యైష్ఠస్య కారణమ్ ॥ 34

శుకః॥ ఇత్యర్థితః సురగణైః పౌరోహిత్యే మహాతపాః ।
సవిశ్వరూపస్తానాహ ప్రహసన్ శ్లక్ష్ణయాగిరా ॥ 35

విశ్వరూపః విగర్హితం ధర్మశీలైః బ్రహ్మవర్చఉపవ్యయం।
కథంను మద్విధోనాథో లోకేశై రభియాచితః ॥ 36
ప్రత్యాఖ్యాస్యతి తచ్ఛిష్య స్సఏవ స్వార్థఉచ్యతే ॥

అకించనానాంహి ధనం శిలోంఛనం తేనేహ సర్వ్త్రిత సాధుసత్క్రియా
కథం విగర్హ్యం సుకరోమ్యధీశ్వరాః పౌరోధసంహృష్యతి యేన దుర్మతిః॥
తథాపిన పతిబ్రూయాం। గురుభిః ప్రార్థితం కియత్। భవతాం
ప్రార్థితం సర్వం ప్రాణై రర్థైశ్చసాధయే॥ శ్రీ మద్భాగవతే- షష్ఠస్కంధే

## సప్తమోఽధ్యాయః

తా॥ పరీక్షిన్నరేంద్రుడు శుకయోగింగని స్వామీ ! సురాచార్యుడు సురలనేల కోపించె? అందువలన దేవతల కేమి యాపద గలిగె? ఎఱిగింపు మనగా శుకయోగీంద్రుడిట్లనియె. స్వర్గమునందొక దినంబున బ్రహ్మర్షి మునుద్వసు రుద్రా దిత్యాశ్వినేయ గరుడ సిద్ధ సాధ్య చారణ విద్యాధర గంధర్వాప్స రాంగనలు పరివేష్టించి కొలువ ఛత్రచామరాది రాజచిహ్నం బులంబూని పరివారంబు నిలువ పౌలోమీ యుతుడగు మహేంద్రుడు చింతామణి భద్ర సింహాసనాసీనుండై మంత్రియు బ్రహ్మణ్యుండును ఆచార్యుండును, అగు బృహస్పతి యాసుధర్మ కరుదేరగాంచి స్వారాజ్య వైభవంబున దేవగణ సహితుండై పీఠంబుడిగ్గి ప్రత్యుత్థానంబు చేయక యుదాసీనుండుగా ఆ దేవగురుడు నిర్జరేశ్వరుని యపార వైభవగర్వంబుచే నున్న స్థితిని గాంచి తన యింటి కేగెను. కొంతసేపటికా యింద్రుడు తన గర్వమును తాను తెలిసికొని నేను గొప్ప పొరబాటు చేసితిని. నాకు సమస్త కాలములయందు సుఖశ్రేయజయాదు లొనగూర్చుచున్న గురుని నేల తిరస్కరించితిని. పరమేశ్వరు డిచ్చిన యధికారముచే మహోన్నత సింహాసనాధిపత్యము వహించిన నీవు ఇతరులను తక్కువగా చూడవలెనే కాని వారికిలోబడిన వాడవు కావగదు సుమా? అని యెన్నియో సారులు నాకు బోధించి నాచే యిట్టి దుష్కార్యము చేయించిన దేవతల నేమన వలయును? వీరి మాటలు నమ్మి ప్రవర్తించువారు నల్లరాతి తెప్పనీటిలో మునిగిపోయినట్లు చెడిపోదురుసుమా! అనుకొని దేవతలను గూర్చి మన యాచార్యుండెటువేగెనో కనుపడుటలేదు. ఇప్పుడు మనము శత్రువులచేత

ఓడింపబడి దిక్కులేనివారలమైతిమికదా! మనమందరము కూడి బ్రహ్మ దేవుని చెంతకేగి మన కష్టములను విన్నవించుకొని యా మహనీయుని యాజ్ఞానువర్తులమై యుందుమని యా దేవగణముతో గూడి బ్రహ్మ లోకమునకేగి యా లోకేశ్వరునితో వారి కష్టములనెల్ల చెప్పుకొని పోయిన అధిపత్య స్థానమెటుల స్వీకరింప దగుదుమని యాలోచించిరి. బ్రహ్మ వారి పలుకుల నాలించి ఓ యింద్రా! నీవు నీకు విరోధులైన దానవులు. వారి గురువును తిరస్కరించకుండా భక్తిశ్రద్ధలతో వారు చెప్పినట్లు నడచుచు దిగ్విజయమును, సుఖమును, గౌరవమును పొందగలిగి యుంటిరి గదా! నీవు అటులగాక వ్యతిరేక ప్రవర్తన కలవాడవై దుష్ఫలములను ఎడతెగని విచారమును కలిగియుంటిమి. ఇప్పటికైనను తెలివి తెచ్చు కొని గురుభక్తి కార్యదీక్ష కలిగి ప్రవర్తించుచుండుము. అనగా విశ్వరూపా చార్యుని యాశ్రమమునకు జేరి యా మహాతపస్సంపన్నుని ప్రార్థింపగా పౌరోహిత్యవృత్తి పాపభూయిష్టమైనది. దాని నిజ్ఞాను లెవ్వరును చేయరు. స్వర్గాధిపతతివయ్యు నీవు నన్ను యాచించుటవలన మహోన్నత పదవు నుండి యధః పతితుడవగుటయు, దేవతలు లేనిపోని చాడీలు తప్పుత్రోవలు గల వాక్కులు సమయానుకూలముగా బోధించి నీ కింతటి పరాభవమును గలిగించి యే మాత్రము సహాయము చేయజాలకుంటిరి. కనుక నా శక్తి కొలది నీ సురాధిపత్యమును తప్పక యధాస్థితికి తెచ్చి నిన్ను సంతోష పఱచెదను అని వచ్చి శుక్రమంత్ర ప్రభావముచే యదృశ్యరూపమున మన్న సమస్త సాధనములు ధనరత్నాదులు సంపూర్ణముగ నింద్రుని కిచ్చి సురలందఱిని సంతుష్టి పఱచెను, ఇట్టి వెన్నియో మా యధికార ప్రకారము రాజులకు గూడా పట్టాభిషేకము లొనర్చుట మున్నగున వెన్నియో చేసి యుండి నేటికిని శిల్పాచార్యుడు రాజపురోహితుడనియు "ప్రాప్తపంచాంగ భూషణః" అని మంత్రపఠనా సమయమున నతని కుండదగిన యాభరణాధి లాంఛనములు కలిగి ప్రకాశించుచుండుట "వాస్తుపూజన సాహిత్యం। స్వయంగృహ్ణాతి సర్వశః" అను వాక్య ప్రకారము శిల్పాచార్యుడే సమస్త శుభకార్యముల యందగ్రపూజార్హుడుగా నుండి లక్షణ యుక్తముగా సమస్త

భూషణాదులు మున్నగునవి చేసి యిచ్చి మానవులకు తేజస్సు నొసంగు చుండుట మీరలెఱింగియు నిట్లు ప్రవర్తించుట హాస్యాస్పదమని విస్పష్ట ముగా చెప్పుచున్నాను.

11 ప్ర॥ విశ్వబ్రాహ్మణులకు గురుపీఠము లేమైనా గలవా? ఉన్నచో అయా ధర్మము లేమి ?

ఉత్తరము: శ్రీ పరమహంస పరివ్రాజకాచార్య కాళహస్తి యతీశ్వరావ తారము ప్రథమాచార్యత్వము కలది. ద్వితీయాచార్య శ్రీ రూఢాచార్య స్వామివారు, తృతీయాచార్య శ్రీ వెంకటాచార్యస్వామి, చతుర్థాచార్య శ్రీ కాలాచార్యస్వామి, పంచమాఆచార్య శ్రీ నృసింహాచార్యస్వామి, షష్టాచార్య శ్రీ పూర్వాచార్యస్వామి, సప్తమాచార్య శ్రీ కృష్ణాచార్యస్వామి అష్టమాచార్య శ్రీ బుఘ్వాచార్యస్వామి, నవమాచార్యస్వామి, దశమా చార్యులు గృహస్థాశ్రమమునుండియే అధిపత్యముమ నిర్వహించుచున్నారు కాళహస్త్యాచార్య ప్రశస్తితో పురుషోత్తమ గురువుగారుండిరి. వేంకటాచార్య నామస్వామి విఖ్యాతస్వామి. వీరు సరస్వతి, సావిత్రి, గాయత్రి యను మూడు పీఠములకు శ్రీ వీరభోజయాచార్యస్వాములవారును శ్రీ కనుపర్తి బసవాచార్యులు గారును, శ్రీ వీపూరి వర వేంకటాచార్యస్వాముల వారును, అధిపతులుగా నుండి వైదిక ధర్మములు లోకమునకు గను పఱచుచు అణిమాద్యష్టసిద్ధులతో ప్రకాశించుచు ప్రపంచమును ధర్మమార్గ మున నడిపించుటకై సంచారములు చేయుచునే యున్నారు. మైసూరు ప్రాంతమువను చావేపల్లి యను గ్రామమువ పంచనంది క్షేత్రమున పాపఘ్నిపీఠాధీశ్వరులుగా విరాజిల్లుచు దక్షిణదేశమునకు జ్ఞానోపదేశము చేయుచు ప్రకాశించుచున్న శ్రీ ఆదివిరాట్ శ్రీ వీరభోజవసంతరాయాచార్య స్వాములవారి పీఠము గురు పారంపర్యముగ నేటికిని దేదీప్యమానముగానే యున్నది. మఱియు పెద్దతిప్ప సముద్ర సంస్థానమున శ్రీ గాయత్రి ప్రణవ పీఠాధ్యక్షులును. శ్రీ పాపఘ్ని పంచబ్రహ్మ మఠాధిపతులునుఅగు శ్రీ చింతఉడిపి విశ్వచేతన శ్రీరమణాచార్యస్వాములవారును, ఆంధ్రదేశమున

సంచరించుచు నుండిరి కదా? పూనా ప్రాంతమున అష్టసిద్ధులు పొందిన శ్రీ తుకా బ్రహ్మానందయోగీశ్వరులవారు ఛత్రపతి శివాజీకి శాశ్వత ఛత్రపతిత్వము నిలుపదలచి నవరత్నములతో నవగ్రహాకర్షణ జపనిష్ఠప్రకారమొక అంగుళీయకమును స్వయముగా నిర్మించి శివాజీ నిండుసభయందు ఉండగా నా యుంగరమును తీసుకొని వెళ్లి శివాజీని చూచి నేనొక యుంగరమును చేసితిని దానిని నీవు ధరించుకొనుమని యిచ్చినంతనే శివాజీ దానిని చూచి అదియేమి అందముగా లేదని తిరిగి యా మహనీయుని చేతి కిచ్చినంతలో స్వామివారికి మనస్సు విచారము కలిగి యింతటి గొప్పశక్తి గల యుంగరము నెవ్వరికిత్తును ? వారివలన దేశమునకేమి ప్రయోజనము కలుగును? నా ప్రయత్నము నా హృదయమునగల గొప్ప ఆశ వ్యర్థమైనందుకు నేనేమి చేయవలెను. అనుకొని ఆ యుంగరము నేలకేసి కొట్టినంతలో నవగ్రహ రూపములు ఒక్కపెట్టున తళుక్కున మెరసి యా రత్నములతో గూడ మాయమైపోగా వట్టి బంగారపు టుంగరమే మిగులగా సభాసదు లెవ్వరు కన్నులు మూసుకొనిపోగా దిగ్భ్రాంతిచెంది కొంతసేపటికి తెప్పరిల్లుకొనిరి. అప్పుడా శివాజి యెంతయో విచారపడి పాదాక్రాంతుడై స్వామీ! మీ మహిమ తెలియక పామరుడనై చెడిపోతిని. నా యజ్ఞానమును క్షమించి యిప్పుడు మీ చేతిమీదుగా శ్రీ పార్వతీమహాదేవి విగ్రహమును తయారుచేసి నా కొసంగినచో నిత్యము నిను ధ్యానించుచు అమ్మవారిని పూజించుకొనుచుందునని ప్రార్థించినందున అటులే విగ్రహమును సువర్ణములో పోతపోసి యిచ్చి చాలావఱకు నీకు సహాయము జరుగునులే అని స్వామివారనిరట. ఈ పీఠములు కాక శ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి వారు మన ఆంధ్రదేశములో గోపాలుడుగను, శిల్పిబ్రహ్మగను, యోగిగను. దేశసంచారిగను, సామాన్య కుటుంబిగను, వెట్టివీరయ్యగను, ఇట్లెన్నియో రూపములు చూపి సూర్యునివలె తానొక్కడే సమస్త గురుపీఠములపై శాసనకర్తగా నేనుందునని లోకమునకు భవిష్యత్కాల జ్ఞానమును చెప్పియుండుట, అందరి యొక్క యక్షరమైన

పొరపాటు రాకుండుట, వ్యత్యాసము జరుగకుండుట, ప్రపంచమున నిత్యము ధ్యానరూపమున వారి నామధేయముండుట, యెల్లరకు దెలిసిన విషయమే కదా? ఇంక నెందఱు మహానుభావులు ప్రకాశింతురో వినము చెప్పగలమా ?

12) ప్ర॥ అమరములో చెప్పినవాటు మీ జాతి కాదంటిరిగదా? బయటి కమ్మరి, ఇట్టి జాతులెక్కడివి ?

ఉత్తరము: ఇప్పటికి వెయ్యి సంవత్సరముల క్రిందట చోళరాజులకు ఫణీంద్ర పట్టణమను పేరుగల యొక ముఖ్య పట్టణ ముండెడిది. అందు పాలన చోళుడను ఒక రాజుండెను. అప్పటికి అమరుడు వచ్చి యెటులో రాజస్థాన పండిత స్థానమును సంపాదించ యత్నించుచుండగా రాజుకు సంతాన హీనతా దోషము తనకు చిరకాల చింతగా నుండెడిది. చివరకు తన భార్య గర్భవతియై నప్పటిమండి తనకు గురువుగా నున్న పీఠాధిపతియగు స్వామి వారి నడుగగా నీకు పురుష సంతానరేఖ లేదు సుమా! ఈ వచ్చిన గర్భ మున స్త్రీ సంతానము కలుగును. తద్వారా నీ వంశము రాజ్యాభిషేకము పొందగలుగును. అందుకై విచారపడ నవసరములేదని చెప్పెను. అయినను రాజు మనస్సులో మగబిడ్డకు, ఆడబిడ్డకు భేదమున్నదిగదా? ఎట్లయినను పురుష సంతానమునకై ఔషధసేవ చేయుదమా? జపతపాదు లేమైన చేయింతమా? లేక షోడశ మహాదానములలో నేదియైన కల్పోక్త ప్రకారము ఆచరించెదమా? ఇంకొక భార్యయందు పురుష సంతానము కలిగినను పట్టాభిషేకార్హతకు సందేహము కలదేమో? గురువుగారి మాటలలో ఇంకొక కానుపులోనైన పురుష సంతానమున్నట్లు మనము వినియుండలేదుగదా? అని నానావిధములుగ ఆలోచించుచుండెను, ఇట్లు కొంతకాలము గడచినది. అప్పటికి తనభార్యకు ఆరవమాసము వచ్చినది. స్త్రీలు కూడ కొందరు పరిశీలించుచు పురుషపిండమునకు స్త్రీపిండమునకుగల భేదములను పరిశీలిం చుచు ఆడుబిడ్డయే యగుననుచుండిరి. ఈ సమయమును కనిపెట్టి అమరుడు తనంతట తానేవచ్చి రాజసభయందు కొంత ప్రసంగము జరిపి, రాజపరేణ్యా

మన పట్టణములో మీ సంతానమును గురించి వాదుకలు జరుగుచుండుట నేనుకూడ వింటూనే యున్నానుకాని, నిన్నటి దినమున ఒక మహానుభావుడు మన మంచినీళ్ళ బావియొద్ద గూర్చుండి చాలమందికి చేతులుచూచి జాతకములు చెప్పుట, కొందరికి ప్రశ్నలు చెప్పుట, నేను చూచుచునే యున్నాను. నేనా మహనీయునికి నమస్కారముచేసి స్వామీ! మారాజుగారికి సంతానము కలుగునో? సెలవీయుడని నంతలో ఆయన నావంకజూచి, పురుష సంతానము కలుగునుగాని వెంటనే బాలారిష్ట దోషము తగిలి జీవించుట దుర్లభమనెను. నేనటులే నమస్కరించుచు స్వామీ! ఆ దోషమునకు పరిహారము చెప్పితిరేని మీరెట్లా చరించుడని, సెలవిచ్చెదరో, ఆ ప్రకారము చేయగలమని అట్లే నిలిచియుండగా అంతపని మీ రాజు చేయగలడా? అనెను. మాకు సాధ్యమైనంతవఱకు చేయుదుము సెలవియ్యండి అంటిని అయితే మీ పట్టణమున సుత్తరపు పైపున చెఱువు త్రవ్వించి సమారాధన మొనర్చిన యెడల ఆ దోషము పరిహారమై శిశువు జీవించునుకాని తల్లియా బిడ్డను చూడరాదు అనెను. నేను స్వామీ! తల్లి చూడకుండ బిడ్డను కనుట యెట్లు తటస్థించును అనినంతలో ఆ మహనీయుడు ఇంతమాత్రము మీకు తెలియదా? తల్లికి గంతగట్టి చుట్టుపట్లనున్న వారందఱు చక్కగా అన్నిపనులు చేయుచుందురుగదా? అనుచు ఆయన వెంటనే యెచ్చటికో వెళ్లెను. నేను ఇంకను మాట్లాడుదమనుకొంటిని గాని నాకు ఆయన వెంటనే యెచ్చటికో వెళ్లెను. నేను ఇంకను మాటలాలకించిన రాజు మనము చెఱువు త్రవ్వించలేమా? అని అమరునితో ననెను. ఏలినవారి యిష్టము అంటూ రాజుగారి ముఖ్య స్నేహితునికంటెను ముఖ్య బంధువునికంటెను. అభిమాన గౌరవములను పొందెను. రాజాజ్ఞతో చెఱువు త్రవ్వించుచు అందలి మేస్త్రితో ఒక విషయము చెప్పెను. రాజు భార్య ప్రసవించిన సమయమున మీలో ప్రసవించినవారి మగబిడ్డను మా కిచ్చి రాజుగారి అమ్మాయిని మీకిచ్చి. నీవు కోరినంత ధనమిచ్చెదను. అని ఆ మేస్త్రిని నిర్ణయించుకొని మంత్రసానిని కూడ తన కట్టడిలో నుంచుకొని చెఱువు

పూర్తిచేయుట లోపలనే రాజు భార్య ప్రసవము, ఒడ్డెవారిలో ఒక స్త్రీ ప్రసవము పురుష సంతానము కలిగి. రాజగృహమునుండి ఒడ్డెముఠాలోకి రాజపుత్రి, ఒడ్డెముఠానుండి మగపిల్లవాడు చేరి యెవ్వరికిని తెలియకుండా రాజుగారికి మగపిల్లవాడు పుట్టినట్లు పట్టణమెల్ల సంతోషముగా అలంకారములు చేయించిరి. ఒడ్డెవారును రాజపుత్రి మన యింటికి వస్తూ లక్ష్మీదేవిని మన ముఠాలోకి తీసుకువచ్చిన దనుకొనుచు నిండుగా వైభవము జరుపుకొని యానందించిరి. అప్పటినుండి అమరుని మాటయందు రాజుకు గౌరవము కలిగియుండెను. జాతకర్మ సమయమునకు రాజగురువు నాకు కొంచెము అనారోగ్యముగా నున్నది. సమయానుకూలముగ జాతకర్మ సంతోషముగా జరిపించుచుండుడని రాజుగారికి చెప్పెను. మా గురువుగారు రాలేదని అమరునితో రాజు చెప్పగా ఆయన చాలా గొప్పవాడు కనుక తన శాస్త్రము ప్రకారము స్త్రీ సంతానము కలుగక పోయినందున కొంచెము లజ్జగా నుండి యిట్లు రాకుండియుంటవచ్చుననెను. తరువాత అన్నప్రాశన మొదలగు కర్మకాండ వేడుకలు జరిగినవి. రాజుగారికి మహామేరువును చూడవలెనని కోరిక కలుగగా అమరుడు అది నాకు బాగుగా తెలియదు. మీ గురువుగారి వల్లి తెలిసికొందమనగా రాజుగారు గురువుగారితో ప్రస్తావించిరి. ఆ మేరువుయొక్క విశేషములు అచటికి పోవుటకు వచ్చుటకు తగిన సామాగ్రి మొదలగు విషయములు. ప్రయాణారంభమునుండి తిరిగి గృహమునకు చేరునప్పటి కగు కాల నిర్ణయము మున్నగునవి యెల్ల తెలిసికొనియెను. రాజుగారు తనకు కుమారునకు పట్టము గట్టి తీర్థయాత్ర సేయ నుద్దేశించి గురువుగారి నడుగగా ఇది మీకు అంత్యదశగానున్నది. రాజ్యభంగము, ప్రాణభీతియు కలుగునట్లు నాకు తోచుచున్నది అనెను. ఈ గురువుగారి మాటలు అమరుడుకూడ వినియుండెను గాని గురువుగారు తన స్థానమునకు వెళ్లిన తరువాత నిట్లు చెప్పెను. ఆయన చాలా పెద్దవాడు. తన మాట నెగ్గక పోయెనే అను పట్టుదలతో మాట్లాడుటయే కాని యేమియు లేదనెను. ఇట్లు ప్రయాణము నిర్ణయించిరి. రాజపుత్రునకు కిరీటము కావలెనని కోరి

నంతలో శిల్పాచార్యుడు కిరీటముచేసి యిచ్చెను, గాని ఆశీర్వచనము చేయ లేదు. వారు మహా మేరువును చూచుటకు చతుర్దశ మనువులవలె పదునలుగురు ప్రయాణమై వెళ్లిరి. పట్టాభిషేకమయిన మరునాడే ఆ ఒడ్డెవారి పిల్లవానికి కర్పకుడను నామధేయమును, అమరుడే నిర్ణ యించినాడు కనుక శిల్పులు మాత్రము ఒడియ చోళరాజు అనిరి. అమరుడా మాటలను విని రాజా! మనకు పూర్ణశత్రువులు, మీ గురు వంశమే అనగా వారు నాకేమి చేసినారనెను. పూర్వము మీ తండ్రికి పురుష సంతానప్రాప్తి లేకపోగా మన దేశము ఇతర రాజులకు చిక్కి మనము అష్టకష్టాల పాలౌదుమని యెంచి నా తెలివి ప్రకారము ఒడ్డెవారి ముఠాలో ప్రసవించిన మగపిల్లవాడవైన నిన్ను తీసుకొనివచ్చి రాజ గృహములో నుంచి, రాజభవనములో జన్మించిన ఆడుబిడ్డను ఒడ్డెవారి ముఠాలోకి చేర్చి యీ కథ యెవ్వరికిని తెలియనీక అనగా మీ తండ్రికి తల్లికిగూడ తెలియనీక నీకు పట్టాభిషేకము చేయించితిని. వారు ఒడ్డెరాజు ఒడ్డెరాజు అంటూ యున్నారు. అంతేగాక నీ కిరీటమున చుట్ట దానిపై తట్ట, ఆ తట్టమీద మట్టిపెళ్లలు, ముందువైపున చెలుగుడు పాఱ, దాని మధ్య గడ్డపాఱ ఇట్లు లోకమున కెఱుకపరచినారు. అందువల్ల వారు మనకు విరోధులు అని వచించెను. కర్పకుడను నామము ధరించిన ఆ ఒడ్డెరాజు మన శత్రువులను మనమేమి చేయవలెను? అని సలహా కోరెను. అట్టి జాతిని నిర్మూలనముచేయుటయే మన పని. అని అమరుడు నిర్ణయించెను.

అమరుడు తానే రాజుగా నిలబడి విశ్వబ్రాహ్మణులను చంపించ నారంభించెను. కర్పకుడను రాజు మాత్రము బాల్యావస్థలో నున్నవాడే కనుక మంత్రి యిష్టప్రకారము నడువవలసి వచ్చెను. అట్టి సమయములో దూరదేశములకు బోయినవారును సమీప గ్రామాదులనుండి మాఱు వేషములతో దిరుగుచు మాఱుపేరులు పెట్టుకొని యీ దుర్భర కాలములో యెవ్వరే విషముగా కష్టము లనుభవించిరో? ఎందఱు మరణించిరో?

మనము చెప్పజాలము. ఎట్లా అయితే నేమి విశ్వబ్రాహ్మణజాతి మాత్రము ఫణీంద్ర పట్టణములో నొక్కరును లేక యుండుటచే వీరు చేయునట్టి పంచ వృత్తులు నశించుట తోడనే వ్యవసాయమున కుపయోగించు సాధనములు గాని. గృహ నిర్మాణమునకు సాధనములు గాని ఒకటి యననేల సర్వము నశించి పాడిపంటలు. వ్యాపారములు, నానావిధ జీవనములకు ఆధారములు లేక దేశమునకు కరువు కలిగి జనులెల్లరు దేశములకు పోవుదుమా? అనునంతటి దుర్భరస్థితి పట్టణమునకు కలిగినది.

వారు మేరు పర్వతమునకు వెళ్లి అచ్చటగల విశేషములనెల్ల చూచి యానందించి తిరిగి పట్టణమునకు వచ్చునప్పటికి సుమారు 7-8 సంవత్సరములు పట్టియుండవచ్చును, వారు తిరిగి వచ్చుచుండగా నచ్చటచ్చట ఫణీంద్ర పట్టణ నాశమును గూర్చియు, ప్రజారిష్టములను గూర్చియు, రాజ వంశ చరిత్రలో గలిగిన హీనతను గురించియు, వినుచు పాలన చోళుడు తన గురువుగారితో నిట్లనెను, స్వామీ! ఎన్నియో తరముల నుండి మీరు లోకకళ్యాణముగా గురుపీఠమున నుండి మీ యాచార్యత్వముతో లోకమును జ్ఞానమార్గమున నడిపించుచు నిత్యకళ్యాణము పచ్చని తోరణముగా ప్రకాశించునట్లు దినదినాభివృద్ధిగ దయా ధర్మసత్యములతో లోకమును కాపాడుచుండుట తెలిసియు, దుర్మార్గుడైన అమరుని నమ్మి నాకును నా దేశమునకును భరింపరాని ప్రళయమును తెచ్చుకొంటిని. అప్పుడప్పుడు మీరు చెప్పుచున్న సద్వాక్యములను గూడ వినజాలక పోతిని. ఇప్పుడు నాకు రక్షకులు మీ కంటే ఎవ్వరును లేరు. తగిన యాలోచనతో మన స్థానమునకు మనము చేరవలెను గదా? ఇంత విపరీతముగా గప్పుట్టుచున్న అగ్నిగుండమువంటి యిచ్చోటికెట్లు వెళ్లగలము? నేనొక్కడనే పోయినను కొంపవలకు మేలుకాదునుగాని నా వంశమునకు హీనత్వము తెచ్చుట మాకు గురుపీఠముగా నున్న మీ వంశమంతయు నశించుట, నా పరిపాలనములో నున్న జనులెల్లరును ఇట్టి ఘోరాపదతో నిత్యము దుఃఖించుచుండుట, చుట్టుపట్లనున్న రాజులెల్ల నన్నొక హీనజనునిగా నెన్నుకొనుట.

ఇవి అన్నియును సహింపజాలకున్నను మనము దేవక్షేత్రమగు మహా మేరువును చూచిన పుణ్యఫలమే మనకు తోడు గాకుండునా? అని నేను ఆత్మశుద్ధిగా నిన్నే నమ్మియున్నాను. అనగా గురువుగారిట్లనిరి. మనము వీధినాటకములను కల్పించి ఆయా గ్రామములలో వినోదములను కలిగించుచు మన యథార్థరూప మెవ్వరికిని తెలియనీక ప్రవర్తించు చుండవలెను. అందులో రామాయణము, చోళరాజు చరిత్ర, అను నాటకములను ప్రదర్శనములు ఊరూర నెల్లరకు తెలియజేయుచు పోవుదము, తరువాత నేనే సమస్త కార్యములు చక్కగా నెఱవేర్తును, భయపడవద్దని చెప్పి నాటకములను గ్రామమధ్య ప్రదేశములయందు చూపుచు ఒక్కొక్కయూరు, మెల్లమెల్లగా నడుచుచు మేము భాగవతులము అని చెప్పుకొనుచు పట్టణ సమీపములో నున్న యొక గ్రామములో రామ నాటకమును ప్రదర్శించిరి. దానిని చూచి చుట్టుపట్ల గ్రామములవారు కూడ సంతోషించుచు మా వూరిలో నాటకము వేయించుదుము, అనుకొనుచుండగా ఫణీంద్ర పట్టణ ప్రభువుగానున్న కర్పకుడును, మంత్రిగానున్న అమరుడును ఈ భాగవతులను మా గ్రామము రమ్మని కోరిరి. అటులే వచ్చెదమని యా పట్టణములో రామనాటకమును ప్రదర్శించి యెల్లరను సంతోషపఱచిరి. చోళరాజు మనవాడే కదా? ఆ నాటకమును మనము వేయింతము అని యా భాగవతులను పిలిచి రామనాటకము బాగుగానేయున్నది. చోళరాజు నాటకమును వేయుడు, అనగా ఆ భాగవతులు అయ్యా! రామనాటకము చాల కాలము నాటిది. కనుక ప్రజలను మెప్పించగలిగితిమి. చోళరాజును చూచిన వారున్నారు కదా' అట్టి సమయములో అందరిని మెప్పించుటకు రాజుగారి దుస్తులు, ఆయుధములు వగైరాలు చక్కగానుండవలెను. గనుక కొంసేపు మా యొద్దనుండే చాలును. అనగా అటులనే యిచ్చెదమని వారొసంగిరి. చోళరాజు నాటకము మొదలుపెట్టి రాజుగారి సంతాన కథ జరిగిన కుట్ర యెంతమాత్రము తప్పకుండ గ్రామస్థులకు తెలియునట్లు ఆడుచుంటిరి. మహామేరువు నుండి గురువుగారితో కలసి చోళరాజు రావడము,

క్రర్పకుని తల తెగఁగొట్టడము, అప్పుడు పౌరులందఱు వారి కష్టనిష్ఠురములును తీరని దుఃఖములు చెప్పకొనుట, తరువాత అమరుని కట్టివేసి చిత్రవధ చేయుట, మొదలగు విషయములు జరుగుటచే కొందఱు శిల్పవృత్తులతోను మఱికొందఱు వ్యవసాయపు కూలీలుగను, ఎట్లెట్లో బాధలు పడిరని మన మూహించవలెను, కాని అట్టివారితో విశ్వబ్రాహ్మణులకు సంబంధ ముండదు. బయట కమ్మరి మొదలగు నామములతో ఇతర కులస్థులు అనగా తురకలు మొదలగువారు కూడ కొన్ని వృత్తులతో జీవించుచుందురు. ఈ కధ ధీరజన మనోవిరాజితమను గ్రంథమునను, పరిమళ చోళచరిత్రము అను గ్రంథమునను వ్రాయబడియున్నది.

13 ప్ర॥ బ్రాహ్మణులకు విహితములైన యజనాది షట్కర్మములలో మనుస్మృతియందు "త్రీణికర్మాణి జీవికా"అని చెప్పబడినదికదా: పౌరుషేయులను బ్రాహ్మణు లద్వేపకార ముండకపోవుటకు కారణమేమి?

ఉత్తరము: ఆదిపురుషుడగు విశ్వకర్మ మాకు పంచవృత్తులవల్ల జీవనమును, షట్కర్మాధ్యధికారములును,

శ్లో॥ శమోదమ స్తపశ్శౌచం క్షాంతిరార్జవ మేవచ।
జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రాహ్మం కర్మస్వభావజమ్॥

అని ఆర్షేయ బ్రాహ్మణులకంటె పదికర్మ లధికముగా చూపుచు దేవాలయాది నిర్మాణములు. కామ్యకర్మలగు యజ్ఞాదులు మనుష్య జీవనాధారములగు వస్తువాహనాదులు, సర్వజనోపకారములగు వాపీకూపతటాకాదులు, తేజస్విత్వమునకు సువర్ణరత్నాన్వితాభరణాదులును, సుఖజీవనార్ధం గృహారామాదులను రచించి లోకోపకారములతో ప్రకాశించు చుండుడని హితోపదేశ మొనర్చి—

శ్లో॥ పరోపకారాయ వహంతి నద్యః పరోపకారాయ ఫలంతి వృక్షాః।
పరోపకారాయ చరంతిచావః పరోపకారార్థ మిదం శరీరమ్॥

అని యిట్లు ద్విజత్వము కంటె ఋషుత్వమునుగూడా యిచ్చియున్నాడు.
యజుర్వేద కాం: (3-1-9)

శ్రుతిః॥ అంగిరస ఇమే సత్రమా సతేతేసు వర్గం లోకం। సప్రజానంతి

తేభ్య ఇదం బ్రాహ్మణం బ్రూహి॥ భాష్యం॥

అంగిరో నామకా ఇమేమహర్షయః। సత్రమను తిష్ఠంతి తేతుస్వర్గప్రాప్తి సాధనానాంనాధానే దిష్ఠనామక శస్త్రాదీ నామపరిజ్ఞానాత్స్వర్గం నజానంత్య తస్తేభ్య ఇదం త్వయాధీనం శస్త్రాది ప్రతిపాదకం బ్రాహ్మణం బ్రూహి॥

అంగిరులను ఈ ఋషులు సత్రయాగమొనర్చిరి. వారల స్వర్గ ప్రాప్తికి సాధనములయిన నాధానేదిష్ఠములను పేరుగల శస్త్రాదుల యొక్క శిల్పములను తెలిసికొనక పోవుటవలన స్వర్గమును తెలిసికొనక పోయిరి, అందుచే వారికొఱకే నీచేచదువబడిన శస్త్రాదిశిల్పప్రతిపాదకమగు బ్రాహ్మణమును చెప్పుము. అను ఈ శ్రుత్యర్థముచే శస్త్రములు మున్నగు శిల్ప ప్రతిపాదకమగు విజ్ఞానము స్వర్గజ్ఞానము ననుసంధించునని తెలియదగును. ఋగ్వేదము (1-42-7)

శ్రుతి॥ అస్మా ఇదుస్తోమం సంహినోమిరథం నతష్టేనతత్సినాయ। గిరశ్చ

నిర్వాహనేను వృక్తింద్రాయ పిశ్వమిన్వం మేథిరాయ॥ భాష్యం॥ స్తోతృభిః ప్రేషితాని స్తోత్రాని। రథవదింద్ర మానయంతి। అతఃకారణాత్ర ధేచ్ఛాకుర్వతేరథకారో రథంకరోతి. తద్వదహమింద్రాయైన సత్వన్యదేవాయ స్తోత్రం। రచయామి యత్స్తోత్రం రథవత్ సువృక్తి సు సంస్కృతమితి॥

స్తుతి చేయు వారలచే పంపబడిన స్తోత్రములు రథమువలె నింద్రుని తెచ్చుచున్నవి. ఈ కారణము వలన రథమందిశ్చచే రథకారుడు రథమును చేయుచున్నాడు. అటులనే నేను ఇంద్రుని కొఱకే (ఇతర

దేవతల కొఱకు గాదు) స్తోత్రమును రచియించుచున్నాను. నా స్తోత్రము రథమువలె చక్కగా నడుచునదియు, చక్కగా సంస్కరించినదియు, అగును. అని యిటుల నుడువబడి యుండుటచే మంత్రకర్త తాను మంత్రమును రచియించుటలో రథమువలె ఋజువుగా నడుచునదియు చక్కగా పరిశుద్ధి చేయబడినదియు, అని చెప్పుటవలన మంత్రరచనా స్తోత్రము కంటె రథమెక్కువ పావనమైనదిగను, మంత్రరచయిత కంటె రథకారు డధిక పవిత్రత నొంది యుండువాడనియు, తెలియక మానదు.

స్కాందపురాణ ప్రతిష్ఠాఖండములో

శ్లో॥ శిల్పినాందేవ కర్తృత్వం వంశ్యానాం విశ్వకర్మణః।
అహం విశ్వస్య కర్తాచ కర్తారోమమ శిల్పినః ॥ (1)
శిల్పి గర్భాణి లింగాని లింగగర్భాశ్చ శిల్పినః।
శిల్పిరూపంతు మద్రూపం నభేదః శ్రుణు పార్వతి ॥ (2)

ఈశ్వరుడు పార్వతితో ఇట్లు చెప్పెను. ఓ పార్వతీ! విశ్వకర్మ బ్రహ్మవంశస్థులగు శిల్పులకు దేవతల రచించుట నియమిత మయ్యెను. నే సంజను చేయువాడను, ఆ దేవశిల్పులు నన్ను చేయువారలు. నా గర్భము నందు వారలవతరించిరి. వారి గర్భమునందు నే నవతరించు చున్నాను. అందుచే నాకును వారికిని భేదము లేదు. అని చెప్పబడి యున్నది. అందువలన సామాన్య బ్రాహ్మణునికంటె శిల్పాచార్యునకు శతగుణ ధర్మములను చెప్పియున్నారు, అందువలననే

శ్లో॥ శూద్రకోటి సహస్రాణా మేకవిప్ర ప్రతిష్ఠితం।
విప్రకోటి సహస్రాణా మేకశిల్పి ప్రతిష్ఠితమ్ ॥

అవి ధర్మశాస్త్రములు, పురాణములు, నానాక్షేత్రమహత్తులు, నానా మహత్తర చిత్ర విచిత్ర శిల్పములు ఋజువుపరచు చున్నవి.

14) ప్ర॥ ఆక్షేయ బ్రాహ్మణులు అగ్నిష్టోమాది కర్మలు చేయునప్పుడు విశ్వకర్మ వంశజులైన రథకార బ్రాహ్మణులను పూజించవలసి నట్లు శ్రుత్యాదుల యందెచ్చటనైన కలదా ?

ఉత్తరము :- యజ్ఞమునందలి యిష్టకోపధానమున

శ్రుతి ॥ విశ్వకర్మ ఋషిః, ప్రజాపతి గృహీతయా త్వయా వాచం గృహ్ణామి ప్రజాభ్యః ॥ అనియును

శ్రుతి ॥ విశ్వకర్మా దిశాంపతిస్సనః పశూన్పాతు తస్మైనమః। ప్రజాపతీ రుద్రో వరుణోఽగ్నిర్దిశాంపతిః సనః పశూన్ పాతు సోఽస్మాన్ పాతు తస్మైనమః। ఏతావై దేవతా ఏతేషాం పశూనా మధిపతి యస్తాభ్యోవా ఏషఽవృశ్చతే యత్పశుశీర్షాణ్యు పదధాతి। హిరణ్యేష్టకా ఉపదధాత్యేతాభ్య ఏషదేవతాభ్యో నమస్కరోతి ॥ (యజుః, కాం. 5 ప్ర 5 అను 5 - మం. 1.) మఱియు తైత్తిరీయ పంచబ్రహ్మోపనిషత్ ॥ యస్మాద్విశ్వగ్‌ం సమస్తం క్రియతే। స, మాం, పాతు - విశ్వస్రష్టా, విశ్వభర్తా, విశ్వశాంతికః। జీవాతాభువనానాం. సిద్ధానాం, కిన్నరాణాం, యఃపురాణశ్చ, జీమూతవర్షకః త్రాతానుమాతా, పురుషఃపరః విరాడిశ్వకర్మా, స్వరాడ్విశ్వకర్మా, సగ్‌ంరాడ్విశ్వకర్మా, బ్రహ్మవిష్ణురుద్ర శతముఖాదయో దేవా జాయంతే। విశ్వేదేవావసవః పితరోగంధర్వాఇమే సర్వేలోకాశ్చేతి, విశ్వకర్మణః। వ్యోహ్నో మారుతః। మారుతాద్వైశ్వానరః, వైశ్వానరాజ్జలం, జలాద్భూమిః, భూమ్యాఔషధయః, ఔషధీభ్యోబీజాని, బీజేభ్యోఽఖిల సస్యాని, సస్యోద్భవంధాన్యం, ధాన్యేభ్యోఽన్నం భవతి, అన్నాదేవరసః, తద్రసేన జంతూనాగ్‌ం సర్వేషాగ్‌ంరేతః శుక్లశోణితరూపమేవాహ, తస్మాత్పిండాస్సముత్పన్నాః, సముత్పన్నాని స్థావరజంగమ రూపాణి। జాతాన్యనేకాని పిండబ్రహ్మాండాని, ఇతి విశ్వకర్మణాభూతాని, విశ్వకర్మణావృద్ధాని, తేనైవాహప్రతిష్ఠితాని పంచముఖేభ్యః పంచశీర్షస్యాస్యమనుః ప్రథమః,

యోద్వితీయః త్వష్టాతృతీయః. శిల్పీచతుర్థః. విశ్వజ్ఞః పంచమ ఇతిసప్త వార్షో విధీయతే, సానగఃసనాతనో ఒహభూనః, ప్రత్నః సువర్ణశ్చేత్యేతేచ సర్వే గోత్రపురాణాః। ప్రాకృతేష్వాద్యాద్యా ఈశ్వరో విశ్వకర్తా ఆహుః కశ్యపో ఒత్రిస్తాథ్యాగ్ం సూర్యచంద్రాదయో జాయంతేగనాద్యాః కుంభిసూత్రాః, స్థలజాజలజా కీటకాశ్చమర్త్యథాః, ప్రకృతయః ప్రజాతావేదవిద్యాః। సాంఖ్యాదయో ఒపి, కర్మజ్ఞానబోధికాః, నిగమాగమాశ్చ, సర్వం విశ్వం నిర్మితం సవిశ్వకర్మా పరబ్రహ్మేత్యుపనిషత్ అను ఏతదుపనిషత్ పఠేత్ ప్రాతరాది సమయే స సర్వపాపైః పరిముచ్యతే, తద్వైవం విశ్వకర్తృ కారణం పంచబ్రహ్మాధిగచ్ఛతి ॥

అంతయేల పండిత హూరాకమి చంద్రసూనుడగు రామచంద్ర పండితుడు రచించిన వాస్తుప్రతిష్ఠా సంగ్రహమను గ్రంథములో మొట్టమొదటనే యజ్ఞశాల నిర్మించుటకు కొలతలు పెట్టుటకుముందు, అంగుళ నిర్మాణ కర్తారం సూత్రధారం విశ్వకర్మాణం పూజయేత్" అని విశ్వకర్మ బ్రాహ్మణుని పూజించి యటుపిమ్మట గణాధిపతిని పూజించియున్నాడు అట్టి మహా పండితులకంటె మనకు తెలియునని యనుకొనుటన్యాయమా ?

శ్లో॥ యజ్ఞకర్మణి యేవ్యగ్రాః। పూరుషాః శిల్పిన స్తథా। తేషామపి విశేషేణ పూజాకార్యా యథాక్రమమ్ ॥ అని రామాయణమునందే చెప్పబడియుంచెను.

15) ప్ర॥ మీరు దేవాలయములలో దేవతా ప్రతిష్ఠలు చేసేవారుగదా ? ఆలయములలోకి మీ వర్ణస్థులు వెళ్ళి అభిషేకాదులు చేయక పోవుటకు కారణమును, ఇతర వర్ణస్థులు మీకు మ్రొక్కకపోవుటకు కారణము చెప్పవలసినది.

ఉత్తరము :- శిల్పశాస్త్రే దేవతా నిర్మాణ ప్రకరణే॥ శ్లో॥ అనంతవేద నామాని అష్టకం శిల్పశాస్త్రయోః వాస్తుద్వాదశ నామాని శాస్త్రం షట్కంచ నామకమ్ ॥ అష్టాదశ పురాణాని। అష్టవింశతిబాగమాః పంచసూత్ర ప్రమాణేన నిర్మితాః విశ్వకర్మణః ॥ వేదములు, శాస్త్రములు, ఆగమములు

పురాణములు, మొదలయిన వన్నియును విశ్వకర్మ ప్రోక్తములయి యున్నవి. మయమతాగమముయొక్క ప్రమాణము శ్లో॥ మానసారంతు గార్గేయం దీప్తంమారీచ మత్రియం వైఖాన స్సర్వశాస్త్రేషు సారంమయ మతాగమమ్ ॥ ఈ మొదలైనవి సూత్రగ్రంథములును, మయమతాగమ గ్రంధమునకు ముఖ్యములై యున్నవి. ఈ విశ్వకర్మయొక్క సంతతీయులు. ఉపనయనము మొదలుకొని దేవనిర్మాణాది వృత్తులు, వేదాభ్యాసము లోకకర్మ వృత్తులు, గురువుల వలన నేర్చుకొనే కర్మలలో ప్రదక్షిణ మంత్రముయొక్క సూత్రము ॥ ప్రాణానాయమ్య। సంకల్ప్య ॥ గోత్రస్య - నామధేయస్య- (గృహస్థుడైనచో మమధర్మపత్నీ సమేతస్య) క్షేమస్థైర్య విజయాయురారోగ్యై శ్వర్యాభివృధ్యర్థం. ధర్మార్థ కామమోక్ష చతుర్విధ పురుషఫలావాప్త్యర్థం, బ్రహ్మాదిత్రయస్త్రీం శత్కోటి దేవతా ఉత్పత్యధికార సిద్ధ్యర్థ్యం, శంకుస్థాపన, గర్భాలయ, శుకనాసి, కాంతరాళ, మధ్యరంగమహాధిష్ఠాన మండప, ముఖమండప, ఆర్థమండప, యాగ మండప, యానమండప, సభామండప, నృత్యమండప, కళ్యాణమండప, కోట, దుర్గ, గోపుర, ప్రాకారాది సమస్తమండప, అంకురారోపణ, జలాధివాస, పంచగవ్యాధివాస, క్షీరాధివాస, ధాన్యాధివాస, వాస్తుహోమ, బలి శాంతిహోమ, మూర్తిహోమ, అంగవైకల్య దేహశుద్ధి, గర్భవిన్యాస, రత్నస్థాపన, పీఠారోహణాష్టబంధన, పంచసూక్తాభిషేక, ధ్యాన, నేత్రోన్మీలన, మంత్రపుష్పాది కలశస్థాపన భేరీమృదంగ పటహధ్వజారోహణ, అగ్నిప్రతిష్ఠాపన, వివాహోత్సవ, వసంతోత్సవాదిసిద్ధ్యర్థం, అని శిల్పాచార్యులు సంకల్పములు యావత్తు చేయవలసినవారై యున్నది. మయ మతాగమే, శిల్పశాస్త్రే, శ్లో॥ అంకురార్పణ పూర్వంతు। జలవాసం ద్వితీయకం। తృతీయం పంచగవ్యంచ। క్షీరవాసం చతుర్థకమ్॥ పంచమం వాస్తుహోమంచ, బలిహోమంచషష్ఠకం। సప్తమంమూర్తిహోమంచ। అష్ట మందేహశుద్ధిభిః ॥ నవమంగర్భవిన్యాసం। దశమంరత్నవిన్యసేత్। ఏకాదశంతునయనం। ద్వాదశంచాష్టబంధనం ॥ అభిషేకంత్రయోదశం। ధ్యానమే

పంచతుర్దశమ్మే పంచదశం నేత్రమోక్షం। మంత్రపుష్పంతు షోడశం ॥ ఏతే షోడశవాసంచ। కర్తవ్యం శిల్పికోత్తమః। యథాదాత్మ్య నమస్కారం। ఆశీర్వాదంచ శిల్పినః ॥ అని చెప్పబడియున్నది కనుక ఈ మొదలుగాగల షోడశవాసములచేత విగ్రహములకు అంకురార్పణ మొదలుకొని దృష్టి మొదలయిన కళాప్రతిష్ఠవరకు శిల్పాచార్యులు చేయవలసినది. ధర్మకర్త శిల్పాచార్యుని తరువాత దేవతలకు నమస్కారములుచేసి ఆశీర్వాదము పొందవలసియున్నది. వృషోత్సర్జనమునకు గణపతిపూజ, మన్యుకర్మ హోమమును, మంటపారాధన, యూపప్రతిష్ఠ కాలమందు వాస్తుపూజయును విశ్వబ్రాహ్మణులకు వస్త్రాభరణాదులిచ్చిన తరువాత యజమాని నాశీర్వదించి పిమ్మట వృషభమునకు ముద్రవేయవలయును. ఇది విధియై యున్నది. శిల్పశాస్త్రే.

శ్లో॥ మాతా శిల్పీ పితా శాస్త్రం, అరూపం రూపమానసం।
యథా పిండోద్భవంచైవ। తథా పుత్రవిధి క్రమాతో॥
సరస్వతీ విలాస నామగ్రంథే।

శ్లో॥ శిలామృణ్మయ దారూణాం। ప్రతిమానాం విశేషతః।
నిర్మాతా ప్రథమః పూజ్యః। ఆచార్యస్తుతథాఽపతే॥
పటానాం తంతుకార్యత్వాత్। కారణత్వం విశేషతః।
నిమిత్తం కారణంచేతి। ప్రాధాన్యం విశ్వకర్మణః॥
సదాచారో యథాపూజ్యః। ఆచార్యస్తు యథాభవేత్।
సదాపూజ్యస్తు నిర్మాతా। సర్వస్మృతిషు సమ్మతమ్॥

తా॥ విగ్రహములకు శిల్పకారుడు తల్లియనియును, శాస్త్రము తండ్రి యనియును రూపములేని శిలామృణ్మయదారు లోహాదులకు రూపములను కల్పించి వానికి ప్రాణ ప్రతిష్ఠ, షోడశ కళాన్యాసములు చేయవలసిన విధియైయున్నది. అందు ప్రాణప్రతిష్ఠ మంత్రము. ఓం అసునీతే పునర స్మాసుచక్షుః పునః ప్రాణ మిహనోధేహి భోగం జ్యోక్పశ్యేమ సూర్యముచ్చ

రంత మనుమతే మృడ్యానస్య స్తి, అమృత్వం వై ప్రాణా అమృతమాపః, ప్రాణానేవ యథాస్థానము పహ్వాయతే ॥ అను మంత్రముచేత ప్రాణప్రతిష్ట చేయవలసిన దనియును తదనంతరం నమక చమక పురుష సూక్తములచేత అభిషేకము చేయవలసినదనియును భస్మగంధాక్షత పుష్పధూప దీప నైవేద్య తాంబూల మంత్రపుష్పాది షోడశోపచారములు శిల్పాచార్యులు చేయవలసినదై యున్నది. త్వష్టృవచనం ॥ శిల్పశాస్త్రే ॥

శ్లో॥ ఆచార్య స్థపత్యాజ్ఞాయాం। నిర్మాణాం శిల్పశాస్త్రయోః।
ఆకారో ఆగమంచైవ చాచార్యో శాస్త్రకోవిధః।
ఈకారో దేవతోత్పత్తి। రాచార్యో విశ్వకర్మణః ॥

॥ బ్రహ్మాండ పురాణము

తా॥ వేదాగమశాస్త్ర ప్రకారము దేవనిర్మాణములు చేయువారని యును, ఆచార్య నామము మొదలగు ధర్మములు కలవారని చెప్పబడి యున్నవి.

శ్లో॥ స్థపతిః స్థాపకశ్చైవ ఆచార్యో విశ్వకర్మణః।
ఆచార్యో విశ్వకర్మాచ। ఆధిబ్రహ్మ కులోద్భవః ॥
దేశికో రక్షకర్తాచ। జపమాలా కమండలుం।
కూర్మపీఠం శిరచ్ఛత్రం। యోగపట్టైరలంకృతమ్ ।
బ్రహ్మ విష్ణు శివో రూపం। కర్ణకుండల భూషణం।
నిత్యస్నానంచ కర్తవ్యం। నిత్యయజ్ఞం విధీయతే ॥
తర్పణం జపహోమాదీన్। కారయే ద్విశ్వకర్మణః ॥

ఈ శ్లోకార్థ ప్రకారము స్థపతి, స్థాపకములు రెండును నిర్మించేవారి యందును, ప్రాణప్రతిష్ఠ జీవకళాన్యాసములు చేసేవారనియును, మతోద్ధార కులై యున్నారని చెప్పియున్నది. శిల్పశాస్త్రే మయమతాగమే ॥

శ్లో॥ గర్భమందిర మాశ్రిత్య। శిల్పి అర్చక ఏవచ।
యతీనాం త పసీనాంచ। హ్యార్థమండప సేవితం।
రాజవైశ్య కులేజాతం। నృత్యమంటప సేవితం।
సర్వేషాం చైవభక్తానాం। గోపురాంతం విధీయతే॥

తా॥ గర్భాలయములో శిల్పాచార్యులును అర్చకుడు ఉందురు. అర్థమండపములో సన్యాసులును, మహాయోగులును ఉందురు. మిగిలిన వారు రాజులు, వైశ్యులు నృత్యమండపమున నుందురు. మిగిలిన భక్తాదులచటనుండి గోపురము వరకు నిండియుందురు.

శ్లో॥ రథపాదతలంచైవ ప్రథమే శిల్పకారకః।
ద్విశిల్పి దేవయానేచ। అతఊర్ధ్వం నిరాశ్రయం॥
యతిభిర్మునిభిః శిల్పి, యాజకశ్చార్చకస్తథా॥

ఈ శ్లోకార్థ ప్రకారము రథాది మొదలు దేవతా స్థానము వఱకు శిల్పిబ్రాహ్మణు లుండవలసిన దనియును, తరువాత యతీశ్వరులు, మునులు, యాజకులు, అర్చకులు, ఉండవలెనని చెప్పియున్నది. అయితే దేవుని కుడిపార్శ్వమున కుక్కుటాసనముతో అర్చకుడుండవలెను. కాబట్టి సానగాది పంచర్షి సంతతి పరంపర దేవాగమనములకు ఆవాహన మంత్రములు కలవారైయున్నారు. దేవదర్శనమునకు చతుర్వర్ణములవారు వెళ్ళునప్పుడు ప్రదక్షిణస్తోత్రము, యానికానిచపాపాని, జన్మాంతర కృతానిచ, తానితాని ప్రణశ్యంతి, ప్రదక్షిణ పదేపదే, పాపోఽహంపాప కర్మాహం, పాపాత్మాపాప సంభవః। త్రాహిమాం కృపయాదేవ, శరణాగతవత్సల! అన్యథాశరణంనాస్తి త్వమేవశరణంమమ, తస్మాత్ కారుణ్యభావేన, రక్షరక్ష, మహేశ్వర! అని స్తోత్రముచేసి స్వామి సన్నిధికి వెళ్ళవలయును, శిల్పశాస్త్రే।

శ్లో॥ నమస్కారాష్ట్రం యంకుర్యాత్ సద్భక్తో దేవసన్నిధౌ।
శిల్పినంధర్మకర్తారం। దేవంతే హితప్రియంగతాః॥

తా॥ భక్తుడు దేవాలయము లోనికివెళ్లి దేవునకు నమస్కారములు ముమ్మారు చేయవలెను. అందలి మొదటి నమస్కారము శిల్పాచార్యునకును, రెండవ నమస్కారము ధర్మకర్తలకును, మూడవ నమస్కారము దేవునకు చెందును. అని చెప్పబడి యుండుటచేత శిల్పాచార్యునకు మొదటను, తరువాత దేవరూపమునుకోరి చేయించిన ధర్మకును, పుణ్యఫలములు లభించుచున్నవి. మూడవ నమస్కారము మోక్షమిచ్చుచున్నది.

పంచరాత్ర మహోపనిషత్, క్రియాపాద కూటస్థాపన విధి. 44, పుటలో తస్మిన్కాలే సమాహూయ, రథకారద్విజో త్తమమ్ ॥ అని చెప్పబడియున్నది, అందువలన ద్విజోత్తముడైనగాని శిల్పాచార్యుడు కాజాలడని యర్థమగుచున్నది. "ప్రేషయేత్తోషయేచ్చాపి. యజమానోధనైర్భృశమ్" యజమానుడా రథకార బ్రాహ్మణో త్తముని ధనవస్త్రభూషణాదులచే సంతోషపఱచ వలెననుచున్నాడు. మఱియు పద్మసంహిత, క్రియాపాదప్రతిష్ఠ క్రమమున "ప్రాసాదం ప్రవిశేచ్ఛిల్పీ, రథకార ద్విజోత్తమః" అనియే చెప్పుచున్నాడు. సమస్త శుభకార్యములయందు విశ్వకర్మ వంశీయ బ్రాహ్మణులు ముందుగానే పూజింపబడుచున్నారు. వివాహ సమయమున విశ్వకర్మ వంశీయ బ్రాహ్మణుచే మాంగల్యమును రచించి "త్వష్టాసహాస్రమా యూగ్ంషి, దీర్ఘమాయుః కృణోతువామ్ ॥ (ఏకాగ్ని కాండ మంత్రప్రశ్నే - అష్టమఖండే) అని యాశీర్వదించిన తరువాతగదా పురోహితుని యాశీర్వాదము పెద్దల యాశీర్వచనములు జరుగుట, ఒక్కొక్క మూర్ఖుడు దేవాలయములో నుండియును దేవునకు నమస్కారము చేయదలచడు అంతమాత్రమున దేవుని దేవత్వము తగ్గుచున్నదా ? పరిమళ పుష్పము నొకానొకడు వాసన చూడనందున ఆ పుష్పమునకు గౌరవ భంగము కలుగుచున్నదా ?

16) ప్ర॥ దేవాలయములలో వెలనాటి పూజారులు, హరిద్విజులు, తంబళ్లు గురుకులులు, పాంచరాత్రులు, వైఖానసులు మొదలగువారు అర్చకత్వము చేయుచున్నారుగదా ? అటులనే మీవారెప్పటనైన

కలరా ? మీరు శివాలయములలోకి వెళ్ళి అభిషేకాదులు చేయుట కలదా ?

ఉత్తరము :- మా మతములో పెద్దవారలు అర్చకత్వ విషయమై చేయగూడదనియును, శివనిర్మాల్యము వగైరాలు భుజించ గూడదనియును, కట్టుబాటు చేసినందున ఎచ్చటను మాకులజులు అర్చకత్వము చేయుటలేదు. కాని శివాలయములు స్వయముగా నిర్మించియు. కొన్ని తావుల పార్వతి అమ్మవారి విగ్రహములను నిర్మించి స్వయముగా ప్రతిష్ఠించి ప్రతిసంవత్సరము శివపార్వతులకు కల్యాణములను వైభవముగా చేయుచుండుట కలదు. కొన్ని ప్రదేశములయందు అంజనేయాలయములు సృజించి ప్రతిష్ఠించి దేవునకు యీనాములిచ్చి యుండుటయు కలదు. స్వయముగా అర్చకత్వమును చేసికొనుటకు సమ్మతించి యుండలేదు. శివప్రతిష్ఠయందు నమక చమకములు పురుష సూక్తము, విశ్వకర్మ సూక్తము, మొదలగు వేద మంత్రములతో అభిషేకములు చేయుచున్న మేము ప్రత్యేకముగా గుడికి వెళ్ళి. అర్చకుడు జీవించు పనికి అడ్డుకల్పించుట మాకు న్యాయముకాదు. మహాక్షేత్రములను కాశీవిశ్వేశ్వర లింగమును, శ్రీశైల మహాక్షేత్రమున మల్లికార్జున లింగమును, అలంపూరిలో నవబ్రహ్మ లింగములను, కోటప్పకొండయందలి బాలకోటేశ్వర లింగమును, వృద్ధకోటేశ్వర లింగమును, సక్రమముగా అభిషేకముచేసి పూజించుచునే యున్నాము. తెలియక ఒక్కొక్కచోట అర్చకులు తగాదాలుపెట్టి తత్ఫలితము లనుభవించి యున్నారు. చెన్నపట్టణము హైకోర్టు క్రిమినల్ రూలింగ్. క్రీ. శ, 1885 సం. నెం. 421-422 ష్టు-

విశ్వబ్రాహ్మణులు పవిత్రమైన హిందూదేవాలయముల గర్భములోనికైనను వెళ్లుటకు, పూజించుటకు, రుద్రాభిషేకము చేయుటకు హక్కు కలదు. కృష్ణాజిల్లా. అసిస్టెంటు మేజస్ట్రీటుకోర్టు ది. 29-మే-1894 సం. నెం 8 వ శివకోటి వీరభద్రుడు అను విశ్వబ్రాహ్మణుడు మహాశివరాత్రి దినమున కాశీవిశ్వేశ్వర దేవాలయమున ప్రవేశించి లింగాభిషేకము

చేయుటచే లింగము అపవిత్రము కాబడినదని, ఫిర్యాదు తేబడుటచే అది క్రిమినల్ ప్రొసీజరు కోర్టు - నె 258 సెక్షను ప్రకారము కొట్టివేయబడినది కృష్ణాజిల్లా మేజిస్ట్రేటుచే యివ్వబడిన తీర్పు -

విశ్వబ్రాహ్మణులను అభిషేకము చేయనియ్య వచ్చును. ఈ నమూనాయే కృష్ణాజిల్లా జిల్లా మేజస్ట్రేటుచే 1894 సం॥ జులై 6 వ తారీఖున ధృఢపఱుపబడినది,

17) ప్రశ్న॥ ఈ పౌరుషేయ బ్రాహ్మణులకు లోగడ శుభకార్యములయందు బాజారీ వైభవములను జరుపుకోనీయ్యకుండా కొన్నిగ్రామముల యందు ఆటంకపరచుటకు కారణమేమి ?

ఉత్తరము :- క్రీ. శ. 1145 ప్రాంతమున గజపతి రాజుల వంశ ములో గణపతిరాయలు పరిపాలించుచుండగా విశ్వబ్రాహ్మణులకు బహు కాలమునుండి కరిణీకములును షరాబువృత్తియును, ఉండెడిది. అట్టి షరాబువృత్తి యనగా ప్రభుత్వమునకు అవసరమైన నాణెములను ముద్ర వేయుట, మొదలగు కార్యములు శిల్పులవల్లనే జరుగుచుండెడిది. 'టంకశాల, అనుపేరుతో నాణెములను తయారుచేయు శాలయొకటి యుండె డిది. ఆశాలలో పనిచేయు వారలను టంకశాలవారని పిలుచుచుండెడివారు. అంతేకాక షరాబు యీనాములు, వడ్రంగపు యీనాములు, కమ్మరపు యీనాములు, మొదలగునవి విశ్వబ్రాహ్మణుల కుండెడివి. వీరు పంచ వృత్తులతో గొప్పగౌరవముతోను, వైభవముతోను, ఉండుటచూచి సహింప లేక గోపరాజు రామన్న యనుమంత్రి యిట్టి స్థానమును మనమెట్లు సంపా దెంచగలము ? అను దురుద్దేశముతో నుండగా ఒక సమయమున అనగా శాలివాహనశకము 1067. రక్తాక్షి సం. భాద్రపద బహుళ అమావాస్య యందు సూర్యగ్రహణము వచ్చినది. అట్టి సమయములో సముద్ర స్నానము చేయునప్పుడు వైదికులు మంత్రములు చదివి కొంత ధనము దానరూపముగా సంపాదించుకొనుటకు ఆటంకము కల్పించి మీకందరికి రాజుగారిచేత భూదానములు యిప్పించెదను, కనుక మీరెవ్వరు సముద్ర

సమీపమునకు రావలదని వారలను మోసగించి రాజుగారివెంట తానుక్కడే యుండి స్నానము చేయునప్పుడు మంత్రము చెప్పేవారెవరు లేరుగదా? అని రాజుగారడిగిన తోడనే మంత్రమును నేను చెప్పుచున్నానుగదా స్నానము చేయండి. అనుచు రాజుగారిచేత స్నానము చేయించెను. దానము పట్టవయ్యా! అని రాజుగారడుగగా, మీ యనుగ్రహము వలన మంత్రిత్వము చేయుచుంటినిగదా? నాకేమి దానము కావలయును. అంతగా మీరు యీయదలచుకున్నచో యేడుగడియలు మీ ప్రభుత్వముద్ర యొసగిరేని సంతోషించెదను అనగా అటులనే యిచ్చెదను దానము పట్టుమని జలధార వదలెను. ఆ ముద్రిక నేను కావలసి నప్పుడడుగుదును ఇప్పుడేమి తొందర లేదు లెండి! అని చుట్టుపట్ల గ్రామాదులనేగాక వారి ప్రభుత్వములోనున్న గ్రామము లన్నియును తిరిగి చూచుచు గ్రామమునకొక కరణీకపు దరఖాస్తు చొప్పున తనకు తోచిన ధరఖాస్తులు పూర్తిచేసి అవియన్నియు నియోగులకే కాని యితర శాఖవారి నెవ్వరికిని లేకుండా మొత్తము కట్టకట్టి దగ్గర పెట్టుకొని విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని యొద్దకు వచ్చినట్లొక సమయమున రాజసభయందా రాజుగారిని ముద్రయుంగరమడిగెను. రాజుగారు మాట తప్పకుండ యేడుగడియలు ముద్ర నుపయోగించుకొనుమని యిచ్చి యెదురుగా గూర్చుండెను. రానున్న మంత్రిగారు తన తెలివిని యెంత తప్పుడుగా నుపయోగించుకొనవలెనో అంత తప్పుడుగా ఏడు గడియలలో ఆఱువేల కరిణీకపు దరఖాస్తులపై ముద్రలు కొట్టెను. రాజుగారిచ్చిన కాలము సరిపోగానే చేయిపట్టుకొని తన యుంగరమును తీసికొనెను. ఒక్కపెట్టున విశ్వబ్రాహ్మణ కుటుంబములను ఆఱువేల సంఖ్యను దుఃఖపూరితముగా చేసెను. తన జాతికి సంతోషము వైభవము. అధికార బలమును కలిగించెను. అంతటితో ఊరకొనక విశ్వబ్రాహ్మణులు రాజుగారి యొద్దకు మరల మా స్థానములు కొన్నియైన మా కిప్పువని కోరుదురేమో? అని యా కాలమున వ్యవసాయము వృత్తిగా చేసుకొనక భూదేవతలుగా ప్రకాశించుచున్న యా నూతన కరణముల ఆశ్రయించి పని పాటలు వారి

యనుమతిలో చేయుచునుండు కొన్ని బీద కుటుంబముల వారిని ఆ కరణములు వారి గుప్పిటలో నుంచుకొని యెవ్వరిని యే విధముగా కష్ట పెట్టవలెయునో ఆ విధముగా జరుపుటకు తగిన సిబ్బందినిగా కుదుర్చుకొని విశ్వబ్రాహ్మణులను శుభకార్యాదులు జరుపు సమయముల యందు ఆటంకములు కలిగించుచుండిరి. కాని కమ్మవారు, రెడ్లు, క్షత్రియులు, యాదవులు, జంగమువారు, లింగబలిజవారు, మహమ్మదీయులు, సాతానులు చేతివృత్తులతో జీవించువారు, ఉన్నత జాతులవారు ఇట్టి తుంటరిపనులకు వచ్చియుండలేదు. అట్టి యల్లరినే మంత్రియానాడు సమ్మెయని లోకవాడుక యైనది మంత్రి యనగా మన గోపరాజు రామన్నగారే ఆ మహనీయు డెంత చక్కగా శ్లోకములు కుదిర్చినాడో చూడుడు

శ్లో॥ శ్రీమాన్ గణపతిర్భూపో గజపత్యన్వయోద్భవః ।
అస్తి భూమండలంతస్య బహు వస్సంతి మంత్రిణః ॥

తేషాం శ్రేష్ఠతరోఽమాత్యః యాజ్ఞవల్క్యోత్తమో ద్విజః ।
గోపరాజాన్వయోఽ మాత్యోరామాఖ్యోగణకాగ్రణీః ॥

గోత్రశాస్త్రాంబరేందూనాం సంఖ్యాబ్దే శాలివాహనే ।
రుధిరోద్గారి వర్షేచ భాద్రపేకృష్ణపక్షే చదర్శేచోపరాగకే ।
గణకానాంచ హితార్థాయ రాజద్దాన నమగ్రహీత్ ॥

ఇట్లు శ్లోకములు వ్రాయించి శాసనములు రాగి రేకుమీద కొట్టించి నాడు. ఈ మంత్రివర్యుడు చేసిన మహాకార్యమును విశ్వబ్రాహ్మణులు తెలిసికొని రాజుగారి దగ్గరకువెళ్ళి ప్రభూ ! మా ఉద్యోగములు దానములు చేసితిరి గదా? మాకు జీవనార్థము యీనాములనైనా యిప్పించి మమ్ముల కాపాడుటకై ప్రార్థించు చున్నామనగా నేను తెలియక పొరపాటుపడి యున్నాను. అతనిని మీయొద్దకే పంపెదను మీరు జాగ్రతగా నుండుడని సలహా యిచ్చెను. రాజుగారు ముద్రయుంగరమును విరుగగొట్టి దీనిని బాగుచేయించుకొని రమ్మని రామప్రధాని చేతికియ్యగానే ఆయనకు దారి

తోచక యింటికిబోయి దీర్ఘాలోచనలోబడి అన్నపానీయములను సైతము లెక్కచేయక విచారసాగరమున మునిగి యుండుట తన పుత్రిక తెలుసుకొని నాయనా; యేమియుపద్రవము వచ్చినది? ఇంతగా విచారపడుచున్నావనెను. అతడు "అమ్మా! నాకు సాధ్యము కాని పనిని రాజుగారు నాకు ఒప్పగించి నారు. విశ్వబ్రాహ్మణుల కరిణీకము లన్నియు ఒక్కపెట్టున తీసివేసి నియోగీ బ్రాహ్మణులకే యిప్పించినందున నేను వారి చెంతకు బోవుటకు నాకు ముఖము చెల్లదాయె! ఇంకొక చోటికి వెళ్లి చేయించే పని కాధాయె! ఏమి తోచకున్నది" అనెను. అప్పుడు కుమార్తె నాన్నా నీవు చింత పెట్టుకొని కృశించవద్దు. నీ ప్రాణ సంరక్షణకు నేను ఆలోచించి యీ పని పూర్తిచేయించి తెచ్చెదను" అని చెప్పి విరిగిపోయిన ముద్రాంగుళీయమును తీసికొని యొకానొక విశ్వబ్రాహ్మణ యువకునితో స్నేహము కుదుర్చు కొని నీవు నాకీ సహాయము చేయక తప్పదు. ఇక్కడగాని యింకొక ప్రదేశమునకు బోయిగాని దీనిని బాగుచేయించుకొని తెచ్చేపని మనయిద్దరికి తప్పనిపని, నేను నిన్ను వదలిపెట్టను ఎంత కష్టమైనాసరే, ఎంత ఖర్చయినా సరే మనమిద్దరము యేకదీక్షగా దీనిని చేయవలసినదే. నేను నీవెంటనుండు దాననేకాని యింతకు మార్పులేదు. అని యొక్కటే పట్టుపట్టి యా యువకునిచేత యేవేళటప్పుడో యేస్థానముననో యేవిధముగానో యెవ్వరికిని తెలియకుండా ఉంగరమును బాగుచేయించి తండ్రికిచ్చి అతనిని సంతోష పెట్టెను. అతడా ముద్రాంగుళీయమును దీసికొనివెళ్లి రాజుగారికిచ్చెను, రాజుగారా యుంగరమునుచూచి తనమనస్సులో యీద్రోహి విశ్వబ్రాహ్మణ సంఘమును అష్టకష్టములపాలు చేయుచున్నాడే. ఆ సంఘమునకు మనము ఘాదానాదులిచ్చినను వారికి పూర్వస్థితి రాజాలదు. మనవంశములో నేనే వారి క్షేమమునకు భంగము కలిగించి దానిని సరిదిద్దలేక పోతినిగదా ? అను ఆలోచనతోనుండెను. విశ్వబ్రాహ్మణులు రాజసభకు వెళ్లినంతనే రాజావారు వారిని మీరు కట్టుబాటులేని సంఘముగానున్నారు. నేను నాశక్తికొలది నాహార పాటును దిద్దుకొనుటకు యత్నించెదనని వారిని పంపివేసిరి, ఈమంత్రిగారు

కరణములను పిలిచి మీరు మీ గ్రామముల యందుగల విశ్వబ్రాహ్మణులు బొజారులో జరుపుకొను మహోత్సవాదుల నడ్డగించు ప్రయత్నములు జరుపుచుండుడు, అట్లు జరుపకున్నచో వారు రాజుగారియొద్దకు మరల మరల వచ్చి పీడించినచో మీ కరణీకములు పోయేగతి పట్టునేమో ? అని గట్టిగా చెప్పెను. కొంతకాలము గడచినంతలో రామన్న మంత్రిగారి కుమార్తెకు సంతానము వృద్ధియగుచున్నది. అప్పుడు మరల మంత్రిగారు కరణములను రప్పించి, మీకు నేను యెంతో ప్రయత్నముచేసి కరణీకముల నిప్పించినది మీకు తెలియునుగదా ? తరువాత రాజావారు నాచేతికి ముద్ర యుంగరము విరిగిపోయినది దీనిని బాగుచేయించుకొని రమ్మని నాకొసగి నంతలో నేనేమి చేయజాలకపోగా మన అమ్మాయి ఆ యుంగరము బాగు చేయించి నాకిచ్చెను నేను రాజసభలోనుండి నేటికిని మీ క్షేమములనే కోరు చున్నాను గదా ? ఇప్పుడీమెకు పురుష సంతానము వృద్ధియగుచున్నది. కనుక యీ కుటుంబమునకు విప్రవినోదులను పేరుపెట్టి వీరికి మీరందఱును తగినరీతిగా కట్నములని కానుకలని యేదోయొక రూపముతో ఈమె వంశ పారంపర్యమును మీరును శాశ్వతముగా పోషించుచుండుడు సుమా ! ఇందుకు తప్పితిమేని మనము మనకు సహాయముచేసి కరిణీకములను నిల్పిన విశ్వాసమును నిలుపుకొనని విశ్వాస ద్రోహులమౌదుముసుమా ! అనిచెప్పి కరణములను తనకట్టడిలో నుండునట్లుచేసి పంపెను. ఆసంతతియే విప్రవినోదులు. వీరు వైదికుల యిండ్లకుగాని, వేఱొక శాఖవారి యొద్దకుగాని పోరు.

18) ప్ర॥ ఈ పౌరుషేయ బ్రాహ్మణులందఱు ఒకటేకదా ? మీ వారిలో కొంతమంది మీయిండ్లలో భోజనము చేయకపోవడము నకును. (కంసాల యింటి పెండ్లియిల్లంతా పాయిలు) అను సామెత కును. సహేతుకమగు ఉత్తరమీయ వలసినది ?

ఉత్తరము :- ఈ పౌరుషేయ బ్రాహ్మణులలో శైవాదిషణ్మతము వేర్పడియున్నది. ఈకారణము వలన ఒకరియింటిలో ఒకరు

భుజించుటకు మతశాస్త్రము అంగీకరించి యుండలేదు. ఎవరి మతములో వారు భుజించుచునే యున్నారు. సామెత విషయమై మావారు బాలశిష్టులను ఆహితాగ్నులను, వైశ్యదేవపరులును, దేవతార్చన శివపూజా ధురంధరులును, అగుటవలన నాంది అశౌచగృహములలో భుజించుటకు యిష్టపడక వేరే స్వయంపాకములు చేసికొని భుజించుచున్నారు. బంధుబృందములు మిక్కుటముగావచ్చి స్వయంపాకములు చేసికొని పృథక్గా భోజనము చేయడమును చూచి లోకులు సామెతను కలుగజేసినారు. నాంది మొదలయినవి లేని కాలములలో వేరు పాకములు చేసికొనక యేకముగా భోజనము చేయడము మామూలై యున్నది.

19) ప్ర॥ ఈ పౌరుషేయ బ్రాహ్మణులకు శైవాది షణ్మతములు యెవరి వల్లనుండి రాబడినవి ?

ఉత్తరము :- విశ్వకర్మ పరమేశ్వరుని వలన నుత్పన్నమైన పంచబ్రహ్మలలో మొదటివాడయిన మనుబ్రహ్మయే శివుడని చెప్పబడి యాతనికు సద్యోజాతాది పంచముఖములున్నట్లు శైవమతమే ముందుగా నేర్పడినది. గాయత్రీ మహామంత్రమునను ఓం తత్సవితుర్వరేణ్యం, భర్గోదేవస్యధీమహి ధియోయోనః ప్రచోదయాత్" అని యెల్లరును నిశ్చయించి యుండుటచే శివరూపమునకు బదులుగా లింగరూపములను కల్పించి దేవదానవ మానవాదులు నానావిధ లింగములను పూజించి వారివారి పదవులను స్థిరపరచుకొని శాశ్వత వైభవము ననుభవించుచున్నట్లు శివపురాణమునను, అపరాణివ వ్యవచ్ఛయును గ్రంథరాజమునను చెప్పబడి యుండుటచేత నిన్న మొన్న యెవ్వరివలననో వచ్చినది కాదని మనమూహింపవలెను. మధ్యకాలములో ఒక్కొక్క మతము మొలకయెత్తి క్రమముగా షణ్మతములగుటయేకాక యీనాటికి నానా మతములున్నవని చెప్పుకొనవలసి వచ్చినది. వైదిక మతమునందును "ఓం దేవీం వాచమజనయంత దేవాస్తాం విశ్వరూపాః పశవోవదంతి, సానోమంద్రేషు మూర్జందుహానా. ధేనుర్వాగస్మాను పసుష్టుతైతు ॥ యశ్శివో నామరూపాభ్యాం, యాదేవీ

సర్వమంగళా । తయోః సంస్మరణాత్పుంసాం, సర్వతో జయమంగళమ్ ॥

అని ప్రారంభింపబడినదిగదా ? బిల్హణకవి "మార్గః శాంకర ఏవ" అని చెప్పియుండెను. కాళిదాస మహాకవియును

శ్లో॥ వాగర్థావి వసంపృక్తౌ, వాగర్థ ప్రతిపత్తయే,
జగతః పితరౌవందే, పార్వతీ పరమేశ్వరౌ ॥

అనియే చెప్పియున్నాడు.

ఈ మధ్యకాలములో జైనబౌద్ధమతములు వృద్ధియై నాస్తికత్వమును వృద్ధిచేయ బూనినను శంకరాచార్యుడు కుమారిల భట్టుగారి శిష్యుడై అద్వైతవాదమున గెలుపొందుచు ఉత్తరదేశమునకుపోగా అచట విశ్వకర్మ బ్రాహ్మణవంశమున జనించిన విశ్వరూపుడను శిల్పియు. మహాపండితుడును కలడని తెలిసికొని యచటికేగెను. అతడు కొన్ని మండన గ్రంథములు రచించుటచే మండనాచార్యుడను ప్రసిద్ధి కలిగెను. ఆ మండనాచార్యునితో సంభాషించి యెంతయో శ్రమపడి కడకు మండనాచార్యుని మెప్పించి యా మహనీయుని తన సరస్వతీ పీఠమున కధీశ్వరుని చేసి తన జీవితమల్ప కాలమని తెలిసికొనిన మహనీయుడగుటచే తాను హిమాలయప్రాంతమున కేగి తపోనిష్ఠతో నుండెనని, శంకర విజయాది గ్రంథములు చెప్పుచున్నవి. ఆ శంకర పీఠమునకు మొదటివానినిగా చేయునప్పుడు మండనాచార్యునకు సురేశ్వరాచార్యుడను నామకరణమొనర్చియుండెను. ఆయన ఒకానొకచోట సంభాషించు కాలమున

శ్లో॥ ఆచార్యో శంకరోనామ విశ్వరూపోన సంశయః ।
విప్రకుల గురుర్దీక్ష విశ్వకర్మేతి బ్రాహ్మణః ॥

అని వచించినట్లు లోకప్రసిద్ధి కలదు ! తిలక మహాశయుడు భారతీయ సామ్రాజ్యము అను గ్రంథమును వ్రాయుచు అందు శంకర పీఠమునకు మొదటి గురువు మండనుడనియు, సురేశ్వరుడనియు రెండు పేరులు కనుపించుచున్నవి. అందు ముందెవ్వరు తరువాతి వారెవ్వరు ?

అను సందేహము కల్గుచున్నది అని వ్రాసియుండెను. కాని యీ మహా నీయునకు "విశ్వరూప, మండనాచార్య, సురేశ్వరాచార్య, అను మూడు నామధేయము లొక్కనివే ! అని తెలియకుండెను. మండనాచార్యుడు సురేశ్వరాచార్య నామధేయమునే లోకమున విస్తరింపజేసి కంచిలో శ్రీ కామాక్షిదేవి ఆలయములో నొకవైపున సమాధి యయ్యెను. ఎందువల్ల ననగా సన్యాసి యుండవలసిన యీ దేవి యాలయములో తాను పూజా విధానాదులు జరుపకూడదు. ఎందువల్లననగా గృహస్థ ధర్మములను వీడ లేదు కనుక శాస్త్రాధికారమున కిష్టపడక యటుల కొంతకాలముచేసి విశ్వకర్మీయ బ్రాహ్మణులకే పీఠము స్వాధీన మొనర్చెను. అటుల ఒక్కొక్కరు పీఠాధిపత్యము చేసిరి కాని యే దేశమునుండి యెవ్వరిని తీసి కొనివచ్చి యీ యధికారమిచ్చుచు వచ్చిరో మనకు తెలియదుగాని కొన్ని నామధేయములు మాత్రము విశ్వబ్రాహ్మణులకుతప్ప యితరుల యందుండ వివి యీ దేవియాలయ పరిపాలకుల జాబితాలో తెలిసికొనవచ్చును !

వేమనయోగిః శక్తితోడ వచ్చె
శంకరాచార్యుండు విశ్వకర్మతోడ వెలయపోరె ।
కడకు విశ్వకర్మ ఘనుడని మెచ్చెరా ।
విశ్వదాభిరామ వినురవేమ ॥

అని చెప్పియున్నాడు.

20) ప్ర॥ మీ పౌరుషేయ బ్రాహ్మణులలో శైవమతస్థులు, స్మార్తులు ఉన్నారు గదా? మాలో నుండు శైవమతస్థులకు స్మార్తులకు మీకు దృష్టిగోచర భోజనము భోజన ప్రతిభోజనాదులు లేకుం డుటకు కారణమేమి ?

ఉత్తరము॥ మీలోనుండు స్మార్తులు శైవమతస్థులైన ఆరాధ్యులు వసిష్ఠాది ఋషుల యొక్క సంతతివారైన ఆర్షేయ బ్రాహ్మణులనియును మాలోనుండు వారలు. విశ్వబ్రహ్మవల్ల నుండి పుట్టిన పౌరుషేయ బ్రాహ్మణునియును

రెండువిధములుగా ఏర్పడియున్నది. ఈ ఆర్షేయ పౌరుషేయ బ్రాహ్మణులు ఏకముగా భోజనము చేయుటకు మతశాస్త్రములలో చెప్పియుండలేదు. పెద్ద వారి కాలమునుండి కూడ భోజనము యేకముగా చేయడము లేదు.

21 ప్ర॥ మీలో శైవమతస్థులు కొంతమందియున్నారుగదా! వారు వైశ్వదేవాది కర్మలుచేయవచ్చునా?

ఉత్తరము ॥ శాతాతపస్మృతౌ

శ్లో॥ శైవాదిషణ్మ తానాంతు। మతాచారం పృథక్ పృథక్
కులాచారంభవేదేకో వేదమార్గైక శాసనాత్ ॥

తా॥ షణ్మతములకు మతాచారములు భిన్నములైనవిగాని, కులాచార మొక్కటియై యున్నది, అయినను వైశ్యదేవాది కార్యములు మధ్య, వైష్ణవుల వలెనే మతగ్రంథములలో కించిద్భేదము చెప్పబడియున్నది. శైవ పంచకాంతర్భూతశంకర సంహితాయాం॥

శ్లో॥ తతో మధ్యాహ్న సమయే। కుర్వీతైనం శివార్చనం।
శివాగ్నికార్యం కుర్వీత। బలికర్మ సమన్వితమ్ ॥
వైశ్యదేవం మహాభాగం। నాందీ కాంతర్గత పృథక్ ॥
తతోగృహ ద్వారముపేత్యమర్త్యః కాంక్షేత గోదోహన మాత్ర మాత్రా।
దేశాంత రాదాగత మన్నకామం। లింగార్చనంచాతిథి మీశ్వరస్య॥

తా॥ గృహస్థు లింగాంగిని పూజయనగా శ్లో॥ అర్చనా దర్పణాత్రంతు ॥ అనిచెప్పియున్నది. లింగశరీరి మధ్యాహ్న కాలమందు లింగార్పణ చేసికొని తర్వాత భార్యాగ్నియందు వైశ్వదేవము జరిగించవలసినదని చెప్పియున్నది. వైశ్వదేవం నిమిత్తం లింగార్పణకు పూర్వమందే బాండస్థ ప్రసాదమును పాత్రాంతరమందు ద్విభాగించి శివపూజాంగ భూతమైన అర్పణకుగాను ముందుగా తన విస్తరి యందుంచుకొని నివేదన జరిగించి తద్భిన్నపాత్రస్థ ప్రసాదమును వైశ్వదేవాది కార్యములకు వినియోగపఱచ వలయును. ఇటుల జరిగించినయడల లింగశేష, వైశ్వదేవశేషములు సంభ

వించుచున్నవి. తద్వారా ఆత్మసంస్కారాన్న శుద్ధులు. పంచసూనాని వృత్తి కలుగుచున్నదని చెప్పియున్నది. శంకర సంహితాయాం,

శ్లో॥ స్వజాతి విహితం ధర్మం కుర్వంతి పూజయంతియే ।
భక్త్యా శ్రీకంఠమనిశం । తేవై మాహేశ్వరాః స్మృతాః ॥

తా॥ స్వజాతికర్మచేసి తదుపరి శివపూజ చేయవలయునని చెప్పియున్నది. ఇందువలన స్వజాతి కర్మ వదలగూడదనియు చెప్పియున్నది. ఇంక ననేక శ్రుతిస్మృతులు కలిగియున్నవి కాబట్టి శైవులు వైశ్వ దేవాది కర్మలు నిరాటంకముగా చేయవచ్చునని సిద్ధాంతమైయున్నది.

22) ప్ర॥ బ్రాహ్మణానామార్త్విజ్యం॥ అను శ్రౌత సూత్రప్రకారము మీ అగ్నిష్టోమాది కర్మలుచేయునప్పుడు బ్రహ్మౌదన పురోడాశం మొదలయినవియును, శుభాశుభకర్మలయందు పితృకర్మల యందు మెవరివల్ల జరిగించుకొనుచున్నారు ?

ఉ॥ మాలోనే ఆధ్వర్యులను యేర్పరచుకొని సకలకర్మల ప్రవర్తనలు జరిగించుకొనుచున్నాము.

23) ప్ర॥ అశ్లేష బ్రాహ్మణ గృహములయందు అంత్యజాతులుతప్ప యితర వర్ణస్థులు భోజనాదు లొనరించు చున్నారుగదా ? అటు లనే మీగృహములలో జరిగించక పోవుటకు కారణమేమి ?

ఉ॥ మా గృహములలో కొందఱుశూద్రాదులు భుజించుచునే యున్నారు. వారెవరనగా 1. చాకలులు, 2. లంబాడీలు. 3. ఎఱుకలవాండ్లు 4. పరికలవాండ్లు, 5. పెద్దేటి గొల్లలు, 6. ఆరెకులస్థులు. 7. చెంచువాండ్లు 8. బొమ్మరివాండ్లు, 9. తురకలు, 10. మాచెకులు, 11. బండవాండ్లు, 12. రుంజలు, 13. ఆదిపసనలు, 14. కోమటి పసనలు మొదలగువారు భోజనము చేయుచున్నారు.

24) ప్ర॥ అంతకంటె పై ఆధిక్యులైన కమ్మ రెడ్డి కులస్థులు, భుజించక పోవడమునకు కారణము ?

ఉ॥ మీ ఆర్షేయ బ్రాహ్మణ గృహములలో 1. బొందిలీలు 2. సాతానులు. 3. దేవాంగులు, 4. జంగాలు, 5. గాజులవర్ణస్థులు, 5. లింగ బలిజలు, 7. రసపుత్రులు, 8. పనసలు. 9. రుంజలు మొదలగువారేకారణ మువలన భుజించుటలేదో అదియే మాగృహములలోను కమ్మ, రెడ్డి కుల ములు భుజించకుండుటకు కారణము. అంతకంటె వేఱు హేతువేమి కన బడుటలేదు. అధియునుగాక క్షత్రియులకు తరువాతదగు వైశ్యవర్ణము క్షత్రియులయిండ్లలో భోజనముచేయుటలేదు. మూఁడో వర్ణస్థులైన వైశ్యుల యిండ్లలో దేవాంగులు, జంగాలు, లింగబలిజలు, గాజుల బలిజలు భుజిం చుటలేదు. శివార్చకులు. తంబళ్ళు వీరిగృహములలో మూఁడో వర్ణస్థులైన వైశ్యులు భుజించుటలేదు. ఈ విషయములను బాగుగా ఆలోచించినయెడల బ్రాహ్మణ్యమున కులోపముండదనేసంగతి సభాసదు లెఱుగగలరు.

25) ప్ర॥ మీకు షట్కర్మాధికారములు ఎవరివలన వచ్చినవి ?

ఉ॥ విశ్వకర్మ పరమేశ్వరునివలన ముందు ఆయిదు కొమ్మలుగాను తరువాత ఒక్కొక్క కొమ్మకు అయిదు అయిదు చొప్పున శాఖలువృద్ధియై అదియే విశ్వకర్మవంశవృక్షంబైనది. నిన్న మొన్న పుట్టినవారికి కొందఱు పెద్దలు ఆలోచించి పెట్టినకర్మలుకావు. విశ్వకర్మయగు వటవృక్షబీజమే మహావృక్షమై అందఱికిని షట్కర్మలేక శమదమాది దశగుణములును వృద్ధియై లోకము విస్తరించుచున్న సమయములో సప్తఋషులు జనించిరి. విశ్వకర్మ ద్వితీయపుత్రుడగు మయబ్రహ్మ తామ్రపర్ణి నదీతీరమున యజ్ఞ మొనరించుచుండ వసిష్ఠాది సప్తఋషులు మయబ్రహ్మ సమీపమునకుచేరి మాకు యజనాది షట్కర్మల కధికారమీయుడని ప్రార్థించిరి. ఆయన వీరు కోరిన యధికారములద్వారా లోకమునకు కీడు కల్గుచున్నదని యాలోచించి వెంటనే శాపమొసంగెను. తరువాత వారు చేయునదేమియులేక పరాత్పరు డగు విశ్వకర్మపాదాక్రాంతులై యా దేవదేవుని యనుగ్రహమువలన శాప విముక్తులై యద్దేవదేవు నెల్లప్పుడు ప్రార్థించుచు ధ్యానించుచు పవిత్రు లైనట్లు వైవస్వతపురాణము కృష్ణ భీమ సంవాదరూపమున తెలియబడు చున్నది.

వైవస్వత పురాణము కృష్ణ భీమ సంవాదము

శ్లో॥ తామ్రపర్ణీ నదీతీరే పుణ్యక్షేత్రే శుభావహే ।
యజ్ఞస్తు క్రియతే తత్ర । మయేన సుమహాత్మనా ॥

తా॥ శుభమునుయిచ్చే పుణ్యక్షేత్రమయిన తామ్రపర్ణీ నదీతీరమందు మహాత్ములైనటువంటి మయునిచే యజ్ఞము చేయబడుచున్నది.

శ్లో॥ యజ్ఞే ప్రవర్తమానేతు మునయః సప్తభారత ।
యజ్ఞస్య విఘ్నకర్తారో తత్రయాంతి స్వదుర్మనాః ॥

తా॥ ఓయి భీముడా ! యజ్ఞము చేయబడుచుండగా యేడుగురు మునీశ్వరులు యజ్ఞమునకు విఘ్నము చేయదలచినవారై ఆ యజ్ఞముచేయు ప్రదేశమునకు దుర్బుద్ధి కలవారై వెళ్లిరి.

శ్లో॥ యాతాసమీప ఋషయో యజమానస్య పర్వణి ।
తతస్తే కుటిలాత్మానో యాచయామాసురగ్రతః ॥

తా॥ యజమానుడైన మయుని యొక్క సమీపమును గూర్చి పర్వమందు ఋషీశ్వరులు వెళ్లిరి. తరువాత కుటిల స్వభావము గలవారలై ముందుగా మయుని యాచించిరి. ఋషయ ఊచుః

శ్లో॥ మయవేదవిదాం శ్రేష్ఠ! కార్యార్థం వయమాగతాః ।
తస్య! త్వం సంప్రదానస్య నిశ్చయం కురు సువ్రత ॥

తా॥ వేదవేత్తలలో శ్రేష్ఠుడవైన యోమయుడా ! మేము కార్యార్థులమై వచ్చినారము. యోగ్యమైన వ్రతము కలిగిన యోమయుడా! ఆ యిష్టమునకు నిశ్చయించవలసినది. మయ ఉవాచ

శ్లో॥ ఋషయః స్వాగతంవోఽస్తు కిమాగమన కారణం ।
వావధిక్ప్రదేయావా నిశ్శంకం కథ్యతామిహ ॥

తా॥ ఋషీశ్వరులారా; మీకు గమనమగుగాక ! మీరు వచ్చిన కారణమేమి? వావడిక్షయియ్యవలెనా? శంకలేకుండ చెప్పబడుగాక!

పుగా తీర్మానించిన వివరము వాదులు వేదములు మొదలగు గ్రంథములు ప్రమాణములను బట్టి శ్రేష్ఠమైన బ్రాహ్మణులై యున్నారు. కనుక వారు స్వకుల పౌరోహిత్యమును గూర్చి అభ్యంతరం ఏమి యుండదు. కనుక దీని నెవ్వరును ఆటంకపఱుపరాదు.

చెన్నపట్టణము హైకోర్టు తీర్పు (అనగా క్రిమినల్ రూలింగ్)

క్రీ శ. 1885 వ సంవత్సరం 78 వ నెంబరు క్యాలెండరు 152 వ పేజి శ్రీ మహారాణిగారి న్యాయస్థానము నందు 1885 సంవత్సరపు నె 421-422 ల్ల విశ్వబ్రాహ్మణులు ఏ పవిత్రమైన హిందూ దేవాలయ గర్భములోనికైనను వెళ్లుటకు పూజించుటకు రుద్రాభిషేకాదులు చేయుటకు హక్కు కలదు.

కృష్ణాజిల్లా అసిస్టెంటు మెజస్ట్రేటు కోర్టు తీర్పు

మచిలీపట్టణము ది. 29 మె 1894 శివకోటి వీరభద్రుడు అను విశ్వబ్రాహ్మణుడు మహాశివరాత్రి దినమున కాశీవిశ్వేశ్వర దేవాలయమున ప్రవేశించి లింగాభిషేకము చేయుటచే లింగము అపవిత్రమైనదని ఫిర్యాదు తేబడుటచే అది క్రిమినల్ ప్రొసీజరుకోడ్ 258 వ సెక్షన్ ప్రకారము కొట్టి వేయబడినది

అపీలు చేయుటచే జిల్లా కోర్టు మెజస్ట్రేటు "విశ్వబ్రాహ్మణులు అభిషేకము చేయవచ్చునని ది. 6 జూలై 1894 న 8 వ/ది. 6-7-1894 నెంబరుగా విశ్వబ్రాహ్మణులను అభిషేకము చేయనీయవచ్చును. కనుక పూర్వపు తీర్మానమునే ధ్రువపరచడమైనది. అని తిర్మానించబడినది.

గుంటూరు అడిషనల్ డిస్ట్రిక్టు మునసబు కోర్టులో నెం. 26/1911 సం. వాజా

వాది జానపాటి పట్టాభిరామశాస్త్రి జానుపాడు.

ప్రతివాదులు నందిగామ కాశీపతి మొదలగు అయిదుగురు

విశ్వబ్రాహ్మణులు ప్రతిష్ఠ చేయకూడదని దావా తేబడినది. ప్రతివాదులగు విశ్వబ్రాహ్మణులు దాఖలు చేసిన గార్గేయాగమము మొదలగు గ్రంథములద్వారా విశ్వబ్రాహ్మణులు సమస్త దేవతా విగ్రహములను ప్రతిష్ఠించవచ్చునని ఋజువు చేయుటచే వాది తెచ్చిన దావాను ఖర్చులతో త్రోసివేయడమైనది.

నె డి 30 మార్చి 1912 రు బి. ఏ. బి. ఎల్.

సి. రంగనాయకులు

## శిల్పులు-శిల్పశాస్త్రములు

తై. బ్రా. అ 2 ప్ర. 8 అ 25 ద2 శ్రు॥

యోభిః శిల్పైః ప్రపద్ధానామదృగంహత్। యేభిర్ద్యా మభ్యపిగం శత్ప్రజాపతిః। యేభిర్వాచం విశ్వరూపాగం సమవ్యయత్। తేనే మమగ్న ఇహ వర్చసా సమన్ధి ॥

తా॥ ఈ శ్రుతి రాజ్యాభిషేకమునందు శిల్పాచార్యుడు చెప్పునది. ప్రజాపతి అనగా(విశ్వకర్మ)-విశ్వకర్మాభవత్ప్రజాపతిః. విశ్వకర్మా మహాభాగ-స్తస్యాంజజ్ఞే ప్రజాపతిః॥ ఇత్యాదులవలన మహానుభావుడగు విశ్వకర్మ తనయూహా కౌశలమువలన సవిస్తరమైన యీభూమిని బలమైనదానినిగా జేసెనో, ఎట్టిక్రియా కౌశలముచేత ఆకాశమును అంతట చంద్రుడు. నక్షత్రములు మున్నగువానిచేచక్కని-రూపము గలదానినిగ జేసెనో, మఱియు నెట్టి కళానైపుణ్యముచేత సమస్త పదార్థములు పలుకుజడి కలదగుటచే అనేక రూపములైన వాక్కును సంపాదించెనో. అట్టి కళాకౌశలజాలముచే ఆనేర్పరి తనముతో కూడినబలముచేత, ఓ అగ్నీ! ఈరాజును ఈలోకమున సమృద్ధివంతునిగా జేయుము. అట్టి సామర్థ్యముతో సమకూర్చుము. అని చెప్పుటచే శిల్పము భూలోక ద్యులోకములను, బలవంతముగను, తేజ

స్వంతముగను జేసి రూపక్రియా వాక్యముల నుచ్చరించుచు భాషను గూడ కల్పించునదియై కన్పట్టు చున్నది. భాగవత స్కం. 6 అ. 12 — ...

శ్లో॥ ఋగ్యజుస్సామాథర్వాఖ్యాన్ వేదాన్ పూర్వాదిభిర్ముఖైః ।
శస్త్ర విద్యాం స్తుతిస్తోమం ప్రాయశ్చిత్తం వ్యధాత్క్రమాత్ ॥ 37

ఆయుర్వేదం ధనుర్వేదం గాంధర్వం వేదమాత్మభూః ।
స్థాపత్యం చాసృజద్వేదం క్రమాత్ పూర్వాదిభిర్ముఖైః ॥

ఆయుర్వేదశ్చికిత్సాశాస్త్రం, ఋగ్వేదస్యోపవేదః, ధనుర్వేదో యుద్ధ శాస్త్రమ్, యజుర్వేదస్యోపవేదః, గాంధర్వవేదః సంగీతశాస్త్రం, సామవేద స్యోపవేదః, స్థాపత్యవేదో విశ్వకర్మాది శిల్పశాస్త్రం, అధర్వ వేదస్యోప వేదః (చరణవ్యూహే చతుర్థఖండః) భారతము అనుశాసనపర్వము, అ ౧౩

శ్లో॥ అగ్నేయస్త్వంగి రాశ్రీమాన్ కవిర్బ్రాహ్మో మహాయశాః ।
భార్గవాంగిర సౌలోకే లోకసంతాన లక్షణా ॥

తా॥ సర్వప్రజా సంతానమునకు కారణభూతులగువారు భృగువు, అంగిరసులు అగుదురు. ఆ ఆంగిరసులలో భరద్వాజాంగిరసులు, గౌతమాంగి రసులు, భృగ్వంగిరసులు, అధర్వాంగిరసులు. ఇట్లు శాఖలుగా అభివృద్ధి చెందియున్నారు. భారతమునఅందరు కౌరవులే అయినను పాండవులు అనుగొక శాఖవరెననుట.

## శిల్పశాస్త్రకర్తలు

మత్స్యపురాణం. అధ్యాయం 250

శ్లో॥ భృగుర త్రిర్వసిష్టశ్చ విశ్వకర్మామయస్తథా ।
నారదో నగ్నజిచ్చైవ విశాలాక్షః పురందరః॥
బ్రహ్మకుమారో నందీశః శౌనకోగర్గ ఏవచ
వాసుదేవోనిరుద్ధశ్చ తథాశుక్రః బృహస్పతిః ॥
అష్టాదశైతే విఖ్యాతా శిల్పశాస్త్రోపదేశకాః ॥

తా॥ భృగువు, అత్రి, వశిష్టుడు విశ్వకర్మ, మయుడు, నారదుడు, నగ్నజిత్తు, విశాలాక్షుడు, పురందరుడు, బ్రహ్మ కుమారుడు, నందీశ్వరుడు, శౌనకుడు, గర్గుడు, వాసుదేవుడు, అనిరుద్ధుడు, శుక్రుడు, బృహస్పతి, అంగిరసునికుమారుడు, వీరు పదునెనమండ్రు శిల్పశాస్త్రోపదేశకులుగా చెప్పుచున్నారు.

## ఆంగీరసులు శిల్పులే

శ్రుతి॥ అథ యద్రాజానా గవిష్టౌ సరత్సరణ్యుః । కారవేజరణ్యుః విప్రః ప్రేష్ఠః సహ్యేషాం బభూవ పరాచవక్ష దుతపర్ష దేనాన్॥

యజు కాం. 3 ప్ర 1 అ. 9 శ్రుతి

అంగిరస ఇమేసత్రమాసతే తేసువర్గంలోకం । న ప్రజానం తితేభ్య ఇదం బ్రాహ్మణం బ్రూహి॥

భాష్యం ॥ హేరాజానా, రాజమానౌ, మిత్రావరుణౌ, అథ అధునా, సత్రసమాప్తౌ యద్యస్మాత్మషా గవిష్ఠౌ గవామేషాణాం, సత్యాం సరణ్యుః, సరణశీలే యః సరత్ గచ్ఛతి కిం కుర్వన్ కారవే కర్మకుర్వతే ఆంగిరసాంగణాయ జరణ్యుః, స్తుతి మిచ్ఛన్ తస్మాత్ సవిప్రో నాభానేదిష్ఠః ఏషామంగిరసాం ప్రేష్ఠః ప్రియతమో బభూవ ॥ అంగిరోనామకా ఇమేమహర్షయః సత్రమనుతిష్ఠంతి తేతుస్వర్గప్రాప్తి సాధనానాం, నాభానేదిష్ఠ నామకశస్త్రాదీనా, మపరిజ్ఞానాత్ స్వర్గం నజానన్తి అతస్తేభ్య ఇదం, త్వయాధీనం శస్త్రాది ప్రతిపాదకం బ్రాహ్మం బ్రూహి ॥

విశ్వకర్మ వంశీయులగు జాంగిడా బ్రాహ్మణులను నిందించినందుకు శిక్ష.

1928 సం॥ క్రిమినల్ కేసు నెం. 120 రు ఢిల్లీ ఫస్టుక్లాస్ ఆనరరీ మేజస్ట్రేటు అగు

ఆర్. యన్. యల్. గోపాల్‌దాసు బి. ఏ. గారి తీర్పు.

ఫిర్యాది - గంగాసాహే కుమారుడు
దీనదయాల్‌శర్మ - కార్యదర్శి
జాంగిడాబ్రాహ్మణ మహాసభ-ఢిల్లీ

ముద్దాయి-హనుమాన్‌దత్తజోషి
మార్వారిబ్రాహ్మణ సంపాదకుడు
ప్రకాశకుడు - కలకత్తా

# తీర్పు వివరము

మహాభారతములో జంగల్ దేశమను ప్రదేశమున్నది. బ్రాహ్మణులలో వివిధములైన శాఖానామములు వారివారి జన్మస్థానములను బట్టి యేర్పడ్డవని ప్రతివాదిసాక్షులే ఒప్పుకొనిరి. అందుచే జంగల్ దేశములోని బ్రాహ్మణులను జంగల్ బ్రాహ్మణులనుట సమంజసమైనది. భితానీవాస్తవ్యుడైన పండిత సీతారాం 'ల' అనునది 'డ' అగునని 'జంగల్' అను మాటను 'జంగిడ్' అని మార్చవచ్చుననెను. ఈయభిప్రాయమునే పండిత పరశురామశాస్త్రి 'బ్రాహ్మణ వంశేతి వృత్తమ్' అను తన గ్రంధములో సూచించియున్నాడు. హిందూదేశములో 46 గురు గొప్ప పండితులచే జాంగిడులు బ్రాహ్మణులని ఒప్పుకొనుచు దస్కతులు చేసిన పత్రము ప్రతివాదిచే మోసపూరితమైనదని యెదుర్కొనబడెను. కాని అతడు మోసమని నిరూపించలేదు. దస్కతులుచేసిన పండితులలో ఒకరగు వాంఛరన్ భట్టాచార్యులు ఆపత్రిమును చదివియు తనమనస్సును దానిలోని విషయము లందు లగ్నపరచక యితరపండితులు దస్కతులు చేసినారని తానుగూడ దస్కతుచేసితినని కాశిలో విచారణచేయగా వాఙ్మూలమిచ్చెను. దీనివల్ల ఆపత్రము మోసముతో తేబడినది కాదని అర్థమగుచున్నది. కాశీలో దస్కతుదారులమీద ఏదైన మోసము చేయబడిన దానిని కనుగొనుటకు ఒకసంఘము నిర్మింపబడినది. కాశిలో 8 మంది దస్కతుదారు లున్నప్పటికి ఒక్కడును నిర్ధారణపరచుటకు ముందుకు రాలేదు.

మఱియు ఈపత్రిముయొక్క ఉద్దేశమునే బలపరచుచున్న దాదాపు 450 సంవత్సరముల క్రిందటిది భాలోలో లోఫికాలమునాటిదైన మఱియొక శాసనము ఇందులోని భారతమహా ధర్మమండలి అను పేరుగల కాశీలోని

పండితబృందముచే జాంగిడులు ఉత్తమకులము వారనియు, జాంగిడవంశము లలో సతి (సహగమనము) వాడుకగా నుండెననియు తెలుపబడియున్నది. సతి (సహగమనము) శూద్రులలో లేదు. అందుచే జాంగిడులు నిజముగా ఉత్తమకులజులనియు, ద్విజాతులలో ఒకరనియు తెలియుచున్నది. సుమారు 40 సంవత్సరములక్రిందటి వ్రాతపత్రములలో జాంగిడ బ్రాహ్మణులని చెప్పబడినది. 40 సంవత్సరముల క్రిందటకూడ జాంగిడులు బ్రాహ్మణులమని వాదించుచున్నట్లు కనబడును. మరియు బికనీరు సంస్థానములో ఈయబడిన తీర్పొకటి కలదు. జాంగిడులు వృత్తిచే ఖాతీలని పిలువబడిరి కాని వారు బ్రాహ్మణులేయనియు, బ్రాహ్మణుల కియ్యబడిన సమస్తమునే వీరికికూడ యియ్యబడెననియు ఆతీర్పునందు వివరముగానున్నది. కాశీ విశ్వవిద్యాలయమునకు ప్రిన్సిపాలును, గొప్పసంస్కృతపండితుడును, నాలుగు వేదములను అనువదించిన టి, హెచ్. గ్రిఫిత్ అథర్వవేదమునందలి "అంగ్రసిజాంగిడ" అను సమాసమును ఆంగిరః నీవు జాంగిడుడవని అనువదించెను. జాంగిడ ఆంగిరఋషియొక్క మరియొకపేరని తెల్లమగును. మరియు ఆంగిరఋషిసంతతి మారుపేరు. 'జాంగిడ' పెట్టుకొనియుండుటయు మిక్కిలి వాస్తవమై యుండును,

నేను అందుచే బ్రాహ్మణజాతి అని నమ్ముచున్నాను. ఈ వారి కొంతకాలము మరుగునబడి యుండవచ్చును. వారి వృత్తినిబట్టి జనులు వారిని ఖాతీలని పిలువవచ్చును. ఆపదము వృత్తిని సూచించును. కాని కులమును సూచించదు. ఈకేసును తీర్మానించుటకు జాంగిడులు బ్రాహ్మణులా ? అను విషయమును యిదివరకే చూపినాను. ఇప్పుడు ముఖ్యాంశమేమనగా ముద్దాయి తన వ్యాసములలో చూపిన వాదములు న్యాయసమ్మతములా ? అనునది. అట్టివ్రాత ప్రజోపయోగమునకా ? లేక యితర బ్రాహ్మణుల ఉపయోగమునకో ? ప్రతివాదియే నిరూపించవలసియున్నది. బ్రాహ్మణులలో 'అంతశ్శాఖ వివాహములు గావించు సలహాయిచ్చెను. కాని అయినచో ఒకడు వండిన అన్నమును మరియొకడు తీసికొనడు. ప్రతివాది

సాక్షుల జాంగికులచే వండబడిన అన్నమును (పక్కాని) తిందుమని ఒప్పు కొనిరి, అప్పుడు జాంగికులు బ్రాహ్మణులేకారని ప్రచురించుటలో యేమి న్యాయమున్నది. ద్వేషభావముతో జాంగిడులను వాదిని; జాంగిడమహాసభ, ఢిల్లీ ప్రజాదృష్టిలో నీచముగా కనుపడుచుటకు సమకట్టిన పెక్కుసార్లు ప్రకటించిన ముద్దాయియొక్క యీవాదమువల్ల బ్రాహ్మణజాతి యేలాభ మును పొందును? 'శూద్ర' అను పదమును వ్యాసములో అసూయాభావ ముతో ప్రయోగింపబడినది. ఇది న్యాయముకాదు. ముద్దాయికి రు. 200-00 జరిమానాగాని, రెండు మాసములు శిక్షగాని విధింపబడినది.

## విశ్వకర్మ సూక్తమ్

యజుర్వేద 4. కాం. 6 ప్ర 2, అ, 1 సగ్ంహిత ॥

యఇమావిశ్వాభువనాని జుహ్వదృషిర్హోతా నిషసాదపితానః। స ఆశి షాద్రవిణమిచ్ఛమానః పరమచ్ఛదో వర ఆవివేశ। విశ్వకర్మామనసా యద్విహాయాధాతా విధాతా పరమో తసందృక్। తేషామిష్టా నిసమిషా మదంతియత్రి సప్తర్షీన్ పరఏకమాహుః। యోనః పితా జనితాయో విధాతాయోనః సతో అభ్యాసజ్జజానః॥ 1

యోదేవానాం నామధా ఏక ఏవ తగ్ం సంప్రశ్నం భువనా యంత్యన్యా। త ఆయజంత ద్రవిణ గ్ం సమస్మా ఋషయః పూర్వేజరితారో నభూనా। అసూర్తాసూర్తా రజసో విమానే యేభూతాని సమకృణ్వన్నిమాని నతంవిదాథయ ఇదం జజానా న్యద్ యుష్మాకమంతరం భవాతి నీహారేణ ప్రావృతా జల్ప్యాచాసు తృప ఉక్థశా సచ్చరంతి పరో దివా పరఏనా॥2

పృథివ్యా పరోదేవేభిరసురైర్గుహాయత్. కంస్విద్గర్భంప్రథమం దధ్ర ఆపో యత్ర దేవాః సమగచ్ఛంత విశ్వే తమిద్గర్భంప్రథమం దధ్ర ఆపో యత్రదేవాః సమగచ్ఛంత విశ్వే । అజస్యనాభా వధ్యేకమర్పితం యస్మిన్నిదం విశ్వం భువన మధిశ్రితం విశ్వకర్మాహ్యజనిష్ఠ దేవ ఆదిద్గంధర్వో ఆభవద్ద్వితీయః । తృతీయః పితా జనితౌషధీనాం ॥ 3

అపాంగర్భం వ్యదధాత్ పురుత్రా ।చక్షుషః పితా మనసాహిధీరో ఘృతమేనే అజనన్నమ్నమానే। యదేదంతా అదదృగం హంత్రపూర్వ ఆదిద్ద్యావా పృథివీ అప్రధేతాం విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో విశ్వతో హస్త ఉతవిశ్వతస్పాత్ । సంబాహుభ్యాం నమతి సంపతత్రైర్ద్యావాపృథివీ జనయన్దేవ ఏకః । కిగ్ంస్విదాసీ దధిష్ఠానమారంభణంకతమత్స్విత్కిమాసీత్ యదీభూమిం జనయన్ ॥ 4

విశ్వకర్మా విద్యామహ్నో న్మహి నా విశ్వచక్షః। కిగ్ంస్విద్వనం క ఉసవృక్ష ఆసీత్ యతోద్యావా పృథివీ నిష్టతక్షుః। మనీషిణో మనసా పృచ్ఛతేదు తద్యదధ్యతిష్ఠద్భువనాని ధారయన్ ।యాతే ధామాని పరమాణి యావమా యా మధ్యమా విశ్వకర్మన్నుతే మా శిక్షా సఖిభ్యోహవిషి స్వధావః, స్వయం యజస్వ తనువం జుషాణం । వాచస్పతిం విశ్వకర్మాణ మూతయే ॥ 5

మనోయు జం నాజే అద్యాహూవేమ । వనోనే దక్షాహావనానిజోషతే విశ్వశంభూ రవసే సాధుకర్మా।విశ్వకర్మన్హవిషావావృధానః స్వయం యజస్వ తను వంజుషాణః । ముహ్యంత్వన్యే అభితః సపత్నా ఇహాస్మాకంమఘవాసూ రిరస్తు । విశ్వకర్మన్హవిషా వర్ధనేనత్రాతార మిందర్ని కృణోర వధ్యం । తస్మైవిశః సమన మంతపూర్వీ ర యముగ్రో విహవ్యోయథాసత్.సముద్రాయ వయునాయసింధూనాంపతయేనమః । నదీనాగ్ం సర్వాసాం పిత్రే జుహుతా విశ్వ కర్మణే విశ్వాహా మర్త్యగ్ం హవిః॥ (6)

తా॥ ఏ పరమేశ్వరుడగు విశ్వకర్మ ప్రళయ కాలమునందు ఈ అనంతములగు బ్రహ్మాండములను తన యందాహుతి చేసికొనినట్లు హరించి అతీంద్రియదర్శియై (జితేంద్రియుడై) మాకు తండ్రియై తాను నిలిచి యుండెనో అట్టి పరమేశ్వరుండగు విశ్వకర్మ ఆశీర్వాద రూపముచే (విస్తారమైన ప్రజోత్పత్తి యగు గాక! అను వాక్యములచే) జగద్రూపమైన ధన భోగము నపేక్షించినవాడై స్వకీయశరీర మధ్యగత పుండరీక స్థానమునందు జీవస్వరూపుడై ప్రవేశించెను. ఆ విశ్వకర్మ (సమస్తమగు సృష్టి స్థితి, సంహార రూపములయిన కర్మలుగల) పరమేశ్వరుడు తనకు సంకల్పాదులే సాధనములు కనుక మనస్సంకల్ప మాత్రముచే ప్రపంచమును సంహరించెను ఆ ప్రపంచములను, క్రమ్మర సృజించుటకును పోషించుటకును కర్తయయి అందరికంటె అధికుడై సర్వజ్ఞుడయ్యెను. ఏ పరమేశ్వర తత్వమందు మరీచ్యత్రి ముఖాది సప్తర్షులు ఏకీభావులని వేదాంతపారగులు చెప్పుదురో అట్టి విశ్వకర్మ ఆ మరీచి ప్రభృతి మహర్షులకు కోరికలు ఇచ్ఛామాత్రముగా సంపాదించెను. ఎవ్వడు తానొక్కడై (ఇంద్ర మిత్ర వరుణాది) సమస్త దేవతా నామములను ధరించెనో? అట్టి పరమేశ్వరుడగు

విశ్వకర్మను సమస్త భవనములు ప్రశ్నించునట్లు ప్రళయకాలమును పొందు చున్నవి, ప్రళయ కాలమునందన్ని లోకములు విశ్వకర్మయందు లీన మగుచున్నవి) ముందు ఉత్పాదింపబడిన విశ్వకర్మలగు ఏ బ్రహ్మలు ఘన రూపమైన భోగ్య సముదాయమును చక్కగా పెంపొందించిరో అతీంద్రియ ద్రష్టలును. సర్వజ్ఞులును, అగు నా ఋషులు స్వకీయమైన మహత్త్వము చేత ఒకప్పుడును ఈశ్వరులుగాక రంజనాత్మకమైన తమ తమ కర్మలచే ప్రేరేపింపబడు ఈ సమస్త భూతములను ప్రాణయుక్తములగు వానినిగా ఉత్పాదింపజేసిరి, ఏ విశ్వకర్మ ఈ జగత్తును సృష్టించెనో? అట్టి విశ్వ కర్మను, అతనిచే సృజింపబడిన ఓ జీవులారా! మీరును మేమును తెలిసికొన లేకున్నాము. ప్రత్యయ రూపమైన విశ్వకర్మ పరమేశ్వర తత్త్వము, లేదన గూడదు. సర్వవేదాంత వేద్యమైన ఈశ్వర తత్త్వమున్నది. జీవస్వరూపమైన ఆ తత్త్వమేల ? తెలిసికొన కున్నా మనిన జీవులందఱు మంచువంటి యజ్ఞానముచేత కప్పబడినవారలు. మంచు యెప్పుడును దృష్టిని మిక్కలిగా నిరోధింప జాలదు. బోధమాత్ర సమీపస్థితి లభించిన అంతయు వెలువడును. సర్వజీవులును అజ్ఞానముచే కప్పబడినవారే కాక. (నేను దేవుడను నేను మనుష్యుడను ఈ క్షేత్రమునా యది. ఈధమునా యది) అను అబద్ధము లాడుచున్నారు. ఏ ప్రకారము చేతనైన ప్రాణము లను తృప్తి పొందించుచున్నారు. స్వర్గాపేక్షచే యజ్ఞాద్యుక్త కర్మలను చేయుచు సంచరించుచున్నారు. (ఐహికాముష్మిక భోగగర్వితులై మెలగు చున్నారు) అందుచే మిథ్యాజ్ఞాన పరాధీనులగు మీకు యథార్థ తత్త్వజ్ఞానము లేదు. ఏ పరతత్త్వము గుహవంటి హృదయ పుండరీకమునందుగూఢమైనదో ఆ తత్త్వము స్వర్లోకమునకంటెను భూమికంటెను దూరమునను విలక్షణ మైనది మఱియు దేవతల చేతను దానవుల చేతను పొందపడక దూరమున నుండునది. (గురుశాస్త్ర విముఖులకు పొందశక్యము గానిది) ఏ గర్భము నందు సమస్త దేవతలు గూడ ప్రవర్తించిరో? ఆ కంప్యెన్నామక గర్భమును, ఉదకములు ముందుగా ధరించినవి ఏ గర్భమునందీ సమస్త మగు ప్రపంచ మాశ్రయించి యున్నదో? ఏకమగు ఆ బీజము జన్మ

రహితమగు పరమేశ్వర తత్వము యొక్క నాభియందు స్థాపింపబడినది. ఆ బీజము వలన విశ్వకర్మ బ్రహ్మయై పుట్టెను. తరువాత రెండవవాడు గంధర్వుడయ్యెను. మూడవవాడు ఓషధీపాలకుడగు సోముడు పుట్టెను. తరువాత పరమేశ్వరుడు బ్రహ్మాండమంతయు వేయి వేయిగ సృష్టించెను. చక్షురాది ప్రాణ సముదాయమునకు ఉత్పాదకుడు ధీరుడు అగు ఆ విశ్వకర్మ మన స్సంకల్ప మాత్రముచే ప్రాణి కుపయోగపడు సాధనములగు స్వర్గ మర్త్య లోకములకు ఒకదాని కొకటి యనురాగముగ వర్తించునట్లు సృష్టించెను. ఎప్పుడు ప్రథమోత్పన్నములై చేష్టావంతములైన చరాది ప్రాణములు ధృఢవంతము లైనవో? వాని వెంటనే స్వర్లోకభూలోకములు విస్తరించినవయ్యెను. సర్వత్ర నేత్రములు గలిగినట్టియు, సర్వముఖములు గలిగినట్టియు, అంతటను బాహువులు కలిగినట్టియు, అంతటను పాదములు కలిగినట్టియు స్వయంప్రకాశుడు, అద్వితీయుడు అగు విశ్వకర్మ స్వర్గ మర్త్య లోకములను సృజించుచు నిమిత్త కారణములైన ధర్మాధర్మను లను బాహువులచే పతనశీలము లగు నుపాదాన కారణములతో జగత్తును స్వాధీన పరచుకొనుచున్నాడు. సర్వద్రష్టయగు విశ్వకర్మ స్వర్లోక భూ లోకములను సృష్టించు చున్నవాడగునేని ఆ విశ్వకర్మకు నివాసమేమి? ఉపాదాన కారణమేమి? అను ప్రశ్నము నందు ఈశ్వరుడు నిరపేక్షుడగుట వలన మఱియొక వస్తువు వలన సృష్టించినవాడు కానేరడు. ఇక నేమనిన తన మహిమచే తనే భూమిని, స్వర్గమును కప్పెను. (ఈ పరమేశ్వరుడు యోచింప శక్యము గానివాడు) అతని సాధనములకు వన మెక్కడ? దాని పేరేమి? అక్కడ నున్న శ్రేష్ఠమైన వృక్షమేమి? స్వర్లోక మర్త్యలోకము లెట్లు చేయబడినవి? అను ప్రశ్నలకు ఓ విద్వాంసులారా! మీ మనస్సుతో విచారించి యడిగితిరేని (ఆ విశ్వకర్మ) సమస్త భువనములను ధరించు చున్నవాడై యే స్థానము నధిష్ఠించెనో? అదియే స్థానము. (అన్నిటికి ఆధారభూతువగు విరాట్పురుషుడు. సంకల్ప మాత్రము చేతనే సమస్త బ్రహ్మాండములను సృజించుచున్నాడు, అని భావము) ఓ విశ్వకర్మా! నీ సంబంధములైన స్థానములలో యేవి యుత్కృష్టములో? ఏవి

ధ్యమములో ? ఏవి యధమములో ఈ మూడు స్థానములను నీ ప్రియుల కొఱకు హవిర్ధాన విషయమై ఉపదేశించుము. స్వధోపలక్షితము లగు హవిర్లక్షణములుగల యో విశ్వకర్మా ! యజమానుని శరీరమును పొందినవాడవై స్వయముగా యజ్ఞము చేయుము (నీ యనుగ్రహమును విడిచి యెవడు యజ్ఞము చేయగలడు?) ఆ పరమేశ్వరుడు మా సమీప మందున్న హవిస్సులను స్వీకరించు చున్నవాడును, సమస్త ప్రపంచము నకు సుఖము నిచ్చువాడును, మమ్మ రక్షించుట కొఱకు యోగ్యమైన వ్యవహారములు గలవాడును, అగును. కనుకనే మంత్ర రూపములగు వాక్కులకు ప్రభువగువాడును (బృహస్పతి యగువాడును) మా మనస్సు లతో గూడుకొనినవాడు, అగు నా పరమేశ్వరుడగు విశ్వకర్మను యజ్ఞము నందు రక్షణ కొరకు ధ్యానరూపముగా పిలుచుచున్నాము. ఓ విశ్వకర్మా ! ఆజ్యాది హవిస్సుచే మిక్కిలి వృద్ధిని పొందుచున్నవాడవై స్వయముగా యజ్ఞమును చేయుము. మా కంటె ఇతరులైన శత్రువు లంతటను భ్రాంతిన పొందుదురు గాక! యజ్ఞములకు చేయువాడును, విద్వాంసుడును, అగు పుత్రుడు గలుగుగాక! ఓ విశ్వకర్మా ! హవిస్సుచే వృద్ధి పొందిన వాడవై నీవీ యజమానుని అన్యులకు రక్షకునిగాను, పరమైశ్వర్య యుక్తునిగాను, ఏవనిచేతను నవధింప శక్యముగాని వానిగను, చేయుము. ఆ యజమానుని కొరకు పూర్వప్రజలు స్వాధీన మగుదురు గాక ! ఈ యజమానుడు తపశ్శక్తి గలవాడును, వివిధయాగ యోగ్యుడు ఏట్లగునో అట్లు చేయుము. సముద్ర స్వరూపుడును, కాంతుడును (ప్రకాశుడు) ప్రవహించుచున్న సమస్త నదులకు నాయకుడు ఉత్పాదకుడు అగు విశ్వకర్మ కొరకు నమస్కారము. ఆ విశ్వకర్మ కొఱకు సమస్త దినములు అక్షయముగా ఆజ్యాదిహవిస్సులు హోమము చేయుదుముగాక ;

ఇట్లనుటచే పరమేశ్వరుడగు విశ్వకర్మయే జగత్సృష్టి స్థితిలయ ములకు కారణభూతుడై యజ్ఞకర్తయు, యజ్ఞభోక్తయు తానమై వెలయు చున్నటుల స్పష్టమగుచున్నది.

శ్రుతి॥ విశ్వకర్మా దిశాంపతిస్సనః పశూన్పాతు సోఽస్మాన్ పాతు తస్మైనమః ప్రజాపతీ రుద్రో వరుణోఽగ్ని ర్దిశాం పతి స్సనః పశూన్ పాతు సోఽస్మాన్ పాతు తస్మైనమః॥ (యజు కాం 5 ప్ర 5 అ 5)

తా॥ సమస్త దిక్కులకు అధిపతియైన విశ్వకర్మ పరమేశ్వరుడు మమ్ము రక్షించుగాక ! మా పశువులను కాపాడు గాక ! మఱియు ప్రజా పతియును, రుద్రుడును, వరుణుడును, అగ్నియును వీరందఱును మమ్ము లను మా పశువులను కాపాడుదురు గాక! మఱియు శ్వేతాశ్వతరోపనిషత్! శ్రుతి॥ ఏషదేవో విశ్వకర్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః ।

హృదామనీషా మనసాభిక్లప్తో య ఏతద్విదు రమృతాస్తే భవంతి ॥ అని విశ్వకర్మ మహత్వమును తెలియజేయుచున్నది.

## విశ్వకర్మోపనిషత్

శ్రీ గురుభ్యోనమః। హరిః ఓం। సహనావవతు సహనౌభునక్తు సహవీర్యంకరవావహై। తేజస్వినా వధీత మస్తు మా విద్విషావహై॥ ఓం శ్శాంతి శ్శాంతి శ్శాంతిః॥ ఓం విశ్వకర్మా దిశాంపతిస్సనః పశూన్ పాతు సోఽస్మాన్పాతు తస్మై నమః, ప్రజాపతీరుద్రో వరుణౌఽగ్నిర్ దిశాంపతి స్సనః పశూన్పాతు సోఽస్మాన్పాతు తస్మైనమః।అథ పురుషో హవై విశ్వకర్మాఽకామయత ప్రజాన్సృజేయేతి। విశ్వకర్మణః ప్రాణో జాయతే । మనస్సర్వేం ద్రియాణి చ । ఖం వా యుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్యధారిణీ। విశ్వకర్మణో బ్రహ్మాజాయతే। విశ్వకర్మణో రుద్రోజాయతే విశ్వకర్మణో నారాయణోజాయతే। విశ్వకర్మణఃప్రజాపతయః ప్రజాయంతే

విశ్వకర్మణో ద్వాదశాదిత్యా రుద్రావసవ స్సర్వేదేవతా స్సర్వేఋషయ స్స
ర్వాణి ఛందాగ్ంసి సర్వాణి భూతాని వా। సముత్పద్యంతే విశ్వకర్మణి ప్ర
వర్ధంతే విశ్వకర్మణి ప్రవీయంతే। ఓం అథనిత్యోదేవ ఏకో విశ్వకర్మా।మా
దేవానాం నామధా ఏకఏవ విశ్వకర్మా। విరాడ్విశ్వకర్మాస్వరాడిశ్వకర్
మా। స్వబ్రహ్మా డ్విశ్వకర్మా।ఆథరుద్రో విశ్వకర్మా। బ్రహ్మా విశ్వకర్మా
శివశ్చవిశ్వకర్మా।విష్ణుశ్చ విశ్వకర్మా।శక్రశ్చ విశ్వకర్మా। ద్యావాపృ
థివ్యౌచ విశ్వకర్మా। కాలశ్చ విశ్వకర్మా। దిశశ్చ విశ్వకర్మా।దిగం
తశ్చ విశ్వకర్మా అగ్నిశ్చ విశ్వకర్మా।ఊర్ధ్వశ్చ విశ్వకర్మా। అధశ్చ
విశ్వకర్మా। అపాంతరంచవిశ్వకర్మా।అంతర్బహిశ్చవిశ్వకర్మా। విశ్వ
కర్మణోనిరాకృతిః। విశ్వకర్మణ ఏవేదగ్ం సర్వంయద్భూతం యచ్చభ
వ్యం। నిష్కళంకో నిరంజనో నిర్వికల్పో నిరాఖ్యాత శ్శుద్ధో దేవఏకో
విశ్వకర్మా। నద్వితీయోఽస్తికశ్చిత్। య ఏవంవేద। స విశ్వకర్మాఽవేవ
భవతి సవిశ్వకర్మారేఽభవతి। ఓమిత్యగ్రేవ్యాహరేత్ నమఇతిపశ్చాత్
విశ్వకర్మణ ఇత్యుపరిష్టాత్। ఓ మిత్యేకాక్షరం। నమ ఇతిద్వేఅక్షరే। విశ్వ
కర్మణ ఇతిపంచాక్షరాణి। ఓం విశ్వకర్మణ ఇతి షడక్షరాణి। ఓం నమో
విశ్వకర్మణ ఇత్యష్టాక్షరపదం। యోహవై విశ్వకర్మణ ఇత్యష్టాక్షరంపద
మధ్యేతి। అనపబ్రువన్ త్సర్వమాయురేతి। విందతే ప్రాజాపత్యాం
రాయస్పోషం గౌపత్యం। తతోఽమృతత్వ మశ్నుతే। తతోఽమృతమ
శ్నుతయితి। యఏవంవేద। ప్రత్యగానందం బ్రహ్మపురుషం ప్రణవ స్వ
రూపం। అకారఉకారో మకారఇతి। తానేకధా సమభరత్ తదేతదోమితి॥

యముక్త్వా ముచ్యతే యోగీజన్మ సంసార బంధనాత్। ఓం నమో విశ్వ కర్మణ ఇతిమంత్రో ప్రాసకః సాయుజ్యం గమిష్యతి। తదిదంపరం పుండరీకం విజ్ఞానఘనం। తస్మాత్తదిదంతావన్మాత్రం। బ్రహ్మణ్యో విశ్వకర్మణే। సర్వాభూతస్థమేకం విశ్వకర్మాణం। కారణరూప మకారపర మాత్మబ్రహ్మణో। పదంవిష్ణ్వాఖ్యమితితేఽసి విశ్వకర్మణోపనిషదం। యోఽధీతే విశ్వకర్మణ్యోపనిషదమధీతే। సర్వేభ్యోపాపేభ్యో విముక్తో భవతి। స సర్వేభ్యో విముక్తః సర్వాన్ కామాఽనవాప్నోతి। బ్రహ్మ లోకంప గచ్ఛతి। ఇత్యుపనిషత్। ఓం సహనానవతు .... వహై॥

మత్తకోకిలావృత్త విశ్వకర్మాష్టకమ్

శ్రీకరార్చిత సత్య శాశ్వతలోక నిర్మితనిర్జరా।
పాకశాసన పద్మజాది సురాసురార్చిత భాస్కరా।
ఏకమేవహి బ్రహ్మమూర్తి పినాకసంస్థిత శంకరా।
లోకవర్జిత శంభునామక విశ్వకర్మజగత్ప్రభో॥ 1

సర్వనాయక సర్వదాయక సర్వసాక్షి మహేశ్వరా।
సర్వరాజిత సర్వపూజిత సర్వకార్యధురంధరా।
సర్వశిక్షక సర్వభక్షక సర్వరక్షక శ్రీకరా।
సర్వసద్గుణ సర్వనామక విశ్వకర్మజగత్ప్రభో॥ 2

స్వర్ణరూప సువర్ణలోక సుపర్వకాంతి మనోహరా।
వర్ణరాజిత వర్ణవర్జిత వర్ణ రాజవిభాకరా।
వర్ణవాచక వర్ణసంభవ వర్ణవేదజటాధరా।
వర్ణవర్ణాతీత వర్ణన విశ్వకర్మజగత్ప్రభో॥ 3

మంత్రనిగ్రహ మంత్రసంగ్రహ మంత్రమాయజ సంహరా।
మంత్రచేతన మంత్రనూతన మంత్రసంశయ శేఖరా।

మంత్రరాజిత మంత్రిపూజిత మంత్రవేద విశారదా ।
మంత్రబంధుర మంత్రనామక విశ్వకర్మజగత్ప్రభో ॥ 4

హారఘోర విదారదూర విచారనిస్వన మంజులా ।
ధీరవార్ధిగభీర మోహవిదూర చిన్మయచిత్కళా ।
సూరిసారవిహారకల్ప విచారకారణ సత్ఫలా ।
మేరునిర్మిత మేషువాహన విశ్వకర్మజగత్ప్రభో ॥ 5

విశ్వచారణ విశ్వపూరణ విశ్వధారణ నిశ్చయా ।
విశ్వభూషణ విశ్వపోషణ విశ్వపోషణ చిన్మయా ।
విశ్వతారణ విశ్వకారణ విశ్వధారణలీలయా ।
విశ్వహారణ విశ్వనామక విశ్వకర్మజగత్ప్రభో ॥ 6

మంగళాకర మంగళాధర మంగళాసన పంచకా ।
మంగళస్థిత మంగళప్రద మంగళాంగవిరాజితా ।
మంగళాయత ఇష్టదాయక మంగళాకరనామకా ।
మంగళాయ తతుంగనామక విశ్వకర్మజగత్ప్రభో ॥ 7

కల్పపావన కల్పజీవన కల్పభావ నమోస్తుతే ।
కల్పపాలన కల్పఖేలన కల్పజాంగ నమోస్తుతే ।
కల్పనాకృత కల్పసంయుత కల్పకల్ప నమోస్తుతే ।
కల్పకాండవ కల్పనామక విశ్వకర్మజగత్ప్రభో ॥ 8

—0—

సమాజమువారి యేకగ్రీవానుమతిన వయోజ్యేష్ఠులును, కర్మజ్యేష్ఠులును, విద్యాధికులును, వేదవేదాంగ సకలధర్మ ప్రవర్తకులును, అగు గోదావరిజిల్లా యేలూరుతాలూకా చేటపర్తిగ్రామ కాపురస్థులగు బ్రహ్మశ్రీ గుండు సుబ్రహ్మణ్యాచయనులుగారు ఈక్రింది ఉదహరించిన ప్రకారము తీర్మానించిన వివరము.

"సత్యంబ్రూయాత్, ప్రియంబ్రూయాత్, నబ్రూయాత్, సత్యమప్రియమ్"

| అర్జీదారు | ప్రతివాదులు |
| --- | --- |
| బాహుబలేంద్రుని అగ్రహారము | బాహుబలేంద్రుని అగ్రహారము |
| పౌరుషేయ బ్రాహ్మణుడు | శ్రీవైశ్యసంఘమువారు |
| అహభూన గోత్రము | అందఱు కలసి |
| పింజవరపు శంభులింగాచార్యులుగారి | అగ్రతాంబూలాపేక్షకులు |
| పుత్రుడు సుబ్రహ్మణ్యాచార్యులు | |
| (పాకయాజి) | |

క్రీ. శ. 1899 వికారి సం, బ్రహ్మశ్రీ బొమ్మకంటి జోగిచయనులుగారునర్చు నాచికేతు క్రతుసమాగత సభామండపము

# సభాతీర్మానము

(1) విశ్వకర్మను గూర్చి ఋగ్వేదాష్ట మాష్టక తృతీయాధ్యాయాంతమున ద్వితీయ, తృతీయ మంత్రపర్యంతము, కృష్ణ యజుర్వేద తైత్తిరీయ సంహితయందు చతుర్థకాండ షష్ఠప్రపాఠక ద్వితీయానువాకము సందాఱు మంత్రములును,

శ్రుతి ॥ య ఇమాంవిశ్వాభువనా నిజుహ్వ దృషిర్హోతా నిషసాద పితానః ॥ అని ప్రారంభించిన మంత్రము లన్నియును ఆయన పరాత్పరత్వమును చెప్పుచున్నవి.

(2) యజుర్వేదము 5 వ కాండము, 5 వ ప్రపాఠకము, 5 వ అనువాకమున

శ్రుతి॥ విశ్వకర్మాహ్యసి శాం పతి స్సనః పశూన్ పాతు సోస్మాన్పాతు తస్మై నమః ॥ అను మంత్రమున జగద్రక్షకత్వము కనుపడుచున్నది.

(3) శ్వేతాశ్వతరోపనిషత్ 4 వ అధ్యాయము

శ్రుతి॥ ఏషదేవో విశ్వకర్మా మహాత్మా। సదాజనానాం హృదయేసన్నివిష్టః

హృదామనీషా మనసాభిక్లృప్తోయ ఏతద్విదు రమృతా స్తే భవంతి ॥

అను ఉపనిషద్వాక్యములలో సర్వజగ దంతర్యామి యగు పరబ్రహ్మత్వము గోచరించుచున్నది.

(4) నిరుక్తము ఉత్తరషట్కము 10వ అధ్యాయము 3 వ పాదము 25 వ ఋక్

ఋగ్వేదము 8 వ అష్టకము 3-16-2 (విశ్వకర్మ సూక్తఋక్.)

విశ్వకర్మా విమనా అద్విహాయా ధాతా విధాతా పరమోత సందృక్। తేషా మిష్టాని సమిషా మదంతి యత్ర సప్తర్షీన్ పర ఏక మాహుః ॥

తా॥ విశ్వకర్మ అన్నిచోటులను అప్రతిహతమైన ప్రజ్ఞ గలవాడును సర్వస్రష్ట సర్వద్రష్ట సర్వవ్యాపక శక్తులతో సప్తర్షులకు సమస్తమైన కోరికల నెరవేర్చువాడనియును తెలియుచున్నది.

(5) యజుర్వేదము 3 వ అధ్యాయము 4 ప్ర 7 వ అనువాకము

శ్రుతి॥ ప్రజాపతి ర్విశ్వకర్మా మనోగంధర్వస్తస్య ఋక్సామా న్యప్సరసో వహ్నయః ॥

భాష్యము॥ ప్రజానాం పాలకః ప్రజాపతిః, విశ్వం కర్మకరణీయం యస్యా సౌవిశ్వకర్మా తాదృశో మనోనామకః కశ్చిద్గంధర్వః తస్యచఋక్సా మ దేవతాచార్యాః, తాశ్చసౌందర్యం వహంతీతి, వహ్నయఇత్యుచ్యంతే॥ తైత్తిరీయ బ్రాహ్మణ ద్వితీయాష్టకమునను. శ్రుతి॥ ప్రజాపతి ర్విశ్వకర్మా అని యున్నది.

(6) పురాణములలోను-వాయుపురాణము ఉత్తరభాగము 22 వ అధ్యాయము

శ్లో॥ బృహస్పతేఽస్తు భగినీ, వరస్త్రీబ్రహ్మచారిణీ,
యోగసిద్ధాజగత్కృత్స్నం, మసక్తాచరతేసదా. (15)

ప్రభాసస్యతు సాభార్యా, వసూనామష్టయస్యతు,
విశ్వకర్మాస్తుత స్తస్యాం, జాతః శిల్పి ప్రజాపతిః. (16)
త్వష్టావిరాజో రూపాణాం, ధర్మపౌత్రి ఉదారధీః,
కర్తాశిల్ప సహస్రాణాం, త్రిదశానాం చవాస్తుకృత్. (17)

యః సర్వేషాం విమానాని, దేవతానాం చకారహ.
మానుషాశ్చోప జీవంతి, యస్యశిల్పం మహాత్మనః. (18)

దేవాచార్యస్య మహాతో, ధీమతో విశ్వకర్మణః,
విశ్వకర్మాత్మజశ్చైవ, విశ్వకర్మమనుపిసుతః. (19)

సరేణు రితివిఖ్యాతా, స్వసా తస్య యవీయసీ,
త్వాష్ట్రీసాసవితుర్భార్యా, పునఃసంజ్ఞేతి విశ్రుతా. (20)

తా॥ బృహస్పతియొక్క తోబుట్టువగు యోగసిద్ధయను నామెను, వసువులలో ఎనిమిదవవాడగు ప్రభాసునకిచ్చి వివాహము చేసిరి. ఆమెకు శిల్పి ప్రజాపతియగు విశ్వకర్మ కుమారుడుగా బుట్టెను. అతడు సృష్టికర్త, శిల్పనిర్మాణములో నగ్రగణ్యుడు, దేవయానములు, దేవతాగృహములు మున్నగు లోకోపకార కార్యము లనంతముగ చేయువాడయ్యెను. ఇంతేకాక దేవతల కెల్లరకు ఆచార్యుడాయెను. ఆవిశ్వకర్మకు త్వష్ట్రవిశ్వకర్మయు-మనువు-అను నిరువురు సుతులు కలిగిరి. అందు త్వష్టయొక్క పుత్రిక సంజ్ఞ యను నామె సూర్యునకు భార్యయయ్యెను. ఆమె కుమారుడు యము డను పేరుగల ధర్ముడు జనించెను. త్వష్ట్ర విశ్వకర్మకు చెల్లెలగు సరేణు వను నామెయును శక్తి సంపన్నురాలయ్యెను. అనియున్నది. కనుక బృహస్పతినికూడ తీసివేయునంతటి పైత్యోద్రేకము చెల్లునా ?

7) మహాభారతము ఉద్యోగపర్వము -

శ్లో॥ త్వష్టా ప్రజాపతీహ్యాసీ ద్దేవ శ్రేష్ఠో మహాతపాః ॥

8) మత్స్యపురాణము 5 వ అధ్యాయము -

శ్లో॥ విశ్వకర్మా ప్రభాసస్య, పుత్రః శిల్పి ప్రజాపతిః ॥
ప్రాసాదభవనోద్యాన ప్రతిమా భూషణాదిషు.
తడాగారామ కూపేషు సుతఃసోఽమరవర్ధకీ ॥

అని ప్రసిద్ధి యుండెనుగదా? విశ్వకర్మ ప్రజాపతిత్వము నిత్యమైయున్నది.

9) శ్రీమద్భాగవతము 8 వ స్కంధము 15వ అధ్యాయము -

శ్లో॥ భూషణాని విచిత్రాని. విశ్వకర్మ ప్రజాపతిః,
హారం సరస్వతీపద్మ మజోనాగాశ్చ కుండలే ॥

విశ్వకర్మ ప్రజాపతియనియే వర్ణించినాడు.

10) మహాభారతము-ఆదిపర్వము-62 వ అధ్యాయము -

శ్లో॥ ప్రభావసోఽస్తు భార్యాయాం, వసూనామష్టమస్యహ,
విశ్వకర్మామహాభాగ, జజ్ఞేశిల్పి ప్రజాపతిః ॥
మనుష్యాశ్చోపజీవంతి, యస్యశిల్పం మహాత్మనః,
పూజయంతిచ యంనిత్యం, విశ్వకర్మాణమవ్యయమ్ ॥

నిత్య పూజితుడని యుండెను.

11) స్కందపురాణము, కాశీఖండము-76 వ అధ్యాయము -

శ్లో॥ విశ్వకర్మా భవత్పూర్వం బ్రహ్మణ స్త్వ పరాతనుః,
త్వష్టుఃప్రజాపతేః పుత్రోః, నిపుణః సర్వకర్మసు ॥

విశ్వకర్మ సమస్త కార్యములలో నేర్పరి యనుచున్నాడు.

12) లింగపురాణము 72వ అధ్యాయము -

శ్లో॥ అథరుద్రస్య దేవస్య నిర్మితో విశ్వకర్మణా,
సర్వలోక మయోదివ్యో రథోయత్నేన సాదరమ్ ॥

అని విశ్వకర్మ శివునకు రథమును చేసియిచ్చినట్లగపడు చున్నది.

13) శివపురాణము 23వ అధ్యాయము -

శ్లో॥ సర్వదేవమయం దివ్యం రథం పరమశోభనమ్.
రచయామాస విశ్వార్థం విశ్వకర్మా స్వయంతథా ॥

25) సర్వభూతమయశ్చైవ సౌవర్ణం సర్వసమ్మతమ్ ॥
రథాంగం దక్షిణం సూర్యం వామాంగం సోమఏవచ ॥

26) ఇందు విశ్వకర్మయొక్క రథనిర్మాణము వివరింపబడినది.

14) ఋక్ అ 1, అ 2, వ 31 మం. 16 శ్రుతి

శక్వరింద్రః పోప్పృథద్భిర్జిగాయనాన దద్భిః శాశ్వ నుద్భిర్ధనాని । సనో
హిరణ్యరథం దంసనా వాన్సనః సవితా సనయే సనోదాత్ ॥

భాష్యం॥ తుష్టేనేంద్రేణదత్తం హిరణ్యరథం అనయాప్రీతి టగ్రాహ ।
ఇందును రథవర్ణన మున్నది.

15) స్కాందపురాణ నాగరఖండ విశ్వకర్మోపాఖ్యానము 6వ అధ్యాయము.

శ్లో॥ విశ్వకర్మ సుతాహ్యేతే రథకారస్తు పంచచ ।
పాషాణదారుకం టంకం సౌవర్ణం దశకంతథా ।
కాష్టంచ నవలోహాని రథకృద్భ్యో దదౌవిభుః ।
రథకారా స్తథాచక్రుః పంచకృత్యాణి సర్వదా ॥
అని రథకారశబ్ద ముపయోగించబడినది.

మఱియు రథకారాధి కరణము అను గ్రంథమున 35 వ సభ్యుడు అనకాపల్లి గ్రామవాసి శ్రీవీరవల్లి శ్రీనివాసాచార్యులుగారు స్కాంధపురాణ నాగరఖండ పంచమాధ్యాయ శ్లోకములనుధికమునట చేతను, సృష్ట్యాదినుండి విశ్వకర్మపరంపరగా వచ్చుచున్న రథకారశబ్దమును తోసిపుచ్చుటకు వీలు

కాదనియును, నిన్న మొన్నటి అమరుకు సంకరజాతి కట్టిపేరుపెట్టుట తెలివి మాలిన పనియనియును, రథకార బ్రాహ్మణశబ్దము సిద్ధాంతకౌముదికూడ పూర్వమునుండి యుండుటచేతనే అంగీకరింపబడినదనియు, నిర్ణయించి యుండిరి. ఆరథకారాధికరణమునందే ముంగొండగ్రహారనిలయ శ్రీముక్కామల భవానీశంకరశాస్త్రిగారు బ్రహ్మకైవర్త పురాణమును వరాహపురాణమును శిల్పశాస్త్రములను శిల్పిలక్షణములను బహువిభాగములను, ఋగ్వేదాది శ్రుతులను, జ్ఞప్తిచేయుచు విశ్వకర్మీయ బ్రాహ్మణుల శ్రేష్ఠత్వ రథకార బ్రాహ్మణపదమును కదలింప దగినవి కావని ధృవపరచిరి.

16) సుబ్రహ్మణ్యాచార్యులు ఈసమాజముతో విజ్ఞాపనము చేసికొన్నది దేని విషయమై ?

పౌరుషేయ బ్రాహ్మణులము, ప్రథమవర్ణమైన మాకు పూర్వము నుండియున్న శ్రేష్ఠతను విచారించక లోకులు మూడవ వర్ణమువారగు వైశ్యులను మాకంటెముందు సత్కరించడమునకు ప్రయత్నింపటము చాల అన్యాయము కాబట్టి సమస్తము తెలిసిన మీరలు మీ శాస్త్రపరిశీలన పూర్వకముగా న్యాయమును కలుగజేసి అట్టి ధర్మములను లోకమున కెఱుకపఱచెదరు గాక. మీ సర్వశాస్త్రపారంగ తత్వమును లోకము సంతోషించి మీ తీర్మానము ప్రకారము ప్రవర్తించుచుందురుగాక యని ప్రార్థన.

(17) క్రీ. శ. 1756 విజయనగర మహారాజావారి పండిత మహాసభలో రథకారాధి కరణసందలి 41 వ సభ్యుడు శ్రీ లింగంగుంట రామశాస్త్రి గారు చెప్పిన వైవస్వత పురాణములో భీమ కృష్ణ సంవాదములో

శ్లో॥ సూత్రధారావతహరీ త్రిపురారిర్మహానటః।
తస్యాంసభాయామ దిహో విశ్వకర్మగురుర్భవేత్ ॥

రామపాద రజ స్పర్శా దహల్యాభూన్మహాశిలా।
విశ్వకర్మావ మర్త్యాత్త చ్ఛిలాద్దైవత్వ మాగతా ॥

శివస్య ఫాలనేత్రాగ్ని శ్శాపౌగౌతమ సన్మునేః।
వ్యర్థతాంయాతి నోపైతి విశ్వకర్మ విరోధవాక్ ॥

విష్ణోశ్చక్రం వజ్రీవజ్రం బ్రహ్మాస్త్రం కాలదండకః।
కదాచిద్విఫలంవా స్యాన్న విరోధాహిశిల్పినః ॥

సర్వంజగదిదం పూర్వం సపురగ్రామపత్తనం।
నిర్మితం శిల్పినావిశ్వ కర్మణా కరుణాత్మనా ॥

దేవతానాం మనుష్యాణాం యక్షాణాం రక్షసామపి।
సాధనైః పురనిర్మాణం నిర్మాయ విధినాసహ ॥

విశ్వకర్మా సుశిల్పజ్ఞః పురాభూ ద్విశ్రుతస్తథా।
తస్మా జ్జగదిదం సమ్యక్ విభాసేన ప్రతిష్ఠితమ్ ॥

యోవిశ్వకర్మా శిల్పజ్ఞః ప్రబభౌతస్య సత్కులాత్।
సంభూతస్తద్వతేవాద్య రథకారఇతిశ్రుతిః ॥

సౌధన్వారథకారశ్చ వేదేషుపరినిష్ఠితః।
తస్యయజ్ఞాధిజారిత్వం తత్రైవవిధిచోదితమ్ ॥

విశ్వకర్మ బ్రహ్మకులా జ్జాతత్వాత్తస్యవైదికం।
కర్మైవ రథకారస్య వేదమార్గేణ చోదితమ్ ॥

ప్రోక్తం నిఘంట్వంతరేషు సంకరోరథకారకః।
ఇతిత్రయీపరిచితి విహానోఽమరసింహకృత్ ॥

వర్షాసురథకారస్య యజ్ఞోపై ప్రతిపాదితః।
ఋగ్వేదేన నతస్యాద్య యజ్ఞకర్మత్వమీడితమ్ ॥

వైదికాచారనిరతో రథకారోవినిశ్చయః।
విశేషతోవిధానాచ్చ వేదేనిస్సంశయోభువి ॥

అజ్ఞానాత్యక్ష్యతే లోకస్తత్త్వం కేనాపి వేదితం।
గతానుగతికోలోకో నలోకఃపారమార్థికః ॥

బృహస్పతేఽస్తుభగినీ యోగసిద్ధిరితిస్మృతా
తస్యాః ప్రభావసుర్భర్తా సాలతిః స్యాద్దీప్పతేస్తథా ॥
పుత్రఃస్యాద్విశ్వకర్మేతి యోగసిద్ధేఃప్రభావసోః ।
దేవానాంశిల్పకారస్య త్వష్టాభూద్విశ్వకర్మణః ॥

త్వష్టృపుత్రోవిశ్వరూపః త్రిదశానాం పురోహితః ।
ఋభవశ్చాపిదేవానాం రథకారాభవంతియే ॥
తేసర్వే శిల్పినఃపుత్రాః విశ్వకర్మప్రజాపతేః ॥
ఋభవోరథకారాశ్చ సౌధన్వాన ఇతిక్రమాత్ ॥
ఋభవోదారుకారాశ్చ కాంస్యకారాస్తథైవచ ।
అయస్కారాః స్వర్ణకారాః శిలాకారాశ్చపంచధా ॥
భవంతి జాతయోభూమౌ పంచానాం యోగసత్తమాః ।
విహితంవిప్రవన్నిత్యం ఋగ్వేదబ్రాహ్మణేవథా ॥

తా॥ ఒకప్పుడు బ్రహ్మ విష్ణులు సూత్రధారులుగను, శంకరుడు మహానటుడుగను, ఏర్పడిన సభకు అధిపతియును, గురువు విశ్వకర్మ యుండెను. రామపాద రజఃస్పర్శవలన మహాశిల అహల్య రూపము నొందెను: అయ్యది విశ్వకర్మ స్పర్శవలన దేవత్వమును పొందెను. అనగా గౌతముడు తనభార్యను శిలారూపము గమ్మని శపించినను విశ్వకర్మ మాహాత్మ్యమువలన అది దేవత్వమొందుటచే గౌతముశాపము వ్యర్థమాయె నని యెఱుంగదగినది. శివుని ఫాలనేత్రాగ్నియు. గౌతముని యొక్క శాపమును, వ్యర్థమగును. విశ్వకర్మ విరోధకార్యము వ్యర్థముకానేరదు. మఱియు విష్ణుచక్రము, ఇంద్రుని వజ్రాయుధము, బ్రహ్మాస్త్రము, యముని దండము, ఇవి యొకానొకప్పుడు విఫలమగును గాని శిల్పి ప్రజాపతి విరోధం బెప్పుడును సఫలంబు గానేరదు. పూర్వమందీ జగమంతయు [illegible]ణములుగను గ్రామములుగను, దయార్ద్రహృదయుడై విశ్వకర్మ నిర్మించెను. విశ్వకర్మ బ్రహ్మతోగూడినవాడై దేవతలకును, [illegible]లకును

మనుష్యులకును, రాక్షసులకును, ఆయాసాధనములతో పురనిర్మాణం బుల నొనర్చెను, విశ్వకర్మ సమస్త శిల్పముల నెఱిగినవాడై యుండెను. ఆవిశ్వకర్మవలననే చతుర్ముఖుండు జగంబును చక్కగ నేర్పరచెను, ఏ విశ్వకర్మ శిల్పంబులను దెలసి విధాతకు సాయంబొనరించి సకలలోక పూజ్యుండై ప్రసిద్ధిచెందెనో ? ఆవిశ్వకర్మ వంశమునందు జన్మించి యా మహనీయునివలె సమస్త శిల్పములందు సమానులై రథకారబ్రాహ్మణులు లోకవ్యాప్తి చెందిరి. తద్వంశజనితులగుటజేసియే యిప్పటివారును రథకార బ్రాహ్మణులైరి. సౌధన్యులు, ఋభువులు, సూరచక్షులు మొదలగువారు వేదప్రసిద్ధిగల రథకారబ్రాహ్మణులు వారలకు యజ్ఞాధికారంబు వేదంబుల యందు సిద్ధాంతమై యున్నది. ఇట్లుండ రథకారబ్రాహ్మణులు సంకరులని అమరుండు తజ్జాతివిరోధుండై తననిఘంటువునందు వ్రాయుటవలన అతని వేదవేదాంత పాండిత్యము బద్దలయ్యెను. కాని అందువలని ఏతద్బ్రాహ్మ ణుల వైదికాధికారమున కేకొఱంతయు వాటిల్లదు వేదవిధు లెఱుంగని వా రెట్లు వచించినను దానివలన హానికలుగ నేరదు. వేదవేత్తలట్లు పలుకుటకు పూనరు. "వర్షాసు రథకారః" అని రథకారబ్రాహ్మణుల కాధానవిధి వేదము నందే ప్రతిపాదింపబడి యున్నది. "ఋభూణాంత్వా దేవానాం వ్రతపతేనా దధామీతి రథకారస్య" అను దానిని ఋగ్వేదమున విశ్వకర్మ వంశపారం పర్యమును చూపుచుండుటచేతనే వారివైదికత్వము స్థిరమై యొప్పుచున్నది. త్వష్టదేవ పురోహితుడు ఆత్వష్టకుమారుడు విశ్వరూపుడు దేవపురోహితుడు అయి యుండగా జ్ఞానహస్త్య దొకానొకడు వచించినంతనే అది ప్రపంచ మంతటను వ్యాపింపగలుగునా? యజ్ఞమునందలి హవిర్భాగమును ఇంద్రుడే తక్షుడను పేరొక సామాన్య దేవశిల్పికికూడ హవ్యమును సంపూర్ణశ్రద్ధా భక్తులతో నిచ్చెను, మఱియు బృహస్పతికి తోబుట్టువగు యోగసిద్ధి. ఆమె భర్త విభావసుడు. ఆమె కుమారుడు విశ్వకర్మ బృహస్పతికి మేనల్లుడు. అతడు దేవతలకు శిల్పాచార్యుడై ప్రకాశించెను. ఆవిశ్వకర్మ ప్రజాపతి యయ్యెను. అతని పుత్రుడు త్వష్ట. ఆత్వష్టకు సుతుడు విశ్వరూపుడు వీరలు వంశపారంపర్యముగ పంచశిల్పవృత్తులను చేయ నారంభించిరి, విశ్వరూపా

చార్యుడును దేవగురువై యుండెను, ఋభువులు మొదలగు వారలెల్లరును విశ్వకర్మ సంతతియే అయియున్నారు. వేదమంత్రములలో యజుర్వేద బ్రాహ్మణమునందు "అంగిరసాంత్వా దేవానాం భృగూణాం త్వా దేవానాం" అనునట్లు "ఋభూణాం త్వా దేవానాం" అను మంత్రమున ఋభుబ్రాహ్మణులైన వీరందఱికిని యజ్ఞాదిసత్క్రియాధికారము వేదచోదితంబని సిద్ధాంతము. విశ్వకర్మ పరమేశ్వరుని ఆదిపురుషునిగా సర్వశక్తులు కలవానిగా నిరూపించినారు.

18) రథకారాధి కరణమున 44 వ సఘ్యము. అనకాపల్లి గ్రామ నిలయుడు. శ్రీవీరవల్లి శ్రీనివాసాచార్యులుగారు "అథరథకార బ్రాహ్మణానాం వైశ్వకర్మ శబ్దవ్యుత్పత్తి పూర్వకం వ్యాఖ్యాస్యామః, తద్యథా వైఖానసాదీనాం విఖనసాపత్యత్వేన వైఖానసత్వం, యథాయాజ్ఞవల్క్యస్యాపత్యత్వేన యాజ్ఞవల్క్యత్వం, ఏవమేవ రథకారబ్రాహ్మణాదీనామః విశ్వకర్మాపత్యత్వేన వైశ్వకర్మత్వం కించ. యథాయాజ్ఞవల్క్యాదీనామృషిత్వేన ప్రసిద్ధినామానో విఖనసాదయః, ఏవం రథకారాది పంచానామపి ఋషిత్వేన ప్రసిద్ధివిశ్వకర్మనామచ.

తా॥ పిమ్మట రథకారబ్రాహ్మణులయొక్క వైశ్వకర్మశబ్దవ్యుత్పత్తిని సదృష్టాంతముగ వచించెదము. వైఖానసాదులు విఖనస సంప్రదాయమగుటంజేసి వైఖానసులగుటయు. యాజ్ఞవల్క్యాదులు యాజ్ఞవల్క్యసంతానంబగుటవలన యాజ్ఞవల్క్యులనియు చెప్పుటవలన రథకారులును విశ్వకర్మసంతానంబగుటంజేసియే వైశ్వకర్మణులని ప్రసిద్ధము, మఱియు వైఖానసాదులకు ప్రసిద్ధినామంబు కలిగినటుల రథకారబ్రాహ్మణు లేగురికిని ఋషియగుటవలన విశ్వకర్మయును ప్రసిద్ధినామంబుగలవాడు. అనగా వృత్తిపర్యాయముగ రథకారులగు విబ్రాహ్మణ పంచకమునకు విశ్వకర్మ మూలపురుషుడని యెరుగదగినది. జగత్ శ్రేష్ఠయగు విశ్వకర్మ వంశమువారి పంచవృత్తులు శాశ్వతమై యుండగా ఏరేణువుమాదిరిగనోయున్న అమరుని చెప్పుకొనుట యెట్లున్నదనగా. గంధకమునకు పార్వతి నామమున్నంత

మాత్రమున అది పార్వతీదేవి యగునా? పార్వతీదేవిని తీసికొనివచ్చి గంధకమునతో పోల్చుట యెల్లనా? సంకీర్ణ సంకర జాతులకును, రథకారశబ్దమునకును సంబంధమేమి కలదని సిద్ధాంతకౌముదియందు శ్రీభట్టోజీ దీక్షితులు మహాపండితులు "రథకారో నామ బ్రాహ్మణః" ఇచట నామ అనుశబ్దము అవ్యయము. "హిమాలయోనామ నగాధిరాజః" అనగా హిమమునకు నివాసమై ప్రసిద్ధికెక్కిన పర్వతరాజమను యర్థము. ఉదాహరణమున "తంతువాయోనామ క్రిమిః" అనగా జాతియందు పురుగు తన వ్యాపారము తంతువాయని క్రమమును తెల్పుచున్నది, కనుక 'తంతువాయోనామ క్రిమిః' అని మహాపండితులు నిర్ణయించినారు, లోకవ్యవహారములో "మన్మథనామ సంవత్సరం" అనుట అనవసరమేకదా? మన్మథ సంవత్సరమనిన చాలదా? అనగా శాశ్వతప్రసిద్ధి కలదని గౌరవవాక్యము. వేదములు పురాణములు వ్యాకరణము కర్మములు ఎన్నియో కనుపించుచుండగా బౌద్ధమతస్థుడయ్యు బుద్ధిబలమును తగ్గించుకొనిన అమరుని శబ్దనిర్ణయమే వీధికి వచ్చి పెద్దలలో దూషింపజేసినది.

ఇట్టిస్థితిలో విజ్ఞానేశ్వరుడు తన జాతివివేకమను గ్రంథమున 'తస్య చోపనయనాది సర్వం కార్యంవదనాతి' అనియు, అతడే మరల బృహజ్జాతివివేకమున "నైవోపనయ నంతస్య శూద్రధర్మాబహిష్కృతః" అనియు యిటువైపుల లంచములు తిని తప్పురికార్డు సృష్టించుచు వచ్చుచున్న యధికారులవలె వ్రాసినందున ఆవిజ్ఞానము-వినతజ్ఞానమైనదని తెలియబడుచున్నది కనుక విశ్వబ్రాహ్మణులు బ్రహ్మ ముఖోద్భవులనుటకు పుష్కలమైన వేదపురాణేతిహాసాదుల వలన తెలియుచున్నది, కనుక సమస్త విధులును సంప్రదాయయుక్తముగనే వచ్చుచున్నవి.

19) ఇటుల రథకారబ్రాహ్మణులనియు, విశ్వబ్రాహ్మణులనియు, పాంచాలబ్రాహ్మణులనియు, ఐదువృత్తులుండుటచే ఒక్కొక్కరు ఒక్కొక్క

వృత్తినే ఆచరించుచున్నందున కమ్మరము, కంచరము-వడ్రము-కాసెము-స్వర్ణకారకము మున్నగుఉపనామములు కలిగినను ఈఅన్నిటికిని మూలము విశ్వబ్రాహ్మణపదమే: ఈవిశ్వబ్రాహ్మణ వాక్యముమధ్యమపదలోప సమాసములలో చేరినది. శాకపార్థివవత్. ''శాకప్రియపార్థివః'' అనురీతిగా (విశ్వకర్మ బ్రాహ్మణులను అర్థముగలది) సంస్కృతములో ఇట్టిపదములనేకములు కలవు. 'కాళిదాస' నామములను దిద్దింపగలమా? 'త్రియంబకం యజామహే' అను మంత్రమును సవరించగలమా ?

**20)** వీరిపంచవృత్తులు పంచబ్రహ్మల నాటినుండియును కలవు.

21) వీరికి దేవాలయాది ప్రతిష్ఠలయందును, యజ్ఞాదులలోను, ఇష్టకోపధానమందును, ఇతరమైన యేకార్యముల యందయినను, రాజ్యపరిపాలనా పట్టాభిషేకమందును, సత్కరింపవలసినట్లు శాస్త్రములు చెప్పుచున్నవి,

22) వాస్తుపూజయందు శ్లో॥ వాస్తుపూజా విహీనశ్చ సూత్రధారైర్వినాయది, సప్తజన్మాభవేత్సాక్షీ సకర్తా నరకం వ్రజేత్॥ అనియును

శ్లో॥ యఃపూజయేద్వాస్తు మనేనభక్త్యా, నతస్యదుఃఖం భవనీహకించిత్,
జీవత్యసౌ వర్ష శతంసుఖేన, స్వర్గేనర స్తిష్ఠతి కల్పమేతమ్॥ అనియును

శ్లో॥ వాస్తుపూజన సాహిత్యం స్వయంగృహ్ణాతి సర్వశః॥ అనియును మత్స్య పురాణమున చెప్పబడియున్నది.

''యజ్ఞకర్మణి యేవ్యగ్రాః పూరుషాం శిల్పినస్తథా,
తేషామపి విశేషేణ పూజా కార్యా యథా క్రమమ్॥

అని రామాయణమునందును విశ్వబ్రాహ్మణులకు విశేషగౌరవము చెప్పబడియున్నది,

ప్రాచీన రథకారాధికరణమున 46వ సభ్యుడు కొరంచేటి అర్కచయనులుగారి వ్యాఖ్యానము,

అటులయిచ్చు ఆదిత్యాది దేవతలయొక్క వస్త్రములు విచిత్ర రూపములన్ని యెరుంగుడు అనగా వర్షాకాలమునచేయు కృష్యాదులెవ్వి కలవో అవి యవి సంపూర్ణముగా ఫలించి రాబోవు వర్షాకాలమువరకు ప్రాణు లనుభవించుటకు సమృద్ధిగ నున్నయవి, అట్టిఫలము వర్షర్తుస్వాములగు ఆదిత్యాదిదేవతలచే ఒసగబడుచున్నది, అట్టి ఆదిత్యాదిదేవతలు విచిత్రవస్త్రములు ధరించిన వారని తాత్పర్యము, మఱియు ఈవర్షాకాలము రాగానే సకల ప్రాణులకును సంతోషము కలుగజేయుచున్నది. ఎట్లు అహా! దేవుడు మంచివర్షమును కురిపించెను. మనకు అన్నిపైరులు పండి లభించునని యెల్లవారికిని సంతోషము, ఈఋతువున సమస్త పదార్థములు ఏమియు బాధలేక శాంతములుగ నున్నవి. గాన ఈకాలముయొక్క ప్రసిద్ధి. కన్నులలోసకలపదార్థములును, ప్రజలెవ్వరైన ఈవర్షర్తువునందు క్షేత్రములయందు బీజావాపనముచేయక ఎడుచుచున్నవారేని ఆప్రజలందరు అఋతువునందు భ్రష్టులగుటయే కాక ఆసంవత్సరాంతమునకు భ్రష్టులగుదురు. రాబోవు వర్షర్తువు పర్యంతము అన్నాదులచే భ్రష్టులగుటయే యిందులకు కారణము. జనులీ ఋతువునందు క్షేత్రములలో విత్తనములు నాటి సంవత్సరాంతము సులభాన్నపరులై ప్రతిష్ఠితులగుచున్నారు. ఇట్లు వక్కాణించుటచే వర్షర్తువు అన్ని ఋతువులలో ప్రాముఖ్యంబని యెఱుగవలయును. ''వర్షాసురథకారోఽగ్నీ నాదధీత''అని ప్రత్యక్షముగా శ్రుతి వినబడుచున్నది. అందువలన రథకారబ్రాహ్మణుడు వర్షాకాలంబున జేయవలయును. మరియు శ్రీసూక్తమునను ''వర్షంతుతే విభావరి దివో అభస్యవిద్యుతః'' అని వర్షమునుగూర్చి తలంచుచు స్మరించుచున్నారు. ఇదియెంతయు ముమ్మాటికి సత్యము.

24) వీరికి గోత్ర ఋషులు ప్రవరలు మొదలగు సమస్తము విశ్వకర్మ పరమేశ్వరుడు మొదలుగా పారంపర్యము నేటికిని లభించుచునే యున్నవి. ఈపౌరుషేయ బ్రాహ్మణులను మిక్కిలి యధికులనియు, బ్రాహ్మణులనుటకు శ్రుతులును, స్కాందపురాణ నాగరఖండము, వైవస్వతమను పురాణము, పద్మపురాణము, విష్ణుపురాణము, భారత-భాగవత-

రామాయణ మూలస్తంభ-మయమతాగమ-అగ్నిపురాణ-మానసార, విశ్వ కర్మీయాద్యనేక గ్రంథములు చెప్పుచున్నవి.

25) కనుక పైనుదహరించిన శ్రుత్యాదులవల్లను-ధర్మశాస్త్రముల వల్లను-ఆర్షేయపౌరుషేయ బ్రాహ్మణులకు ప్రథమసత్కారమును చతుర్వర్ణములవారిచేత పొందవలసినదిగా కలిగి యున్నది. కాని వైశ్యుల కర్హత లేదు. ఇటులుండగా వైశ్యులు సకలధర్మములు తెలిసియును తమకు బ్రాహ్మణులకన్న ముందు సత్కారము చేయించుకొనుటకు ప్రయత్నించడము న్యాయమైనది కాదు. ఇందువలన బ్రాహ్మ్యాది చతుర్వర్ణముల వారికి శ్రుతపరముగా సేమనగా ఉభయబ్రాహ్మణ సత్కారానంతరము క్షత్రియ వైశ్యులను సత్కారించడము శాస్త్రవిహితమై యున్నది, కొంతమంది వైశ్యులను ప్రథమముండు సత్కరించి ఆవల విశ్వబ్రాహ్మణులను సత్కరించుటకు ప్రయత్నించిన యెడల ఆసత్కారము పొందని విశ్వబ్రాహ్మణులకు లోపము లేదుగాని, శాస్త్రవిరుద్ధమైన సత్కారము పొందినవారికే లోపముంటుంది ఇట్టి సత్కారమును జరిపినవారుకూడ ఆలోపములో భాగస్థులే, యగుదురు. కావున ఉభయబ్రాహ్మణ సత్కారానంతరము క్షత్రియులలో నగ్రగణ్యుని పిమ్మట వైశ్యులలో నగ్రగణ్యుని ఇట్లు పరిశీలించి సంఘమున కొక్క సత్కారము ప్రకారము జరుపుచుండుట న్యాయము. ఈసిద్ధాంతోపన్యాసము సభాసదులకు చదివి వినిపించి లోకమున ప్రకాశింపచేయడమయినది, సిద్ధాంతోపన్యాసము పూర్తిచేయడమైనది.

శ్రీ విరాడ్విశ్వకర్మ పరబ్రహ్మణేనమః

సర్వప్రాణినాం సుఖజీవనమస్తు

శాంతిరస్తు

* *
*

అల్ ఫ్రెడ్ ఎడ్వర్డు. రాబర్టు దొరవారిచే వ్రాయబడిన "విశ్వకర్మయు ఆయనసంతతి" అను చరిత్రియందు తెలియబడుచున్న విషయముల నిటరూపించుచున్నాము. మొదటిప్రకరణము 3వ పేజి (భూగర్భము నుండి త్రవ్వి యెత్తబడిన శిధిలీభూతవస్తు విశేషములను పరీక్షించుటవలన కల్గిన భూగర్భశాస్త్ర సాక్ష్యము పరిణామమును దానితో పోల్చబడినప్పుడు సాధారణ చరిత్రకాల పరిణామ మద్దానిలో నిమేషమాత్రముగ గన్పట్టు నంత ప్రాచీనకాలమునకు గొంపోవుచున్నది. భూమిపై మానవుని ప్రథమ దర్శన కాలమెంత ప్రాచీనమైనను మానవజాతి వారు చారిత్రక వృత్తాంతముల నలంకరించు సమయమున మధ్యేషియా మెట్టప్రదేశములందు నివసించియుండిరి. చరిత్రమునంద దంతకాలమున రెంటువస్తువుల గూర్చుట యను అర్థమిచ్చు అర్. అను సంస్కృతమునుండి కలిగిన ఆర్యనామమున నొప్పుచు చివర కార్యావర్తమున నిలిచిన వీరికముందు స్పష్టమగురీతిని విశ్వబ్రహ్మ, లేక విశ్వకర్మర, కుల జనకుడగు విశ్వకర్మయొక్క సంతతీయులేకాని అన్యులుకారు.

మానవుని ఆర్యకుటుంబ ప్రాచీనవంశముయొక్క యాదిమవాసమునైన పరీక్షించుటయం దింతవరకు కృతార్థుడైన మానవుడు కానరాడు. పరిషియా (పారసీక) దేశమునందలి యైరావణలోయయే యీమహాకుటుంబములయొక్క యాదిమావాసమన్న మాక్సుమల్లరు వాదమాఘనత రైరోపా యొక్క అర్వాతనతి నిపుణతతో బయటికి గొనివచ్చిన వారలకు పూర్తిగ భ్రాంగిపోయినది. యూరపియను పరిశోధనలుచూసి వెదకినంతవరకు ఆర్య పిండము గర్భము ధరించిన ఆదిమోరాంగ్ మధ్యేషియా యందలి యుష్ణ మండల సంవాసియని తేలినది. ఈ నివాసయోగ్యమౌ గోళమున తమ ప్రథమ ప్రవేశానంతరమున ఎన్నిశతాబ్దములకు ఆర్య లీనిజాధివాసము నుండిరో గణింప నసాధ్యము. ప్రథమార్య పూర్వీకుని జననమాదిగ కడపట నాతని శిశువులు నిజస్థానమునుండి దేశత్యాగమొనర్చు వరకు అసంఖ్యాకములగు యుగములు గడచెననుట నిస్సంశయము. తాము దశదిశలకు

చెదరిపోవు నప్పటికి వా రతినాగరికత నొంది యుండిరనుటగూడ నిశ్చయమే. ఏభయంకర మహోపద్రవ మపార్యమగు నేఘోరకారణము వారిని మధ్యేషియా పీఠభూమియందలి తమ మనోహర నివాసములను వీడి క్రొత్తనివాసముల వెదకికొన నెన్నడు నెరుంగని వింతదేశములందు విపరీత శీతోష్ణముల ననుభవింప వలసపోవ నిర్బంధము కలిగెనో మనకు తెలియదు, చరిత్ర కెంత మాత్రము నిశ్చయముకాని యేభయంకరోపద్రవమో? ఈ ఘోరకారణమై యుండును.

ఆ నివాసవిధ్వంసమును-వారు స్వగృహములనుండి చెల్లాచెదరగుటయు క్రీస్తుశకమునకు పూర్వము పదునైదు శతాబ్దములనాడు జరిగినట్లూహించుచున్నారు. కాని యిది యూహామాత్రమే. ఈసంగతి చెప్పరానంత ప్రాచీనమైనది, ఈచెదరి పోపుట ప్రజల నకస్మాత్తుగ చుట్టపెట్టి పట్టి ప్రాణసంరక్షణార్థము హుటాహుటిగా పారిపోవజేసిన యేదోయొక ఆకస్మికోపద్రవముయొక్క భయంకర పర్యవసానముగ ఏదోయొక అనపేక్షిత కంపమువలన సంభవించినదిగా సూచించు నెల్ల చిన్నెలతో కనుపట్టుచున్నది

ఈమహాకంప ముదయించినప్పటికి వారు చాల నాగరికతతో నొప్పుచుండిరి. పారిపోవు ఈవలసమూకలం దొక తరంగము పశ్చిమదేశములం జొచ్చి యూరపునందలి హెల్లాసు-లేక గ్రీకుదేశమున స్థిరపడిరి. యూరపియను నాగరకతాప్రేరణము మొట్టమొదట బడసినది. గ్రీసుదేశమే:పడమర దేశము పోవుచు ఈవిద్యుదాఘాతము. రోము, స్పెయిను, ఫ్రాన్సు దేశములపై గర్జించెనుగాని, స్వాతంత్ర్య సామ్రాజ్యము జగదీర్ష్యాశయమునగు ఇంగ్లండుకంటె ప్రపంచమున ఏదేశమునకు ఈవిద్యుద్ఘాత మెక్కువ తీవ్రపుటదటు నొసంగిగాని, చైతన్యమిచ్చికాని, యుండలేదు.

చెన్నపురి వాస్తవ్యులగు డాక్టరు ఫలనియాగా రిట్లు వ్రాయుచున్నారు, హెలెనీఫనంఫలని మన పూర్వులశాఖ వాస్తుశాస్త్రమందును, శిల్పమందును, శిల్పసౌందర్యాభిమానులలో అత్యంత పరిపూర్ణత్వమున ఇంత

వఱకు అసదృశమైనిల్చునంత ప్రాశస్త్య మేతీరున సంపాదించెనో? అట్లే హిందూదేశమున ప్రవేశించిన మన పూర్వుల యీశాఖవాస్తు శిల్పములందు రీతి వేరైనను దానితో సమప్రఖ్యాతి నార్జించెను. రాజేంద్రలాల్ మిత్రుడు తన ఇండోఆర్యన్ (హిందూఆర్య) అను సుప్రసిద్ధగ్రంథమున ఇట్లు వచించుచున్నాడు. హిందూదేశమునకు వచ్చిన యార్యులు-తమ గ్రీకుసోదరులకుగల యట్టిమేధాశక్తినే కలిగియుండిరి, స్వీకృతదేశమున వారద్దానినెట్లుపయోగించిరో? చూడవలసి యున్నది. అశోకమహారాజునకు చాలకాలము పూర్వమే హింద్వార్యులు శిలలతోనిర్మించుట బాగుగా నెఱింగియుండిరని ఆమహారాజుయొక్క శిలాస్తంభములపై రమణీయతమముగ చాతుర్యముగ చెక్కబడి చెన్నారు చెక్కడములే నిర్వివాదముగ స్థాపించుచున్నది,

దివ్యసౌందర్య నిర్మాణమున ప్రతిమలయభిరుచి ప్రదర్శనమునే యీారపు శిలాశిల్ప కళాతాత్పర్యము. మెడిసిసుయొక్క వీనసుప్రాగ్జిటెలిసుయొక్క యఫ్రొడైటు మైలోయొక్క వీనసుఅను విగ్రహములిందులకుదాహరణములు. ప్రాగ్జిటెలినుండను శిల్పి నిర్మించిన యఫ్రొడైట్ దేవతా విగ్రహము ప్రాచీన విగ్రహము లన్నిటిలో అతిప్రఖ్యాతి గాంచెను. ప్రాచీనులగు చీడియ లద్దానిని అమహాశిల్పాచార్యుని యొద్ద కొనిరి, ఆదేశస్థులు బిథినియా దేశరాజగు నికామెడిసుండు వారిదేశీయ ఋణమును ఆవిగ్రహమూల్యముగా ఇచ్చివేయుదని చెప్పినను, ఈయద్భుత శిల్పనిర్మాణమును, విడువనొల్లరైరి. తరువాత యీవిగ్రహమును కన్‌స్టాంటినోపిలునకు మార్చగా అచట నది జస్టినియనుని పాలనమున క్రీ. శ. 80 సంవత్సర కాలమున కల్గిన మహాగ్నిజ్వాలలోబడి నశించెను. అమూల్యమగు వస్తువున కెట్టి విచారక రావసానము? గ్రీకు విలాసిని (స్వైరిణి) చరిత్రమున కెఱుగబడిన మహాసౌందర్యవతి శిరోరత్నమగు ఫెరినియొక్క దివ్యసుందరాకృతిని అనుసరించి నిర్మింపబడినది, ఫ్రీనియను ప్రభుత్వము వారామెపై తన జారత్వమునకు వ్యాజ్యము తెచ్చిరి. ప్రవక్తయగు హైపెరియడీసు డామెపక్షమున వాదింపబూనుకొనెను. న్యాయవాదు లామెను విచారింప నా

సీనులై యుండిరి. అప్పుడు హైపెరియడీసుడామె పక్షమున నొక్కటియొక్కే ప్రతివాదము. నన్ను రక్షింపుడని వేడెను. ఫెరినుడామెను నీమొలపై నున్న వస్త్రమును తీసివేయు మనెను, ఆమె తీసివేసినంతనే సభ మొత్తము ఆమె వైపుననే చూచుచుండిరి. ఆలాయరు అధికారితో ఆమె వైపు చూచుచున్న వారిని వారింపుమనెను, ఆ న్యాయమూర్తులకు నేత్రపర్వ మొనర్చిన ఆ యద్భుత రూపరేఖా విలాసములతో మోహవిభ్రాంతికములై యుండుటచే వారామెను వెంటనే నిర్దోషియనివిడుదలచేసిరి. అప్పుడప్పు డేయేథిన్సునందలి యువకులెల్లరుగూడి యామెకు గౌరవచిహ్నముగ అతివ్యయమొనర్చి ఇతర మానవ జీవితము నెన్నడు నొందని కృతార్థతనొంది యుండని మహాగౌరవమును నిర్మలమగు సువర్ణమయ విగ్రహమును నిర్మించిరి. ఏమి సౌందర్యము? నీతి బాహ్యతచే ఆవరింపబడియుండియు లోకమున నెల్లరు దన పదములకడ వ్రాలజేసి మ్రొక్కించుకొన సమర్థముగదా ?

క్రీ, శ. 1884 నవంబరు 21 కాడ్వాల్డరు వాడిబారిష్టరు. మెద్రాస్ మెయిల్లునందు విశ్వకర్మ వర్ణమునుగూర్చి మాట్లాడుచు ఇట్లు వ్రాసెను. శిల్ప మీ రాష్ట్రమున రెండువేల సంవత్సరముల నాటిది. తచ్చిహ్నములు కొన్ని దేవాలయములపై చెక్కబడి యున్నవి. ఈజాతి ఖచితమైన బ్రాహ్మణవర్ణము. స్వతంత్ర పరిశ్రమచేసిన డాక్టరు ఎం. ఎ. సి. బర్నలు గారు ప్రస్తుతము తంజావూరు బృహద్గ్రంథాలయము నందున్న మూల స్తంభమను గ్రంథముయొక్క అతిప్రాచీన ప్రతినొక దాని నుదహరించుచు ఇట్లు చెప్పుచున్నాడు, ఇది యీశ్వర షణ్ముఖసంవాదమై అయిదు శాఖల శిల్పులయొక్క వేదములను చెప్పచు ఐదు వేదముల నామములను చెప్పి యిప్పుడు విప్రులు చెప్పుచున్నవి సరియైనవి కావని చెప్పబడుచున్నవి. పూజ్యులగు జె. యి. వాడ్ఫీల్డను మఱియొక పండితుడు క్రిష్టియన్ కాలేజీ మాగ్జైన్ 3 వ సంపుటము 28½ పుట. యందిట్లు వ్రాయుచున్నాడు. తమయం దనేకులు, కజ్జ, ఇత్తడి, రాగి పనులు చేయువారుగనున్న స్వర్ణకారకులస్థులు తమకు తామే వేదములయందు తమ కధికారము కలిగి తమ

కర్మకాండయే కలిగిన యొకతెగ బ్రాహ్మణులుగ నున్నారు. హంటరు తన హిందూదేశచరిత్రమున ఆర్యానాగరకతను గూర్చి చెప్పుచు ఇట్లు వ్రాయుచున్నారు. వేదములయందు పేర్కొనబడిన ఆర్యజాతు లనేక లోహముల నెఱిగియుండిరి, వారిలో ధారుకారులు, ఇతర శిల్పులేకాక లోహకారులు తామ్రకారులు స్వర్ణకారులుకూడ నుండిరి. హైందవప్రామాణికులయందు రాజేంద్రలాల్ మిత్రుడు తన ఇండో ఆర్యన్ (హిందూ ఆర్య) యందీయభిప్రాయమును గట్టిగ బలపరచియుండెను. ఈయుదాహరణముల మొత్తపుబలమున ఈవిశ్వకర్మ వంశజులు నిశ్శంకిత బ్రహ్మాత్మ కలిగి వేదములయందు పేర్కొనబడిన బ్రాహ్మణులే యై యుండుటచే వారే స్వచ్ఛమైన ఆదిమ బ్రాహ్మణులని స్థిరపడుచున్నది, బ్రహ్మస్థానమునకు విశ్వబ్రాహ్మణులకుగల అధికారములను తమకు తామే తమపారంపర్యముగ ననుభవించుచున్నారు. హిందూదేశ బ్రాహ్మణులకును సింహళదేశ బ్రాహ్మణులకునుగల యున్నతస్థానము ఆధునిక బ్రాహ్మణులకును గోపీలకును కదల్పశక్యముకానంత దృఢముగా స్థాపించిన పవిత్రశాస్త్రముల అపృచ్ఛనీయాధికారముల ముందీ స్వతంత్ర పండితుల ప్రమాణములుకూడ వెలవెలబోవుచున్నవి.

"20వ పేజి 5 వ ప్రకరణమున" ఇట్లున్నది. మహాసమ్మతుడను రాజు సూర్యవంశీయుడను ప్రసిద్ధియుండెను. అనగా సూర్యుడు విశ్వకర్మకుమారులు అయిదుగురిలో నొకడగు విశ్వజ్ఞుడను బ్రహ్మయే మహంతీనగరమునగల విశ్వబ్రాహ్మణులు స్వచ్ఛమైన బ్రాహ్మణులు. ఆమహంతీనగరమేమందోటి నగరమని వికృతిచెందినది. వ్యాసుడను ఒక దుర్మార్గుడు తన అసూయాబుద్ధితో కుట్రపన్ని ఆపట్టణమును ధ్వంసముచేయించెను. "మందోటీనార్ధరన్ ప్రావిన్సు (ఉత్తరరాష్ట్రము) నందలి స్వాకు 13 మైళ్ళదూరమున కొలంబోనుండి జఫ్నాకుబోవు ప్రధాన మార్గమున నున్న గ్రామము దానికి తూర్పున కొలది దూరమున నున్న పురాతన గ్రామ జీర్ణశేషము లొక స్వర్ణకారసంఘ వాసస్థలమని యైతిహ్య గాధకలదు. మహంతీనగరము

క్రీ. పూ. 600 ఏండ్లనాటి కథ. అయస్కాంత దుర్గసహితమగు ఆపట్టణ మును పాలించుచున్న రాష్ట్రరాజశేఖరులందు వసించియుండిరి. వేదవ్యాసు డనబడు శూద్రికుల సంభూత కృష్ణద్వైపాయన వ్యాసుడు పౌరులందు కలతలు కల్పించి ధర్త్మలహారి రాజును ఆపట్టణముపై నుసికొల్పి యా పట్టణమును ముట్టడింపజేసి దానిని తగులబెట్టించెను. "సిలన్ గజటీర్"అను సింహాళస్థల నిఘంటువు నందీవిషయము 158 పుటయందు కలదు, విశ్వ బ్రాహ్మణులు ముప్పతిప్పలతో నుండగా ధరణిమహారాజను వాడా గ్రామ మును ఆక్రమించుకొని యుండుట చూచి దేశాయి పెద్దన్నగారు దుష్టు లను పారదోలి యాప్రదేశము నటులేయుంచెను.

## కాష్టవాహనరాజు

బోధిరాజను ఒకరాజుయొక్క ప్రధాన పట్టణమునకు కోకనద పట్టణ మని పేరుపెట్టి నిర్మించినవాడు కాష్ఠవాహనుడు. అట్టి రహస్యాత్మక మైన పట్టణము పూర్తికాగానే ఆరాజు దుర్బుద్ధికలవాడై ఆశిల్పాచార్యుని తన పట్టణమునుండి వెడలగొట్టెను. అనగా అతని రహస్యములు శిల్పా చార్యునిద్వారా శత్రువులు కొందురేమో? అని సందేహము నొక సాకుగా లోకమునకు చూపి, అట్టి దుర్మార్గమునకు పూనెను,ఆ శిల్పాచార్యుడా ప్రదేశమునుండి హిమాలయము చెంతకుబోయి హిమాలయమున నొక పట్టణమును నిర్మించుకొని యచటనుండి ఆప్రదేశమును కొంత ఆక్రమించు కొని పరిపాలనము చేయుచు కాష్టవాహన మహారా జనిపించుకొనెను. ఆ పట్టణముకూడ గోడలు లేకుండ దారువులతో నిర్మాణము చేసియుండుటచే అది కాష్టమందిరమని వాడుక జెందెను.

## పట్టాభిషేకమున వైశ్వకర్మణుల ప్రత్యేకాధికారము

పవిత్రాశ్వత్థ వృక్షశాఖను సింహాళమునకు గొనిపోవు రాజకుమారి సంఘమిత్త వెంట జన్న యెనమండ్రు వైశ్వకర్మణ రడలాలను దేవనంప్రి యతీశ నృపు డసామాన్య గౌరవమును నాదరించె. శ్రీసంగనరాజునకు పట్టా భిషేక మొనర్చిన పండితకుల విశ్వశేఖరు డారడలాలం దొకని సంతతీ

యుడు సంకర వివాహములచే సంతానాభివృద్ధి గాంచ నొల్లకుండుట యీ గొప్ప కుటుంబముల ప్రత్యేక స్వభావము. వారు సింహళ ప్రజలం దితరులలో మిశ్రమగుటకు నిరాకరించు ప్రత్యేక భాగముగా నుండిరి, ఈసాంఘిక విశేషము సింహళమందలి వైశ్వకర్మణ ఘనకుటుంబము లందెంతయును కనుపించును, మహోలుప్రక్రమ బాహురాజు పట్టాభిషిక్తుడు గాదలంచినప్పటికి ఆయెనమంత్రుడుతరచ్చా రడలాల వంశములు ఇంచుమించుగా నశించి ఆవంశక్రమమున కడపటిది యగు సప్తవర్ష ప్రాయముగల యొకబాలిక మాత్రము మిగిలియుండెను. రాజామెను తన నగరునసే పెంచి తుదకు వివాహమాడి ఆమె వలన అహోపండితుడను నొక పుత్రుని బడసె, ఈతడే పిదప రాజగు తన తండ్రి మస్తకమున మకుటముంచె. తరువాత చరిత్రము నందీతడు పండిత నీలముడన బడగె.

సింహళదేశ పండితరాజగు ఘనత గాంచిన ప్రక్రమబాహుడు పండిత రాజశేఖరునిచే పట్టాభిషిక్తుడయ్యె. ఈతడు పైన పేర్కొనబడిన పండిత నీలముని వంశమున జనించె, అతడు గావించిన యుపకారముల యెడల కృతజ్ఞుడై రాజాతని కెనిమిది గ్రామములనిచ్చి బహూకరించె. పండిత ప్రక్రమబాహుడు తమ పట్టాభిషిక్తు గావించిన యాచార్యునకు తన పేరిట ప్రక్రమాచారి యను నామమొసగె. పెరదేనియలో పాలించిన విక్రమబాహు రాజు కొత్తాయందలి నల్వురు వైశ్వకర్మణ పండితులచే పట్టాభిషిక్తుడయ్యె. పట్టాభిషేకానంతర మాభూపాలుడు ఒక్కొక్కరికి ఒక్కొక్క గ్రామమును మాన్యముగా నిచ్చెను.

(6వ ప్రకరణము 22 పుట) వ్యాసుడు వైశ్వకర్మణుల (విశ్వబ్రాహ్మణుల) మతాధికారమునకు భంగమొనర్చుట.

వైశ్వకర్మణుల రాజకీయాధికార విధ్వంసమందు కృతకృత్యుడై యిక నీఋషియే తన్మతాధికారమునుగూడ నడుగంట చేయబూనె. స్వచ్ఛమైన ఆదిమబ్రాహ్మణులగు విశ్వబ్రాహ్మణులే జంబూద్వీపమున పాలించి

సర్వరాజకుటుంబములకును, మతగురువులై యుండిరి. ఇట్టి ప్రబలస్థితినుండి వారిని తరిమివేయ వ్యాసుడు తన తంత్రజాలమును పన్నజొచ్చె. సోరీన్ పరిమళరాజు (పరిమళచోళుడు) కాలమున వ్యాసుడు స్వర్ణకారులను తప్పించి తన్ను తన కుటుంబమును రాజకుటుంబపు టాచార్య పీఠమున ప్రతిష్ఠింపుమని యారాజును ప్రేరేపించెను, పాప మీప్రార్థన కఠినముగా నిరాకరింపబడె. ఇంతలో రాజు మృతినొందగా నతని తమ్ముడు షణ్ముఖ చోళుడు సింహాసన మధిష్ఠించె. వ్యాసుడీ నూతన రాజుకడకేగి మునుపటి వలె ప్రార్థించి మరల పరాజితుడయ్యె, కాని యీతిరస్కారమును పట్టుదలతో రెచ్చజేసి మరల ప్రయత్నమునకు పురికొల్పెను. పరిమళచోళుడను రాజుకు ఒక లంజ యుండెను. అద్దాని కొడుకు కళింగుడను పేరుతో బిలువబడుచుండెను. ఆతడు పరమ దుర్మార్గుడు. పూర్వప్రతిజ్ఞతో ఒట్టు పెట్టుకొని ఆసగొల్పబడిన కళింగుడు పదంపడి కావించిన మహాఘోరపాతకమునుబట్టి చూడ వ్యాసుడును దుష్టత్వమున నాతనికి అణుమాత్రము తీసిపోని వాడు గాడనుట స్పష్టము, వ్యాసుడీ కళింగునిజేరి తన్నును తన కుటుంబమును రాజు గృహాచార్య పీఠముననుంప నొప్పుకున్నయెడల అపుడు పాలించుచున్న చక్రవర్తిని చంపి, సింహాసన మాక్రమింప నాతనికి తోడ్పడుదు నని ప్రతినసల్పె. ఇందు వ్యాసుడు సంపూర్ణముగ కృతార్థుడయ్యె. వ్యాస సహాయమున కళింగుడు పినతండ్రిని చంపి గద్దెనెక్కెను. బాలరాజు వైశ్వకర్మణులచే నెల్లయెడల మతగురువులుగా నంగీకరింప బడుటచే వారి కపకృతి నెంచకయే వ్యాసునికి తానొసర్చిన యుపకారమునకు వాగ్దానము చెల్లించుకొన నెంచె. పవిత్ర గౌరవముల నిరువాగుల వారికిని పంచిపెట్టుటతో నిరువురిని సమాధాన పఱచజూచె. కాని యాత డిసుమంతయు సనుమానింపని ప్రాంతము నుండియే ప్రతిఘటన ముత్పన్నమయ్యె. వైశ్వకర్మణు లీకోర్కెను అత్యాగ్రహమున తృణీకరించిరి. కళింగుడును కుపితుడై ఆగౌరవస్థానమును వ్యాసునకు అతని కుటుంబమునకు నొసంగె. ఇది అత్యంత విషమ పర్యవసానముగా పరిణమించె. విశ్వబ్రాహ్మణు

లిక మతసంస్కారము లను సలుపకుండుటచే ప్రజలు వ్యవసాయాదుల నుల్లంఘించిరి. వ్యాసుడును ఇందులకు తగినవాడే. రాజుచే తనను చేరిన వారెల్ల కుడిచేతి వారనియు, కడమ వారెల్ల ఎడమ చేతివారనియు, చాటింప జేసె, చెన్నరాజధాని యందలి సాంఘిక పరివర్తన నారంభమిట్టిది. ఇప్పటి నుండి విశ్వబ్రహ్మ లేక స్వర్ణకారకులస్థుల-పరిచ్యుతియు-తదితర జాతుల యభివృద్ధియు, ప్రారంభమయ్యె.

(7 వ ప్రకరణము-23వ పుట)

చెన్నరాష్ట్రీయ వైశ్వకర్మణులు

గతానేక శతాబ్దముల నుండి చెన్నరాష్ట్ర విశ్వబ్రాహ్మణులు హిందూ సంఘమున ఆధిపత్యమునకై యిప్పుడు బ్రాహ్మణులన బరగుచున్న వారితో ఘనతమీర హోరాహోరీ పోరుసల్పిరి, వారి సంగరము లన్నియు ప్రస్తుత గోబ్రాహ్మణులతోనే, హంటర ద్దానిని గట్టిగ బలపరచుచు ఇట్లు చెప్పు చున్నాడు. స్వర్ణకారులు బ్రాహ్మణాధికారము నతితీవ్రముగ నిరోధించి పవిత్రసూత్ర యజ్ఞోపవీతధారులై మతోపదేశ కాచార్యాది నామములతో వ్యవహరించుచు పారమార్థిక మార్గదర్శకులు తామేయని తరతరములనుండి వాదించుచుండిరి. ఇరుపక్షములకునుగల యీస్థిరరూపము దాల్చిన స్పర్థ వలన పెక్కుతగవు లుద్భవింప పలుమాఱులు న్యాయస్థాన మధ్యవర్తి త్వ మవశ్యమయ్యె.

ఇందు మొదటి వ్యాజ్యెమగు నెం. 18-1894 సం॥ మచిలీపట్టణ అసిస్టెంటు మేజస్ట్రేటుగారి కోర్టున కరిగెను. ఫిర్యాది ప్రభుత్వమువారు ఎదిరి శివకోటి వీరభద్రుడు. ఇన్‌డిక్టిమెంటు (దోషారోపణము) నందారో పింపబడిన యపరాధ మేమనగా ఒకతెగవారిచే పవిత్రమైనదిగ చూడబడిన యొకవస్తువును వారిమతము నవమానించు నుద్దేశముతోగాని, ఆ మను ష్యులు తమ మతమున కది నిందగా పరిగణింప వచ్చునని, తా నెఱింగి యుండిగాని, మైలపఱచుట (అపవిత్రము చేయుట) మూలమున ఇంది

యన్ పీనల్‌కోడ్డు సెక్షన్ 295 ప్రకారము శిక్షింపదగిన నేరము చేయుట అభిప్రాయము, నిరపరాధియని తీర్పు. ఈరీతిగా నున్నది. ఈ వ్యాజ్యము ప్రథమమున బందరు స్టేషనరీ మేజస్ట్రీటువారిచే గైకొనబడినది. కాని యెదిరి తరపు న్యాయవాది ప్రార్థనపై దానిని డిస్ట్రిక్టు మేజస్ట్రీటుగారు నా యొద్దకు మార్చిరి. కులముచే స్వర్ణకారుడైన యెదిరి గడచిన మహాశివ రాత్రి నాటి రాత్రి రుస్తుంబాదా మచిలీపట్టణమున నున్న కాశీవిశ్వేశ్వర స్వామి యొక్క ఆలయమున చొచ్చి నారికేళజలమును లింగముపై ప్రోక్షించుట, మూలమున అభిషేకక్రియ నాచరించినాడనియు, అందుచే బ్రాహ్మణులు తమ మతమును నిందింప పఱుపబడెననియు, లింగము మైల పరుపబడినదనియు, సంప్రోక్షణ (పరిశుద్ధము) చేయుట అవశ్యమనియు నెంచి రన్నదే యాఫిర్యాదు.

1885 సం॥ నెం. 421-422 క్రిమినల్ రివిజన్ కేసులలో తీర్పు చెప్పిన ఇరువురు పండిత న్యాయమూర్తులు భిన్నాభిప్రాయులై యుండిరి, కాని యీ విషయము సంపూర్ణ న్యాయపీఠము, యెదుట పెట్టబడి యుండక పోవుటచే ప్రామాణ్యములగు తీర్పు లోపముగ నున్నది, కావున సెక్షన్ 295 భిన్న మతావలంబులే యందేకాని కులవైషమ్యావేశితులగు భిన్నవర్ణ స్థుల యందు వర్తింపదనుటకు తగిన కారణములు లేవు. అన్న భిన్నాభిప్రా యులైన విద్వాన్ న్యాయమూర్తిగారి విముఖాభిప్రాయమునెడ గౌరవము చూపుచు "మైలపరచుట" యను మాట తొలుతటి యర్థమును కోల్పోయి యితరస్థలములందు వలెనే, యిచటను "ఆచార కర్మప్రకారము మైలపఱ చుట" అని గ్రహించవలెనన్న జస్టిస్ ముత్తుస్వామి అయ్యరుగారి యభి ప్రాయమును స్వేచ్ఛగ ననుసరింప వచ్చునని తలంచితిని. నెం. 295-298 లో నేర్పఱచుటయందు బొమ్మపోరాటములందు పరిణమింపగల సర్వకాల ముల నణగద్రొక్కుటే శాసన నిర్మాతగారి ముఖ్యోద్దేశము. ఈపురము నందే తమ యధికార స్వాతంత్ర్యములను సంరక్షించుకొన ప్రయత్నించు చున్న కోమట్ల (వైశ్యుల) కును, బ్రాహ్మణులకును, కల బలవన్మత ద్వేష

యన్ పీనల్‌కోడ్డు సెక్షన్ 295 ప్రకారము శిక్షింపదగిన నేరము చేయుట అభిప్రాయము, నిరపరాధియని తీర్పు. ఈరీతిగా నున్నది. ఈ వ్యాజ్యము ప్రథమమున బందరు స్టేషనరీ మేజస్ట్రీటువారిచే గైకొనబడినది. కాని యెదిరి తరపు న్యాయవాది ప్రార్థనపై దానిని డిస్ట్రిక్టు మేజస్ట్రీటుగారు నా యొద్దకు మార్చిరి. కులముచే స్వర్ణకారుడైన యెదిరి గడచిన మహాశివ రాత్రి నాటి రాత్రి రుస్తుంబాదా మచిలీపట్టణమున నున్న కాశీవిశ్వేశ్వర స్వామి యొక్క ఆలయమున చొచ్చి నారికేళజలమును లింగముపై ప్రోక్షించుట, మూలమున అభిషేకక్రియ నాచరించినాడనియు, అందుచే బ్రాహ్మణులు తమ మతమును నిందింప పఱుపబడెననియు, లింగము మైల పరుపబడినదనియు, సంప్రోక్షణ (పరిశుద్ధము) చేయుట అవశ్యమనియు నెంచి రన్నదే యాఫిర్యాదు.

1885 సం॥ నెం. 421-422 క్రిమినల్ రివిజన్ కేసులలో తీర్పు చెప్పిన ఇరువురు పండిత న్యాయమూర్తులు భిన్నాభిప్రాయులై యుండిరి, కాని యీ విషయము సంపూర్ణ న్యాయపీఠము, నెదుట పెట్టబడి యుండక పోవుటచే ప్రామాణ్యములగు తీర్పు లోపముగ నున్నది, కావున సెక్షన్ 295 భిన్న మతావలంబులే యందేకాని కులవైషమ్యావేశితులగు భిన్నవర్ణ స్థుల యందు వర్తింపదనుటకు తగిన కారణములు లేవు. అన్న భిన్నాభిప్రా యులైన విద్వాన్ న్యాయమూర్తిగారి విముఖాభిప్రాయమునెడ గౌరవము చూపుచు "మైలపరచుట" యను మాట తొలుతటి యర్థమును కోల్పోయి యితరస్థలములందు వలెనే, యిచటను "ఆచార కర్మప్రకారము మైలపఱ చుట'' అని గ్రహించవలెనన్న జస్టిస్ ముత్తుస్వామి అయ్యరుగారి యభి ప్రాయమును స్వేచ్ఛగ ననుసరింప వచ్చునని తలంచితిని. నెం. 295-298 లో నేర్పఱచుటయందు బొమ్మిపోరాటములందు పరిణమింపగల సర్వకాల ముల నణగద్రొక్కుటే శాసన నిర్మాతగారి ముఖ్యోద్దేశము. ఈపురము నందే తమ యధికార స్వాతంత్ర్యములను సంరక్షించుకొన ప్రయత్నించు చున్న కోమట్ల (వైశ్యుల) కును, బ్రాహ్మణులకును, కల బలవన్మత ద్వేష

మగుటచే నిచట విచారింప నక్కఱలేదు. మీదు మిక్కిలి యాతడు బ్రాహ్మ ణుల నవమానింపనెంచి యున్నయెడల తన యుద్దేశమును సంపూర్ణముగ స్పష్టపఱచియే యుండును. నిజముగ నాత డభిషేకము చేయుచున్న సమయమున ఇద్దరు బ్రాహ్మణులు చెంతనే నిలువంబడి యుండిరి, అతడు స్వర్ణకారుడైనట్లు తమకు తెలియదని వారు చెప్పిరి. వా రాతడు బ్రాహ్మణుడే అనుకొనిరి, వివక్షించు సాధనము కేమియులేవు. అర్చకు డతనిని స్వయముగ నెఱుగక పోయిన యెడల ఆతడు పూజావిధి గావించుకొనిన తరువాత ఈసంగతి యెవరికి నెఱుగబడక చల్లగ వెడలి యుండెడివాడు. పైగా ముద్దాయి తాను కులముచే విశ్వబ్రాహ్మణుడనియు వృత్తిచే అగసాల యనియు, చెప్పుచు కొంతమంది విశ్వబ్రాహ్మణుల రావింప వారెల్ల బ్రహ్మత్వముగలదనియు అభిషేకముతో సహితము బ్రాహ్మణకర్మ లన్నియును చేసికొన వచ్చుననియును, చెప్పిరి నాకీ విషయమును నిర్ణయింప నధికారము లేదు. ఇది రెండుపక్షముల వారికిగూడ తెలిసియే యుండవలెను. ఈ విషయమును తీర్చుట మతసభయొక్క కర్తవ్యము. ఐనను వీరి (ముద్దాయి తరపువారి) పోరు తప్పక యధార్థమైనదే యని నేను నిశ్చయించుచున్నాను. వారు తాము పరిపూర్ణముగ నమ్ముచున్నట్లు కానిపించు ననేక ప్రమాణ గ్రంథములను, అనేక ఐతిహ్యములను, ఎదుట బెట్టిరి. ఇంతేకాక కొన్ని సంవత్సరముల క్రిందట ఈపురమునందే అందు ముఖ్యవిశేషముగ పలుకుబడిగల యొక బ్రాహ్మణుని అధ్యక్షత క్రిందను జరిగి, విశ్వబ్రాహ్మణుల బ్రాహ్మణుల బ్రాహ్మణాధికారము లంగీకరింపబడిన సభావిషయముగల యాదస్తునుగూడ సమర్పించిరి. దీనిచే దురుద్దేశము వినిశ్చితముగ శూన్యమగుచున్నది. తనకృత్యము బ్రాహ్మణులు తమ మతమునకు పరాభవముగ భావింపవచ్చునని ముద్దాయికి తెలియునా? అతడెట్లు తెలిసికొన గలుగును? తన యెఱుక నీయాలయమునసే విశ్వబ్రాహ్మణు లనేకు లభిషేకమొనరించియున్నట్లును, ఎట్టి ఫిర్యాదు జరిగియుండనట్లును, ఎట్టి సంప్రోక్షణయు, జరిగియుండనట్లును, ముద్దాయి సాక్ష్యమువలన తెలియుచున్నది. సాక్ష్యమువలన స్పష్టపడినంత వఱకు ఈయభిషేకాధికార వివాదముపురము నందలి ప్రస్తుత

కలహాముచే కలుగలేదు, ఆతని (ముద్దాయి) సోదరుడే ఒకప్పుడు విచారింపబడి అపీలుపై నిర్దోషిగా విడువబడినాడు. కనుక తన యధార్థోద్దేశము నైలపలచుట కానట్టి యొకపని ఎవరి మతమునకు గాని, తుదకు బ్రాహ్మణ మతమువంటిదే యగు తన మతమునకు గాని యవమానముగ అతడెట్లెంచ గలడు? అదివఱకెప్పుడు ఈ యాలయమున కరిగియుండ డని ముద్దాయి తన్నభిషేకముచేయ నిషేధించు నెట్టి నిబంధనగాని యెరిగి యుండలే దనియు, అతడా పూజావిధి వాస్తవముగ భక్తిసంబంధమైనదే యని యెంచి మహాశివరాత్రినాడే కాశీవిశ్వేశ్వరస్వామివారి యాలయమున అభిషేకము చేయుటచే కల్గునని సాక్షులు చెప్పుచున్న అతిశయమగు పుణ్యమును సంపాదించు నుద్దేశముతోడనే యీపని చేసినాడనియు, నాయభిప్రాయము. కావున క్రిమినల్ ప్రొసీజరుకోడ్ సెక్షన్ 258 ప్రకారము నిర్దోషిగా విడువబడెను.

జె. డబ్లియు, హ్యూస్.
రెండవక్లాసు అసిస్టెంటు మేజిస్ట్రేట్

విశ్వబ్రాహ్మణుల ఆదిమస్థానము

ప్రొఫెసర్ విల్సన్‌గారు 'శ్వేత' తెల్లనివాడు। 'శ్వేతాత్మ' తెల్లని గుణముగలవాడు। 'శ్వేతశిఖ' తెల్లని జుట్టుగలవాడు। 'శ్వేతలోహిత' తెల్లని రక్తముగలవాడు, అను నల్వురు శైవబ్రాహ్మణులుగూడి 'శ్వేతద్వీప' తెల్లని ద్వీపమునకు బోయిరని చెప్పుచున్నారు,

మన పూర్వులు మన కొసంగిన సంస్కృత గ్రంథముల నవలోకించిన మానవజాతి యందలి ఆర్యవంశజుల కాదిమనివాసము మహామేరు వని తెలియగలదు. ఈమహామేరువు మీదనే విశ్వకర్మ వంశ పూర్వులలో నొకడగు త్వష్టప్రజాపతి కాంతిమయ పట్టణమగు తన తేజోవర్తపురమును నిర్మించుకొనెనని చెప్పుదురు. దాని సమీపముననే శ్వేతభూమియు శ్వేత ద్వీపము కలదు.

నిత్యసంగర నిమగ్నులగు ఈ పక్షద్వయము వారికి జరిగిన రెండవ వ్యాజ్యెము వలన బ్రాహ్మణస్థాన గౌరవముల అధికారము వివాదమున బడి ప్రాముఖ్యత వహించె. ఇది ద్రవ్యవివాద సంబంధమయిన విషయము. ఇందువలన ప్రస్తుత బ్రాహ్మణుల నీచసంబంధము బట్టబయలయ్యెను, వేదములందు పేర్కొనబడిన సరియగు అదిమ బ్రాహ్మణులుగ నెంచబడు నధికారము స్వర్ణకారులదే యని స్థిరముగ స్థాపింపబడెను. ఈ వ్యాజ్యె మిట్లుద్భవింపనది. క్రీ. శ. 1818 సం॥ చెన్న రాజధాని చిత్తూరుజిల్లా నదుప్టేరి గ్రామమున కొందఱు విశ్వబ్రాహ్మణులు వివాహశోభన మొన రించుచుండిరి. మార్గసహాయాచార్యులను నాయన గురువుగ ప్రవర్తించు చుండెను. స్వర్ణకారులకును, ప్రస్తుత బ్రాహ్మణులకును, వైవాహిక కర్మలందెట్టి భేదమును లేదని మొట్టమొదటనే తెలిసికొనుట యవశ్యము - రెండును సరిగ నొక్కరీతిగా నుండును.

7 వ ప్రకరణము 29 వ పుట

పంచాంగం గుండయ్య ఆసునా పురమందు యొక దుష్టబ్రాహ్మణుడీ యాచారమును బలవంతముగ నడుగంటజేయ నుద్దేశించి యా స్వర్ణకారుని యావరణలోనికి దండెత్తిపోయి వివాహస్థలము యొద్దకు వొచ్చి పందిరి పీకివైచి యల్లకల్లోల మొనరించి కుటుంబమునకు చాల హాని కలిగించె ! మార్గ సహాయాచార్యులు తాను నిజమగు దేవ బ్రాహ్మణుడనియును వివాహము చేయించు నధికారము తన యందును, తనబోటి బ్రాహ్మణుల యందునే యుంచబడినదనియు మొండిపట్టు పట్టె. తరువాత నుభయ పక్షములవారును తమ తమ తగవులను తీర్చుకొనను విద్వాంసులగు 1. విశ్వనాధశాస్త్రి. 2. నాగోజీరావు. 3. షణ్ముఖపండితులు 4. సుబ్బా రాయ మొదలి, 5. వెంకటరామనాయుడు గారులు కలిగిన పంచాయితీ సభామధ్య వర్తిత్వము నంగీకరించిరి. పంచాయతి వారతి జాగరూకమగు పరిశోధన పైని వివాద విషయములన్నిటియందు సంపూర్ణముగ స్వర్ణ కారుల పక్షముననే తీర్పునిచ్చి వారే సరియగు ఆదిబ్రాహ్మణులనియు

అందుచే వివాహవిధి జరిగింప నధికారము కలదనియు, నిర్ధారణ చేసిరి. విద్వచ్ఛేఖరుఁడగు వెల్లావంశీయ సోమసుందరపిళ్లగారిట్టి కర్మలను విధులను జరిగించుకొన నీ దేవబ్రాహ్మణుల కధికారమున్నదని బోధింపగా గుండయ్య కోపోద్దీపితుడై ఆ యుపదేశమును తిరస్కరించి పంచాయితీవారిపై అక్రమ ప్రవర్తన దోషమారోపించి సభయందల్లరి గావించె. మార్గసహాయాచార్యులు గుండయ్యపై ఆయన దౌర్జన్యమునకై వ్యాజ్యెమును తెచ్చెను. పదునైదుగురు సాక్షులవలన నేరము ఋజువైనది, గుండయ్యయు, ఆతని యనుచరులును జరిమానా విధింపగా భరించిరి.

మేజస్ట్రీటుగారి యవిధేయుడగు గుండయ్యపైని దుర్మార్గులగు తదనుచరులపైని దావా తెచ్చుకొమ్మని మార్గసహాయాచార్యులను సలహా యిచ్చిరి. ఇట్టి దావా ప్రారంభమైనది.

| వాదులు | ప్రతివాదులు |
|---|---|
| 1 వెళ్ళయాచార్యులు | 1 పంచాంగం గుండయ్య |
| 2 మార్గసహాయాచార్యులు | 2 అరుణాచలయ్యరు |
| 3 రుద్రాచార్యులు | 3 వెంకటసుబ్బశాస్త్రి |
| 4 వెంకటాచలాచార్యులు | 4 విశ్వపతిశాస్త్రి |
| 5 నల్లాచార్యులు | 5 దొడ్డాచారి |
| 6 కులందయాచార్యులు | 6 ఇక్కియాల క్ శేఖర్ |
| 7 చిన్నకణ్వాచార్యులు | 7 వ్యాసశాస్త్రి |
| 8 అరుణాచలాచార్యులు | 8 సూర్యనారాయణశాస్త్రి |
| 9 మహాదేవస్థపతి | 9 జ్యోతిశాస్త్రి |
| 10 వరదాచార్యులు | 10 నందవాసి సిరస్తారు |
| 11 దక్షిణామూర్తి | ప్రతివాది వకీలు అరుణాచలమొదలి |
| 12 స్థపతి | |

వాది వకీలు అబ్దుల్‌సాహెబ్

వాదులు చూపిన ప్రమాణగ్రంధములు ఏమియు లేవు

1 యజుర్వేదము, 2 పురుషసూక్తము

3 మూలస్తంభము, 4 వజ్రసూచి

5 వేమన పద్యములు 6 కపిల గీతావళి

వాది సాక్షులు

1 అండియప్ప మొదలి 2 శంకరనారాయణచెట్టి

3 గోపిచెట్టి 4 అప్పలస్వామివల్లి

5 వెంకట సుబ్బనాయకం

వ్యాజ్యమిట్లు వక్కాణించుచున్నది.

11 వ ప్రకరణము 45 పుట

చెన్నపురి వాసులగు డాక్టర్ ఆండిగారిట్లు వ్రాయు చున్నారు. సాధారణముగ మనుమయు లనబరగు సానగు సనాతనులు, దేవభూమి, దివిజావాసమున జీవించుచుండిన సమయముననే వారనేక యాగములు లేక బలులొనర్చిరి. దేవస్తోత్రములు గీర్తించిరి. ఈ కీర్తనలు ప్రథమమున మంత్రములుగను, పిదప వాక్యములుగను, అనంతరము సూత్రములుగను, మారి క్రమముగా జన్మస్థానము, అదిస్థానము, ఉపస్థానములగు అ. ఉ. మ. అను అక్షర సంయోగము వలన యేర్పడిన 'ఓం' అను అవ్యక్త శబ్దమగు ప్రణవముతోగూడి తుదకు వేదాకృతి దాల్చి పూజితములయ్యె. వేదవిషయ మంతయు ఖండములుగ చెప్పబడినది. అవి కాలక్రమమున వాడుక నుండి తప్పిపోగా రావణుడు వానిని సమర్థింపగోరి కొన్నిటిని సంగ్రహించి సామ వేదమును నూరు శాఖలుగా భాగించె. ఈ వేదములు మరల జీర్ణములు కాగా వేదవ్యాసుడు దానిని ప్రోవుచేసి స్తోత్రకాండమును, ఋగ్వేదముగను, యజ్ఞాదికర్మకాండమును యజుర్వేదముగను. గీతభాగమును, సామవేదము గను, శ్లోకభాగము, నథర్వణ వేదముగను, విభజించగా ఇవియే ఇప్పటి

వరకు చతుర్వేదము లైనవి. రావణుని గూర్చి సింహళ చరిత్రమున ఎల్లరకు పూర్తిగా తెలిసియున్నను, ఇప్పుడు కొంత చెప్పవలసియున్నది. అతడు విశ్వకర్మ వర్ణ బ్రాహ్మణుడు, అతడు విశ్వకర్మ కుమారియగు మండోదరిని పెండ్లియాడె. సింహళముపై ఆతని దండయాత్ర బాగుగా తెలిసిన విషయమే, అతని సాహిణములు సింహపురము నందుండెను. ఈ సుప్రసిద్ధ గ్రంథకర్తయే యిట్లు నుడువుచున్నాడు. ప్రతి యాగము నెట్లు సంభవించెనో నిరూపింపదగిన ప్రమాణములు గలవు. ఆయా నిర్ణీత క్రియా చరణీయాచరణకు. ఈ యాగములయొద్ద నల్వురు యాజ్ఞికు లుందురు. మొదటి వాడధ్వర్యుడు. యజుర్వేది మయప్రతినిధి, యజ్ఞ పురోహితుడు రెండవవాడు. హోతృడు (హోత) ఋగ్వేదమను ప్రతినిధి స్తోత్రపురోహితుడు మూడవవా డుద్గాత, సామవేది త్వష్టప్రతినిధిగాన పురోహితుడు, నాలుగవవాడు. బ్రాహ్మణుడు (బ్రహ్మ) అథర్వణవేది శిల్పి ప్రతినిధి ప్రధాన పురోహితుడు, దీనివలన వేదములు పురాతనశిల్పి బ్రాహ్మణకృతములని స్పష్టముగ గాన్పించును. ఆ సంతతీయులు సరిగ. ఆ యాదిమ బ్రాహ్మణ వంశజులే యని గుర్తింపబడగా పౌరుషేయ విఖ్యాతులైరి. వీరే ప్రస్తుత వైశ్వకర్మణుల పూర్వీకులు. సామాన్యముగ వీరు ఆచార్య నామమున నొప్పుచున్నారు. ఈ నామమే ఆ. చా. రీ. అను మూడక్షరములు. ఆకారము వేదజ్ఞానము, చా కారము శాస్త్రపాండిత్యము రీకారము శిల్పపరిచయము సూచించుచున్నవి.

శ్లో॥ ఆకార ఆగమాఖ్యాసీ చ్చాకారః శాస్త్రకోవిదః ।
రీకారోదేవతోత్పత్తి ఆచారీ నామత్ర్యక్షరః ॥

ఈ త్రివిధ స్థానపారీణుడే గురువను అర్థమిచ్చు ఈ యాచారి నామమున కర్హుడు, మరియు రావణబ్రహ్మ గోత్రము, ఇప్పటి బ్రాహ్మణ గోత్రములలో నుండుటచే రావణబ్రహ్మను రాక్షసుడని చెప్పుచున్న యీ రాక్షసవంశ్యులెందరీనాటికి సంఖ్యగలదో అది యిప్పటికి ప్రత్యేకముగా

తేల్చినవారు లేరు, వేదమును సంహిత పదము, క్రమము. జట, ఘన బ్రాహ్మణము. అను రూపములు సృష్టించి శాశ్వతముగా దైవశక్తిని, తత్సంబంధముగా నిత్యజీవనోపాధిని కల్పించిన మహాగురువగు పుణ్యమూర్తిని ఛీకారశబ్దములతోను, నికృష్టమైన కథలతోను, నిందించుచున్నవారు ఆచంద్రతారార్కముగా రౌరవాది నరకలోకమున నుందురనుట కెంతయు సందేహము లేదు. కావున పూర్వోదాహృత ప్రమాణ విషయముల వలన ప్రస్తుతము సింహళమున నవందన్నోలన బరగుచున్న ఈ యాచార్య కులస్థులు జన్మచేతను, వంశక్రమము చేతను, గూడ జగదుత్కృష్ట వంశమగు సూర్యవంశీయమను వంశమునకు చెందినవారనుట తెల్లము. ఇట్టి దుష్ట జాతి సంఘము లెన్ని విధముల శోధించినను, పౌరుషేయ బ్రాహ్మణుల నుండి వారి జన్మాధికారము నపహరింప నెన్నటికి సాధ్యము కాదు.

(27వ ప్రకరణము 98 పుట) వైశ్వకర్మణులు రాజసన్మానము పొందుట.

వంశపారంపరికముగ శిల్పియగు నాతడు జన్మబ్రాహ్మణుడగునని యీపొత్తపు తొలిపుటయం దుదాహరింపబడిన విషయములచే సంపూర్ణముగ స్థాపించబడినదని మేము తలంచుచున్నాము. అది యట్లుండ వైశ్వ కరణకులము తక్కువజాతి కాదనుట, సింహళరాజు లద్దానిని సమ్మానించిన రీతినిబట్టియే విశదము కాగలదు. రాజులు వారికెట్టి బహూకృతుల నొసంగిరో; వారెట్టి పదవుల నలంకరించిరో, వారు బాధ్యతాయుతములగు నెట్టి మహోద్యోగములు జేసియుండిరో, యిచ్చవచ్చిన దుస్తులను కొని ధరించుటకు వారికెట్టి స్వాతంత్ర్యముండెనో, యీసంగతులన్నియు విశ్వకర్మకులము తక్కువజాతి యను వారిసూచనలను తుడిచివేయును. ఈవర్ణమును దురాక్షేపణలకు దూరముచేసి ప్రపంచమునగల యన్నిజాతులలోను దానిని ఉత్కృష్టతమ స్థానమొసంగ దక్కిన యేసాక్ష్యమును సింహళరాజులు గోవీలకు స్త్రీ పురుషులను విశ్మకర్మ కులజులకు సేవకులుగ నిచ్చిరను నీ ప్రస్తవ విషయముకంటె నెక్కుడు సహకారి కాజాలదు.

సింహళమం దేజాతియు నవందన్నోలకంటె నెక్కుడు రాజమాన్యములనొందియుండలేదు. ఇది యెంతయు వాస్తవము. "గ్రమాష్టిలా"లేక గమ్లడ్డా"గా సంక్షేపించబడి కండిరాష్ట్రమునందలి వైశ్వకర్మణులు ప్రత్యేక గౌరవబిరుదముగ నుపయోగింపబడుట యిందువలననే. ఈశబ్దమునకు "రాజులవలన మాన్యముబడసిన" విఖ్యాత లేక యుదారపురుషు" డని యర్థము. గోపీదృష్టిని నేడీ గౌరవ బిరుదముకూడ దాని దాల్చిన యాతని కపకీర్తిగ గాన్పించుచున్నది. ఇయ్యది గోపీతెగలు సంచుకుట్రల వలని ఫలమే యనుట స్పష్టము. వైశ్వకర్మణుల కొసగబడిన శాసనములలో ముఖ్యతమ మగువానిలో కొన్నిటిని ఈక్రింద నుదహరించుచున్నాము. 1708 సం.లో వీరప్రక్రమబాహు నరేంద్రసింహుకు "యతిసువర" యందున్న "కురుకుత్తిలోని" రత్నముదలి దవుండ 9 అఛరానాచారికి కురుకుత్తల, ఏల్మలపాటగల్వెలో హీన్నరం దేనియ, మరుతగహ ముల్లంతి యన్నాదేనియ, యను పొలములను, మెరక పల్లపుభూముల, నాతని యుద్యోగమునకును, సంబంధించిన, సకల గౌరవచిహ్నములను దానమొనర్చె. (దవుండ యనునది యొక బిరుద సూచకము. దానిని ధరించిన యాతనికి. ఆతని నివాసమున, నుదయ సాయంకాలముల యందు మధుర గాన మొనర్చుట. కుతుడమను, మంగళ వాయిద్యమును ప్రయోగించువారం శాసంగుదురు) 1664 సం॥లో ద్వితీయరాజ సింహుడు మహాగోడా వాస్తవ్యుడగు 'సందునైది' యను నాయనకు మహాగోడా గ్రామ శాసనము నొసంగె ఆతడు కొత్తాప్రభువగు షష్ఠమభువనేక బాహుని కాలమున క్రీ. శ. 1500 లలో హిందూదేశమునుండి సింహళమున కేతెంచిన విఖ్యాత వైశ్వకర్మణుని సంతతీయుడు, ఈశిల్పిశిఖామణికి గౌరవచిహ్నముగ రాజు దేవసింహ మూలాచారిని గలిసికొన. వడువావల మూలాచారిని ఐంపి, పట్టపుటేనుగుపై ఆ ప్రసిద్ధపురుషుని తోడ్కొని రమ్మని పంపించెను. ఈ యాచార్యుడు రాజుకొక దూరదర్శినిని, వాలుకా ఘటికాయమును కానుకగా నిచ్చెను. రాజు సంతసించి యాచార్యునికి మండలవల్లి నామమిడి నాఘ

కోరేళ్ళనున్నకిని, గోడాయందలి మంగళగ. మాగ్రామ గోపిగమాలు నేటికిని సేవకులై దాని నా గ్రామపు ప్రభువంశముగ గణింతురు.

1763 లో సింహాళ తమిళరాజులలో ద్వితీయుడగు శ్రీకీర్తిరాజ సింహుడు నాలుగు కోనేళ్ళలోనున్న వడువావలి యందలి విజయవరదాన దేవసింహ మూలాచారి కొక తామ్రశాసనమును, పండ్రెండు, "అమున ములు" యైదు "లహాల" మెట్ట పల్లపు భూముల నిచ్చె.

1763 లో అరాజె రాజకరుణ దేవసురేంద్రమను వీరవిక్రమ సిరిత్ తరాల్నా అరశరణం విచిత్రచిత్ర కర్మాంత నిర్మిత సకలశిల్ప తిలక నవ రత్న మొదలిదవుండ సిప్పాచారికీ దివ్యమగు నామము నొక తామ్రశాసనము నిచ్చె. ఎట్దెనియా ప్రసిద్ధమగు రెండుశాసనములలో నిది యొకటి. గంపో తొళిలోని వల్యాప గోడాలో ఏబది అమునములున, నాల్గుకోరేళ్ళలో ముప్పది. అమునములును, రాజాతనికి మాన్యముగా నొసగెను.

1772 ఆ మహీపుడే యెట్దెనియా యందలి రెండవ తామ్రశాసన మును రాజకరుణమను వీరవిక్రమ అరశరణ నవరత్నముదలి దవుండ సిప్పాచారి కొసంగె. "ఎట్దెనియానంకార" మను సుప్రసిద్ధ గ్రంధము నీవిష యమును గొనియుండుటకే యిప్పటి కవిశేఖరు డొకడు రచించెను.

1786 లో రాజాధిరాజ సింహుడు మఱియొక శాసనమును శ్రీదంత ధాతు మకరధ్వజ ప్రక్రమ అరశరణ సవుత్తారి స్వర్ణతిలక నవరత్నము దలిధవుండు అభరానాచారి కొసంగె, గరిపాలాలోని వల్యాప గోడాయందలి చాలభాగ మాతని మాన్యములోనిదే.

1790 లో ఈరాజే యెట్దెనియాలోని మఱియొక ప్రసిద్ధ వైశ్వకర్మ జునికి కొన్ని మాన్యములును, "రాజకరుణదేవ సురేంద్ర" మను వీర విక్రమసిరిత్ తరాల్నా అరశరణ కర్మాంత నిర్మిత సకలశిల్ప తిలక నవ రత్న ముదలిధవుంద సిప్పాచారి" అను బిరుద నామము నొసంగె. వీర్య

వంతమగు నొక యువగంధేభమును కొాప్మెలునందును. కురుక్షేత్రలము నను, కొన్ని భూములును, బహుమానములు,

విక్రమబాహురాజు పండిత నీలముడను ప్రసిద్ధ వైశ్వకర్మణునిచే పట్టాభిషిక్తుడయ్యె. ఆసమయమున ఆ రాజాపండితుని తల్లిని, కూతును, క్రమముగ పుంసధహామి, విజయవరదాన, నామములచే గౌరవించె, ఒక మదపుటేనుగను. తెరపట్టాయును, ఇల్లు తుడుచుట కొక దాసియును. "బోవతహెత్తి" అను అంగీయును, వీనికి తోడయ్యె.

1279 (?) లో పండిత ప్రక్రమబాహు నాహ్వానమున హిందూదేశ మందలి కింబులవాపురమునుండి యొక సుప్రసిద్ధాచార్యుడు సింహళమున కేతెంచెను, ఆతడు మన్నేశ్వరము నందలి దేవాలయమును పూర్తిచేసెను. అందులకు రాజాయనకు "మతంగ రాజకరుణాది వీరవరదాన నిష్కమానం దన ఆచారి'' అను నామము నొసగెను. ఇదియేకాక ఆతడు రాజువలన 'పుంచికాలు' అను పిడియేనుగును, బానిసలుగ నల్వురు స్త్రీలను పురుషు లను, మన్నేశ్వరపు దేవాలయము నందలి యవనికను, పాడుచేసిన ముప్వురు తమిళకరావాలను, కొఱతవేసిన జ్ఞాపకచిహ్నముగ కరావులా యనబడిన గ్రామదుర్గమును వడసెను.

1640 లో సింహనారాయణుడు ఇటులే సమ్మానింపబడె. రాజాతని కార్యములకు సంతసించి సప్రగం, మేడాకొరేలులోని హెలావుడ పత్త నందున్న కసటసిటీయా యందు, ముప్పదియమునముల కేదారమాన్యము నొసగె.

'హులంగోముహ యందలి రాజపక్ష భాగోత్తర సిత్తరమొహత్తా యను నతడు మఱియొకసుప్రసిద్ధ వైశ్వకర్మణుడు, అతడు పరమ గూఢ విద్యాపారంగతుడు. మహామంత్రివేత్తయై అష్టాదశ బాధ్యతా యుతోద్యోగ ముల బొందియుండెను. ఆతడు రూసిగమా, యోదగమా, ఆనవులుందన, మన్నేశ్వరం, పుట్టలమను వానికి "దిస్సావా" యును, హలుమందపికె

"లీకమా'' యును. ఐ ''ముహందిర" మను సైనికోద్యోగమును కలిగి యుండె, అతని నివాసమిప్పటికిని ''వాలావునా" అనిపిలువబడు చున్నది. ఇమ్మహాగౌరవమునకు కారణములీ క్రిందవిషయమున గననగును. రాజొక నూత్న పట్టణమును నిర్మింపదలచి, దానికి తగిన ప్రదేశమును మొహత్తా వలన నెఱుగ గోరె. ఈతడు నేడు కండియున్న స్థలము అందులకుచితమని వక్కాణించె. తక్కిన చోట్లన్నిటికంటె ఈ తావుననే యాతడనుకూలించు నని చెప్పుటకు కారణమేమియని యడుగ, అతడది శ్వేతకూర్మముపైన అనియుండుటచేతనేఅని ప్రత్యుత్తరమిచ్చెను. ఈశాస్త్రి యింత గట్టిగాచెప్పిన యీవిషయమును వినినంతనే రాజున కాశ్చర్యము కోపము కలిగెను. ఆ జంతువును చూపుమని యాజ్ఞాపించుచు. అట్లు తాబేలును చూపజాలక పోయి నచో ఆత్రవ్వినగోతిలో నతనిని పూడ్పింతుననెను. మొహత్తులా చెక్కు చెదరక తెల్లమట్టిపొర వచ్చునంతవరకు త్రవ్వుడని సేవకుల కానతిచ్చి విశ్రమించె. సేవకులా యాజ్ఞప్రకారము త్రవ్వి తెల్లమన్ను రాగానే మొహత్తా గారి కానతిచ్చిరి. రాజునకు కబురుపంపిరి. ఆతడు వచ్చినంతనే త్రవ్వనారంభించిన నహో యేమి ఆశ్చర్యము! శ్వేత కచ్ఛపమొకటి పైకి వచ్చిముమ్మారిదిలోపలికి దోయెను, మరల వెలుపలికి రాలేదు. అంతనా జ్యోతిషశాస్త్రవేత్త విస్మయ నిమగ్నుడగు రాజునుపిలిచి నీ కిచ్చవచ్చినది యిచ్చి నీ బెదరింపు చెల్లించుకొనుమని వేడికొనెను. పరమానంద భరితుడై రాజు అతనికి మునుపు చెప్పిన బాధ్యతాయుద్యోగములేకాక మత్త మాతంగ మును కట్నముగా నిచ్చెను. ఆయేనుగు దంతములపైనున్నచెక్కడమే యీ సంగతి నిర్వివాదమనియు దర్శనమై నేటికిని నిలిచియున్నది. ఆతనికి "జగత్‌బొప్పి" నేడు ఆ సంతతీయులు యధీనముననే యున్నది.

1566 లో ద్వితీయ రాజసింహుడు వారి సొత్తునందున్న యల్లందు పితీయలోని కుంబురేగెదర మూలాచారికిశురాజ కరుణ దేవనారాయడుబోధి పక్ష విచిత్రచిత్ర శ్రీ దాతధాతు మకరధ్వజభువనైక బాహు అభిషేక దంత సింహరత్న మహానామమూలాచారి, అను బిరుదు నామమొసంగె.

కొత్తా యందలి భువనేక బాహురాజు గొండబోలగష్టద్దా కిచ్చిన బిరుదముకూడ యింత ఘనమైనదిగ ఇంత ప్రావ్యముగా నున్నది. అది యిట్లున్నది "విజయసింహ శ్రీ దంతధాతు. మకరధ్వజ భువనేక బాహు మణికర్మ. స్వర్ణకర్మ తికలపతస వృత్తరిముదలిద వృంద నవరత్నవల్లి అభనాచారి"

దేల్టేనియాలోని సిత్తర మూలాచారికి "భువనేకబాహు పుష్పదేవ నారాయణ అభిషేక విచిత్రచిత్ర శిల్పాచారి" అను బిరుదముండెను"

అనంతరపు సింహళరాజుల కాలములో దేవనారాయణ ఆచారి, మొరొవక కొరేలునకు "గొరలా" మై యుండె. అతడా మండలమంతటిని పాలించె! అతనికి దుతారామమండల మందొక గ్రామమంతయును "నిందగమా" గా నొసగబడె! విశ్వకర్మకు హనుమంతు డిచ్చినట్లు చెప్పబడునట్లు విచిత్రహనుమ (హనుమంత కొడియ) ధ్వజమును కల్గిన ఘనుడీతడే. వివాహాది శుభకార్యములయందును, స్వసాంఘిక మహా సభల యందును, వైశ్వకర్మణులీ టెక్కెమును, గౌరవచిహ్నముగ కొనిపోవు చుందురు.

(17 వ ప్రకరణము 73 వ పుట)

లంకాద్వీపమునకు ప్రథమరాజగు విజయుడు విశ్వబ్రాహ్మణుడు. తన జన్మ స్థానమగు "బిరావణలోయ" లో నుండి ప్రాచీనార్యుల హానికర వర్ణభేదము తెలియంగరు. జన్మచే వారెల్లరును, ఒక్కటే తరగతివారు. కాలక్రమమున వారి జన్మస్థానము వదలి, ఆయా స్థలములయందు చిల్లర చిల్లరగా నుండుట జరిగినది. కలియుగము 2555 సం॥ వైశాఖ శు॥ 15 నాడు మహానుభావుడగు బుద్ధుడు నిర్యాణము నొందిన దినమున విజయుడు 700 పరివార జనసమేతుడై సింహళమున నొకదిగెను. క్వేణి అప్పుడీ ద్వీపమును పాలించుచుండె. ఆమె ప్రపంచమున సౌందర్యవతి కాదు గాని లోకమున నెవ్వరికినిలేని స్తనత్రయామామె బొమ్మున బుట్టుటచే నొక వివ

రీతమును, జ్యోతిష్కులీమె భర్త యొక పరిపాల నాధికారిగ లోకమున ప్రసద్ధి పొందగలడనిరి. విజయుడు దుష్టాచార ప్రవీణుడై అనుచర సంఘమును వృద్ధిచేసికొనుచు అపకీర్తిని సంపాదించి తండ్రికి దాని నంట గట్ట దలచినట్లు లోకమున కగుపడుచున్నాడు. తండ్రి యిట్టి స్థితిని కనిపెట్టి ఆ కుమారుని అనుచర వర్గముతో సహ ఒక నావ యందుంచి యెచ్చటనో దూరప్రదేశమున వీరిని వదలిరండని కొంత సైన్యమును పంపెను. వారా విజయుని తన యనుచరులతో సహ లంకాద్వీపమున విడచివెళ్లిరి. క్వేణి వారెవరో యెఱుగదు కాని వారిని చూడవచ్చినంతలో విజయు డామెను చూడగనే మూడవ స్తనము మాయమై సామాన్య స్త్రీ వలెనే కుచద్వయా లంకృతముతోనే కనుపించెను. అంతట విజయు డత్యానందముతో నామెను స్వీకరింప నుద్యుక్తుండయ్యె. క్వేణియు నా జాతక ప్రభావ మీ భర్తనే సమకూర్చి యుండవచ్చునని నిశ్చయించుకొని సంతోషించినది. ఇరువురికి వివాహము జరిగినది. ఈ దంపతులకు 'జనహత్తు'డను సుపుత్రుడును, 'దిశాల' యను నొక సత్పుత్రికను కల్గిరి. పాపమా సుగుణవతిని విడచి కష్టముల పాలుచేసిన కృతజ్ఞతాదోషమీయనను వెంటాడుచునే యుండును గదా?

విజయుడు మనువంశీయ సింహళరాజులందు మొట్టమొదటి వాడు. అందుచే ఆతడు విశ్వబ్రాహ్మణుడే. హిందూదేశమునుండి విశ్వకర్మ వంశీయులగు ఐదుగురు గొప్పవారతనితో గూడ వచ్చిరి.

వారు 1 సిరిత్ప్రక్రమరడల, 2. అభిషేకరడల, 3. సిరిత్ పొనా అర శరణరడల, 4, సిరిత్ దేవనారాయణరడల, నామాంకితులు. వారు వైశ్వకర్మణ పూర్వీకుల యందొకడగు మనువునకు పట్టాభిషేక మొనర్చిన విశ్వకర్మ కులదేవ బ్రాహ్మణ సంతతీయులు. మును చెప్పబడిన యేవురు విశ్వదేవకులస్థులును విజయుని నాతని పట్టాభిషిక్తుల నొనర్చి తదుపకార బహూకృతిగ వారికి విశ్వదేవ కులమునబుట్టి మధురనుండి పాండవరాజ్ఞి కూడవచ్చిన గొప్పయింటి స్త్రీలనిచ్చి వివాహ మొనర్చెను. రాజు వారలచే

'కడుపు తీయ కమ్మలతోట. స త్రంబువ. వేగగమ, నిమ్మగళ, ఐవంచమ మున్నగు గ్రామములోనసంగి యాదరించె: మధురారాజు విజయునకు ఏయే బహుమానముల నంపెనో, వివరింప నవసరము లేదు, కాని యా పాండవరాజ్ఞి వెంట సింహళమునకు చన్నవారు విశ్వకర్మ కులస్థులే యని చెప్పిన చాలును. వైశ్వకర్మణు, ఉత్తమ కులోద్భవు, లని స్థాపించుట కీ యొక్క సంగతియే యెక్కువ.

వృషోత్సర్జనము విశ్వదేవ స్థానముల హవిర్ద్రవ్యముల అధికారము

క్రీ. శ. 1925 నవంబరు నెలలో బాపట్ల తాలూకా నరసాయపాలెం గ్రామములో శ్రీ కామేపల్లి కోటయ్యాగారు పరమపదించగా వారి కుమారులు అంత్యేష్టి జరుపు సమయమున శాస్త్రప్రకారము హవిర్ద్రవ్యాదులు యెవ్వరికిని యే యే సమయముల యందీద్రవ్యాదులీయబడునో అట్టి దానముల వలని ఫలములేమియో లోకమునకు వివరముగా తెలియ జేయుటకును, సభ జరుపవలయునని యా గ్రామస్థులెల్లరును నిశ్చయించగా ఆ ప్రకారము సభను ఏర్పాటు చేసిరి. ఆ గ్రామ మునసబు కోటయ్యాగారు సభను ప్రారంభము చేయించిరి. అపర కర్మలు చేయించు, పురోహితుల పక్షమున భారతుల శేషయ్యాగారును, శిల్పాచార్యవసు చంద్రోలు ఫణిభూషణాచార్యులుగారి పక్షమున స్వర్ణ సుబ్రహ్మణ్య కవిగారును, మధ్యవర్తులుగా ధనకుధరం వల్లభాచార్యులుగారును, బాలమిత్ర రెడ్డిగారును సూర్యదేవర రామయ్యచౌదరిగారును, హాతకమూరి సుబ్రహ్మణ్యముగారు వేద పాఠకులును, అధ్యక్ష స్థానమునకు శ్రీ త్రిపురనేని రామస్వామిచౌదరి (బారిష్టరుగారును చేరిరి. కర్తల పక్షమున వారి దాయాదులగు కామి నేని వెంకటేశ్వర్లుగారును, ఆ వెంకటేశ్వర్లుగారికి ప్రధాన స్నేహితుడుగా

మున్న వడ్డెపాటి మల్లికార్జునరావుగారును (రైల్వేస్టేషన్ మాష్టరు) కూడ వచ్చిరి. అప్పుడు శిల్పాచార్యుని పక్షమున శ్రీ స్వర్ణ సుబ్రహ్మణ్య కవిగారు విశ్వకర్మీయ బ్రాహ్మణులగు శిల్పుల కర్మల విశేషములు, ఆయా కర్మఫలములు. నిబంధనములు మున్నగు విషయములను చక్కగా నుపన్యసించిరి. ఉపన్యాసములు చేయదగిన పండితులెల్లరు నుపన్యసించిరి, వాది పక్షమున వ్రాసి యిచ్చిన ధర్మశాస్త్ర విషయములతో గూడిన వ్యాజ్యేమునకు తగిన యంశములతో దావా నకలును వ్రాయించి రెండు కాగితములను న్యాయాధికారిగారగు శ్రీ త్రిపురనేని రామస్వామిచౌదరిగారు (బారిష్టరు) పరిష్కర్త ఆగువారికి దాఖలు చేయబడెను. ఆ నకలును ప్రతివాదుల కందజేయగా వారేమియు వ్రాసియిచ్చినవారు కారు, న్యాయ స్థానమున నేగ్రంథమునైన కనుపఱచి యొక్క వాక్యమునైన క్రమ మనునట్లు చెప్పినవారు కారు. సభ 3 గంటలసేపు జరిగినను ఇంకనే విషయములు జరుగలేదు. అప్పుడు తీర్మానాధికారులు వాదులు ధాఖలు చేసిన దావా విషయము లన్నియును సక్రమములును, ప్రాచీనకాలమునుండి నేటివఱకు జరుగుచున్న విషయములును అయియున్నవి. ప్రతివాదులు మాత్రము ఇట్టి కర్మలకు విస్తారముగా వచ్చుచుండుటచే యితరులు అంత శ్రద్ధగా రాకుండుటచే అట్టివి గ్రామ యాజకులు తీసికొని పోవుచుండుటయు కూడ కలదు. గాని అది న్యాయము కాదు. అట్టి సమయమున కర్మకర్త చేయుచున్న ఫలమును పొందుటకు సక్రమముగా చేయించు పద్ధతికై నిరీక్షించు చుండవలయును. ఒకరికీయ వస్తువులు ఒకరి కీయడముగాని, ఆ స్థానమును పురోహితుడు నాదియేమని తీసుకొనుటయును, న్యాయవిరుద్ధ ములై యున్నవి. కర్మకాండములో తప్పు జరిగించిన పురోహితుడే అందలి దోషమునకు ప్రతిఫల మనుభవించ వలసియుండును. రోగికి ఔషదమిచ్చు నప్పుడు వైద్యుడుకూడ వ్యాధిగ్రస్తుడు ఆ వ్యాధి నుండి యొడ్డునకు చేరు నట్టి కాలములో వైద్యుడుచేసిన పొరపాట్లుగాని అశ్రద్ధలు గాని జరిగెనేని అట్టి యపచార ఫలములు వైద్యుడే అనుభవించవలసియుండును కనుక —

శ్లో॥ రాజారాష్ట్రకృతం పాపం। రాజ పాపం పురోహితః ॥

అని యిట్లు పెద్దలు ధర్మములను తెలియజేసియున్నారు, కనుక వారి పక్షము న్యాయమైనదని హావిర్ద్రి వ్యాదులు శిల్పాచార్యునికే రావలసి యుండును. ఇతర విషయములు పురోహితునకు చెల్లును.

పరిష్కర్త

త్రిపురనేని రామస్వామిచౌదరి (బారిష్టరు)

నరసాయపాలెం సభ, ది. 5 డిశంబరు 1925

—0—

## శ్రీ వేమనయోగిసూక్తులు

ఆ॥ విశ్వకర్మసుతులు వెలయు దేవతలెల్ల, కానక తిరిగేరు కష్టజనులు
అట్టివారి యెంగి లందఱు తిందురు విశ్వదాభిరామ వినురవేమ ॥

ఆ॥ శిల్పికన్న గురుడు, సీమనెవ్వరులేరు, శిల్పిచేయ గురుడు సీమవెలసె ।
శిల్పినిందచేయ శ్రీగురునన్నట్లె, విశ్వదాభిరామ వినురవేమ ॥

ఆ॥ పుట్టినపుడెబొడ్డు, పట్టిగోయుచునుండ, నప్పుడెగురుముద్ర అంటియుండె
ముద్రలేనివారు, ముజ్జగంబునలేరు, విశ్వదాభిరామ వినుర వేమ ॥

ఆ॥ పేరుసోమయాజి, పెద్దదున్నుబోలు, మేకపోతునుబట్టి మెడనువిఱుచు
గాక క్రతువువలన గలుగునా మోక్షంబు, విశ్వదాభిరామ వినురవేమ॥

ఆ॥ వేదవిద్యలెల్ల వేశ్యలవంటివి, భ్రమలకొల్పి తేట పడగనీవు,
గుప్తవిద్యయొకటి కులకాంతవంటిది, విశ్వ॥

ఆ॥ ఆలిఱంకుతెలుప నఖిలయజ్ఞంబులు, తల్లిఱంకుతెలుప తద్దినములు,
గాక తెలియ కర్మ, కాండకల్పిత మాయ, విశ్వ ॥

ఆ॥ తాతగన్నతల్లి, తమతండ్రిగనుతల్లి, తన్నుగన్నతల్లి, తల్లితల్లి
తల్లిశూద్రురాలు, తానెట్లు బాపడో ? విశ్వ ॥

ఆ॥ కులమునీటగలిపి, గురువునువధియించి, పొసగయేనుగంతబొంకుబొంక
పేరుధర్మరాజు పెనువేపవిత్తయా విశ్వ ॥

ఆ॥ వెట్టినక్కలవలె, వేదముల్ చదివేను, ఆశయంబులెఱుగ గయ్యగాండ్రు
వేదసారమెల్ల, వేమన కెరుకరా, విశ్వ॥

ఆ॥ తల్లితోరమించె, తండ్రియజ్ఞముచేసి తనయుడట్లె రంభ ఘనరగూడె
తల్లినిరమియింత్రు దబ్బరవిప్రులు, విశ్వ ॥

ఆ॥ తల్లియూర్వసియును, తలయాలు మాదిగ, తాను బ్రాహ్మణుడన
వసిష్టకులమును వసుధలో నెఱుగరా, విశ్వ ॥ [తగునె జగతి

ఉ॥ తాత జనించె కన్యకకు తండ్రులు దాముసు కుండగోళకుల్
మాత పరానుకూలమతి మక్కపదార్పతి భర్తవేవురున్

నీతులుజెప్ప పాండవుల నీమము లిట్టివటంచు నెన్నుచున్
భూతలమందు నెంతయును బూమెలజేసెరి వెట్టివేమనా ॥

ఆ॥ పుస్తకములు జడలు, పులితోలు బెత్తంబు కక్షపాలలు పదిలక్షలున్న
మోతచెఱకాని మోక్షంబులేదురా, విశ్వ ॥

ఆ॥ పూజకన్న నెంచ బుద్ధినిదానంబు, మాటకన్ననెంచ మనసెదృఢము,
కులముకన్న మిగుల గుణమె ప్రధానంబు, విశ్వ ॥

ఆ॥ కల్లగురుడుగట్టు నెల్లకర్మంబులు, మధ్యగురుడుగట్టు మంత్రచయము
ఉత్తముండుగట్టు యోగసామ్రాజ్యంబు, విశ్వ ॥

ఆ॥ కల్లుకిచ్చినట్లు చల్లకునీయరు, గుంటకిచ్చినట్లు గురునికిడరు,
బూతుకిచ్చునట్లు పుణ్యానికిరెత్తురా, విశ్వ ॥

ఆ॥ కూలినాలిచేసి, గుల్లాపుపనిచేసి, తెచ్చిపెట్టనాలు మెచ్చనేర్చు
లేమిజిక్కెనేని కాముసైన హసించు, విశ్వ ॥

ఆ॥ మాలలందుపుట్టి మాలలదూషింప, ద్విజులకేలయిట్టి దొంగతనము
ఆదిపుట్టినవాని నరసితాజూడరా, విశ్వ ॥

ఆ॥ మాలమాలగాడు మహిలోననేప్రొద్దు, మాటతిరుగువాడె మాలగాక
వానియాలయన్న వాడెపోపెనుమాల, విశ్వ ॥

ఆ॥ మాలమేలు గుణము మంచిదిగల్గిన, మాలకాడు గుణము మనుజుకంటె
గుణమెమేలుగాని కులమేమి మేలురా, విశ్వ ॥

ఆ॥ శక్తితోడవచ్చె శంకరాచార్యుండు. విశ్వకర్మతోడ వెంటపోరె
కడకు విశ్వకర్మ ఘనుడని మెచ్చెరా, విశ్వ ॥

ఆ॥ వైష్ణవులనునట్టి వార్తమాత్రమెకాని, ప్రజలజెఱుతురయ్యభ్రష్టులగుచు
కష్టనరులకెల్ల గలుగునా మోక్షంబు విశ్వ ॥

ఆ॥ ఇనుము విఱిగెనేని యిరుమారుముమ్మారు, కాచియతుకనేర్చు కమ్మరీడు
మనసు విరిగెనేని మరియంటనేర్చునా విశ్వ ॥

ఆ॥ పొట్టివాడుకీడు పొడలపురుగుకీడు, వట్టియాశకీడు పరుడుకీడు
పొట్టిచేయికాలు పొసగుట కీడురా, విశ్వ ॥

ఆ॥ ఆడుదానిబొంకు గోడపెట్టినయట్లు, పురుషపశునిబొంకు పూరిపాక
స్త్రీలనేర్పు మగల చీకాకు పఱచురా. విశ్వ ॥

ఆ॥ హింసచేయరాదు సంసారధర్మంబు, జంతువులను జంపి సాకరాదు
చావుపశువుది నెడి చండాలుడే మేలు, విశ్వ ॥

ఆ॥ రాయియగునహల్య రాముపాదముసోకి, యాడుదయ్యెనెన్న [illegible]
శిల్పిపదముసోక శిలలెల్ల దేవతల్, విశ్వ ॥

ఆ॥ ఆనగననగరాగ మతిశయిల్లుచునుండు, పెనగ పెనగబుట్టు ప్రేమసతికి
తినగతినగ వేము తీయనై యుండురా, విశ్వ॥

ఆ॥ ఆత్మశుద్ధిలేని యాచారమదియేల, భాండశుద్ధిలేని పాకమేల
చిత్తశుద్ధిలేని శివపూజలేలరా । విశ్వ॥

ఆ॥ మాటలెల్లకల్ల మనసెల్ల దొంగయౌ । నేటిప్రాణమింక నేటిబ్రతుకు
మాటసత్యమైన మతిశతాయుష్యంబు । విశ్వ॥

ఆ॥ మాటలాడు లొకటి మనసునొక్కటి । యొడలిగుణమదొకటి
ఎట్లుముక్తిగలుగు నీలాగుతానుండ । విశ్వ॥ [నడతయొకటి

ఆ॥ మాదిగయనరాదు మతివసిష్ఠునకును। మాదిగచెలియెట్లు మగువయయ్యె
మాదిగగుణమున్న మహిద్విజుం డెట్లౌను । విశ్వ॥

ఆ॥ మాదిగయనగానె మతితక్కువందురు। మాదిగబాపల మామగారె
మాదిగకునుబిడ్డ మన యరుంధతిగదా । విశ్వ॥

ఆ॥ భూతిదేహమందు పూసిననయ్యేనే । నిష్ఠశివునియందు నిలుపవలయు
గాక భస్మమందు గాడిదపొర్లదా । విశ్వ॥

ఆ॥ "విశ్వకర్మలేక విశ్వంబుతాలేదు । కుడువకూడులేదు గృహములేదు
విశ్వకర్మ గురుడు వేల్పులకెల్లను । విశ్వ॥"

ఆ॥ "పుట్టినప్పుడట్టి బొడ్డుకోసిననాడు । అప్పుడెగురుముద్ర అంటియుండె
ముద్రితాకనివారు ముజ్జగంబునలేరు । విశ్వ॥"

ఆ॥ "వేముకంటెవిషము వెలనాటిశాఖయు । పాముకంటెవిషము ప్రథమశాఖ
నాభికంటె విషము నల్లనిబాపడు । విశ్వ ॥"

ఆ॥ "కనకమృగము జగతి కలదువేదనకను. దానివెంటనేగె దాశరథియు
తెలివిలేనివాడు దేవుడెట్లాయెరా । విశ్వ॥

ఆ॥ "సోమయాజిసంచు సొంపైనశాలవల్ । గప్పమాంసమెల్ల గాల్చితినుచు
పాపరత్వ మతని బాయదెన్నటికిని । విశ్వ॥"

ఆ॥ అన్ని జాతులకును అధారమైనట్టు లున్నసానగాది మిన్న ఋషుల।
నెన్ని జన్మములకును నెక్కుడగానము విశ్వ ॥

ఆ॥ ఋషికులంబునందు రూఢిగాజన్మించి కులము గోత్రములనుగొప్పలైరి
బ్రహ్మనంతుగాక బ్రాహ్మణులెట్లయిరి। విశ్వ ॥

ఆ॥ కల్లలన ట హేమకారుని దొంగని। అతని సొమ్ముకెట్టు లతడుదొంగ
మన్ను బంగరుగను మఱిచేసిపెట్టడా। విశ్వ ॥

ఆ॥ కొంకణంబుచేర కుక్కసింహముగాదు। కాశికేగ పంది గజముగాదు
వేఱుజాతివాడు విప్రుడుగాడయా। విశ్వ॥

ఆ॥ చదివినయ్యకన్న సంసారియే మేలు। కులమువేల్పుకన్న కుక్కమేలు
జాపనయ్యకన్న బైనీడుమేలయా। విశ్వ ॥

ఆ॥ తనదుతల్లిలంజె తనయాలుమాదిగ। తాను బ్రాహ్మణుడన తగునెజగతి
తపముచే ద్విజుండు తర్కింప కులమేది। విశ్వ ॥

ఆ॥ దక్షయాగ మెఱుగు తమబ్రతుకెల్లను। విష్ణువెట్టులరిగె వీరుడగుచు
శివుని నిందజేయ సిగ్గేది నరులకు। విశ్వ ॥

ఆ॥ బాపలన్న దొడ్డ పరువున జాతురు। కానిపనులుచేయ హీనులంత్రు
కులము లెక్కయేమి గుణమే ప్రధానంబు। విశ్వ ॥

ఆ॥ విశ్వకర్మ గురువు విశ్వంబునెపు నెల్ల। ప్రణవమంత్ర మొకటి
కన్నకడుపు గురువు గాయత్రి మంత్రంబు। విశ్వ॥ [పరమ గురుడు

—0—

(భారతీయ మహాశిల్పము 15 వ భాగము. శిల్పులు, శిల్పము అను గ్రంథముయొక్క ఉత్తర భాగమునుండి)

## 87. శివాలయములలో ప్రతిష్ఠాకాలమున తప్పుతాంబూలముల సంబరము

వంగవోలు తాలూకా కొలసనకోట గ్రామమున కమ్మవారిలో భూస్వామియును శివభక్తుడునగు శ్రీమోపర్తి రామకృష్ణయ్యగారను ధనసంపన్నుడు శివాలయమును కట్టింపదలచి యాకార్యమునకు దగినశిల్పి యెవరని పరిశీలించి వంశపారంపర్యముగా స్థపతులుగానుండి దేవతాప్రతిష్ఠలు జరుపుచు స్త్రీ పురుషాది దేవతాప్రతిమలనేమి, శివలింగములనేమి, ఆ యా సంబంధములగు ఆలయములనేమి ఒకటి యననేల సమస్త శిల్పనిర్మాణముల యందును, ప్రవీణులై యున్న తక్కెళ్ళపాటివారి వంశము (కొప్పెరపాడు) లో దేవశిల్పి శ్రీఫణిభూషణాచార్యుడను. అప్పటి కిరువదినాల్గు సంవత్సరముల వయస్సుగల శిల్పిని లక్షణయుక్తునిగను, సప్తవ్యసన వర్జితునిగను, షట్కర్మనిరతునిగను, కార్యదీక్షాదక్షునిగను. సర్వశాస్త్రవిశారదునిగను, శిల్పనిర్మాణ చాతురీధురీణునిగను, నిశ్చయించుకొని, యొక సుముహూర్తమున రప్పించి యుభయ క్షేమానంతరమున సగౌరవముగా మా గ్రామమున గౌరీశంకర దేవాలయమును శీఘ్రకాలములో నిర్మాణము చేయించి శుభలగ్నమున మీచే ప్రతిష్ఠచేయించి యా పరమేశ్వరకృపకు పాత్రుడనై యుండుటయేగాక యీగ్రామస్థులు యావన్మంది శ్రీస్వామివారి యనుగ్రహమున ఆయురారోగ్యైశ్వర్యాభి వృద్ధులతో ప్రకాశించుట యెప్పుడు చూడగలనా ? అను కోరిక నిండారుగా నున్నది అందుకు దగిన ముఖ్య శిల్పాచార్యునిగా నిన్నెన్నుకొని యున్నానని నూతన వస్త్రములు. గంధము పుష్పములు ఫలములు వేయినూట పదార్లు రూప్యములు, సువర్ణ దక్షిణ తాంబూలమును విశాలమైన పళ్ళెరమందుంచి సమర్పించి నమస్కరించెను. అంతలో ఆశిల్పాచార్యుడు తన రెండు నేత్రములను నిమీలనమొనర్చి ఓం నమశ్శివాయ. శివసంకల్పమస్తు. అయంముహూర్తస్సుముహూర్తోస్తు. దీర్ఘా

యురస్తు. ఇష్టసిద్ధిరస్తు. అని యాసన్మానమును స్వీకరించెను. అంత నా శిల్పాచార్యుడు శివభక్తాగ్రేసరా! నీయభిప్రాయము ననుసరించి నే నిప్పుడే దీక్ష వహించుచున్నాను. నీవును నేటినుండి సూర్యోదయాత్పూర్వమే కాల కృత్యముల నిర్వర్తించుకొని శ్రీమహాప్రణవ పంచాక్షరీ మహామంత్రమును 108 సారులు జపించి యవసర నైవేద్యమును పెట్టించి, ప్రసాదమును పుచ్చుకొని యేకార్యమునైనను చేయుచుండుట ముఖ్యముసుమా! అనెను. ధర్మకర్తగారు వృషభశకటముపై శిల్పాచార్యుని స్వగృహమున కంపెను. శిల్పాచార్యుడు సంపూర్ణదీక్షతో విగ్రహాదులను పూర్తిచేయుచు నడుమ తన కవసరమైన విషయములను ధర్మకర్తగారి కెఱిగించుచు తగిన సహా యముల నందుచు సంతోషముగ ప్రతిష్ఠాకార్యము వఱకు తెచ్చెను. క్రీ.శ. 1924 సరియగు రక్తాక్షి సం॥ మాఘమాసములో నొక సుముహూర్తము నిశ్చయించి యా శిల్పాచార్య డచ్చటనేయుండి యజ్ఞశాల, వేదికలు, కుండములు, స్రుక్స్రువాదులు సమిధలు, మృణ్మయపాత్రలు, తామ్ర పాత్రలు మున్నగునవి తయారుచేయించి యుంచెను. ధర్మకర్తగారు సామాన్య సమారాధనముకాక ప్రత్యేకముగా బ్రాహ్మణులకు 40 బస్తాల బియ్యమును 30 డబ్బాల నెయ్యి, వానికి దగిన యితర పదార్థములు మున్న గునవి యెంతయో గొప్పగా జేయించిరి. అట్టియెడ ననూయాపరులగు వైది కులును, కొందరు శివార్చకులును, మున్నగువారు ధర్మకర్తగారియొద్ద వంశ పారంపర్యముగా గుమాస్తాగాను, సలహాదారుగాను, ఉంటూ సంపూర్ణదాయ మును, గౌరవమును పొందుచుండిన శ్రీగుళ్లాపల్లి సుబ్బారాయుడుగారను నియోగిబ్రాహ్మణుని సలహాతో ప్రతిష్ఠాదినమునకు ముందటి దినము సాయంసమయమున రెండువందలమంది యా దేవాలయము ముందు కాచి యుండిరి, శిల్పాచార్యుడా కుట్ర నెరుగక యథాప్రకార మా దేవాలయములో ప్రవేశించి తాను చేయవలసిన పనులను గూర్చి యాలోచించుచుండె నింతలో 1 శ్రీ చెదలవాడ వెంకయ్యగారను వైదిక బ్రాహ్మణోత్తముడు వాని యొద్దకు వెళ్లుచుండగా 2 శ్రీ గుళ్లాపల్లి సుబ్బారాయుడుగారును వారి

వెన్నంటిపోవుచున్న నిద్దరు నిలువబడినంతనే యాజనులందరు చుట్టుముట్టిరి. అసహాయుడై యొంటరిగానున్న యా యువశిల్పిని వారిలో వెంకయ్యగారను వైదికశిఖామణి యొకచేతితో గొంతుపట్టుకొని యెత్తుచు రెండవచేతితో తాంబూలముంచుకొని నీవు గుడిలోనికి వచ్చినందులకు తప్పుతాంబూలమును పెట్టెదవా? లేక చచ్చెదవా? అనుచుండగా తనప్రక్కనున్న సుబ్బరాయుడుగారు త్వరగా యివ్వు లేకపోతే చచ్చిపోతావు. అని చెయ్యిచాపగా డబ్బు నాదగ్గర లేదనుచుండ నింతలో నెవరో మనుష్యుల చాటునుండి రు. 5-00 లు అందించుచు ఇదిగో యిచ్చెయ్యి. అని అందించిరి. కాని వారెవరైనది తెలియదు. అప్పుడు మాధవా మనతేరిని మరలనిమ్ము. "ప్రాణముండిన శుభములు బడయవచ్చు" ననిన యర్జునివలె రు. 5-00 లు అందుకొని యా సుబ్బరాయుడుగారి చేతిలో నుంచెను. వెంకయ్య చేతిలోని తమలపాకులు సుబ్బరాయుడుగా రందుకొనిరి. వెంకయ్య గొంతుపైనున్న తన చేతిని తీసి యిదిమొదలు యిటువంటి పని యెన్నడు చేయకుము. ఇప్పటికి నిన్ను మన్నించినాము. అనుచుండ మిగిలిన వారందరు తగిన ప్రాయశ్చిత్తము జరిగిన దనుచు నవ్వుచు నుండగా ఆదీక్షాబద్ధుడైయున్న శిల్పాచార్యునకేమి తోచక ధర్మకర్తగారి యింటికి జేరునప్పటికే యెప్పుడో యీ వార్త ధర్మకర్తగారి భార్యకు గాలివార్తగా దెలిసినది. ఆమెయు నన్నపూర్ణాదేవివలె వాకిటనుండి చూచుచుండగా నీయువశిల్పి చినిగిన పైవస్త్రముతోను తెగిపోయిన జందెముతోను బడలిన దేహముతోను, హీనస్వరముతోను, భీభత్సమైయున్న స్వరూపముతోను, అశ్రుపూరిత నేత్రమాలతోను తనయెదుట కనుపడి నంతనే ఆ సాధ్వీమణి నాయనా యేమిజరిగినది? నిన్ను యెవరేమి చేసిరి. నీకేమి కష్టము జరిగినది, ఎన్నడులేని యిట్టిస్థితిలో నున్నావు. అని నంతలో వర్షప్రవాహమువలె కన్నీరుగారుచు నన్నీవేళ యీశ్వరుడు రక్షించుచున్నాడు నేను లోకమువిడిచి పోవుచున్నాను. అని యూరకుండెను. ఆమె యూరుకొనక మరల మరల గట్టిగా చెప్పుము. ధర్మకర్తగా రిప్పుడే వచ్చెదరు, అనుచు ఎవరినో యిద్దరిని వారికొరకై పంపెను. అమ్మా! మీ వలన పొందిన దీక్షను నిర్వహించలేని పాపిష్ఠుడనై వెళ్ళవలసిన వాడనే యెవరో ఒక మహానుభావుడు నన్ను ప్రాణముతో నుంచినాడు. అని ఆ జరిగిన వృత్తాంత మంతయును వరుసగా నామె కెరింగించెను. ధర్మకర్తగా రామనుష్యుల కెదురై ముగ్గురును కలసి యింటికి

జేరిరి. ధర్మకర్తగారికై యెదురు చూచుచున్న యా మహాసాక్షిమహా శిల్పాచార్యునికి జరిగిన ఘోరాపదను, తీరని యవమానమును, పూసగ్రుచ్చి నట్లు చక్కగా తెలిపెను ఆధర్మకర్తగారు ప్రళయకాల రుద్రునివలె కన్ను లెఱ్ఱనై ప్రకాశింప దన యనుచరవర్గముతో ఓరీ మీరందరు ప్రతియింటిలో నున్న బండి మోకులను తెచ్చి యుంచుడనెను. వారటులే తెచ్చియుంచిరి. ఈరాత్రి పందిళ్లకు చుట్టూ దడులు గట్టిగా కట్టుడు కొందరు చుట్టూ కాపలా తిరుగుచు ఎవ్వరిని వెలుపలికి బోనీయకుడు. కావలసినవి మీకు చెప్పు మనుడు. అవి నేను పంపించెదను, బహుజాగ్రితగా నుండుడు సుమా ! అని యాజ్ఞాపించెను. వారటులనే తెల్లవారు వరకు కాపలా కాయుచుండిరి. పందిళ్ళచుట్టు దళ్ళుకట్టిరి. మోకులన్నియు అన్నసత్రశాలలో నొకగదిలోనం నుంచిరి. ధర్మకర్తగారు వేకువనే లేచి నిత్యకృత్యముల దీర్చుకొని శ్రీ మహాప్రణవ పంచాక్షరీ మహామంత్ర మష్టోత్తర శతమును జపించి శివు నకు అవసరనైవేద్యము నొసంగి నమస్కరించి యా ప్రసాదమును దీసి కొని చెర్నకోల చేతికి తీసికొని తనవారి నందరిని పిలిపించి మొత్తముగా నందరును అన్నసత్రశాల చుట్టుముట్టి యుండిరి. ధర్మకర్తగారు శాలలోనికి వెళ్ళి యావైదికుల నందరిని కూర్చోండని నియమించి రాత్రి మీరుచేసిన పనియేమిటి ? అని యడిగెను. అందఱును నాకుతెలియదు, నాకుతెలియదు అనమొదలిడిరి. అదివినగానే ధర్మకర్తగారికి మిక్కిలి కోపమువచ్చి ఓరే రాత్రితెచ్చిన మోకులన్ని యెచ్చటనున్నవనెను. వారు మోకులన్నియు నిచ్చటనే యున్నవనిరి. ఈ బ్రాహ్మణులందరిని వరుసగా ఒక్కొక్కరిని కట్టివేయుడని యాజ్ఞాపించి చెర్నకోలుతో నిలువబడి, నిజము చెప్పుడురా ! లేక యీ చెర్నకోలచే దెబ్బలు తినెదరా ? అని గంభీరస్వరముతో మేఘ గర్జనమువలె గర్జించు చున్నంతలో ఒక్కొక్కరికి దిగచెమటలు గ్రమ్మినవి. పోవుటకు దారికిలేదు. చుట్టూ కావలితిరుగుచున్న జనమెందరో [illegible] యదు. రాత్రి శిల్పికిపట్టిన చెమ్మటలుకంటె వీరందరికి రెట్టింపుగా పట్టినవి. అంతట చెదలవాడ వెంకయ్య, వల్లాపల్లి సుబ్బరాయుడు వారిద్దరేగాని మా కేమియును తెలియదని మొక్కపెట్టున నఱచిరి. ధర్మకర్తగారు [illegible] డగుటచే వారినందరిని కూర్చుండ నియమించి యాయిద్దరిని [illegible] బెట్టి, నేనింతటి సత్కారమును లోకోపకారము చేయుచుండగా [illegible] ఘోరకృత్యమొనర్చినందులకేమి సమాధానమిచ్చెదరని ఛీకరముగా [illegible]

చెను. దీక్షాధ్వరముననున్న నీ వీరభద్రునివలె ప్రకాశించుచున్న యా మహా నీయుని చూచి తత్తరిల్లి కన్నీరు కార్చుచు స్వామీ ! మీదయ. మీయాజ్ఞానుసారముగ ప్రవర్తించెదమనిరి. ఒకగడియ నేపాలోచించి మీరుతీసుకున్న తప్పుతాంబూలము రు. 5-00 లు కనుక రెట్టింపుగా రు. 10-00 లు తప్పు తాంబూలము చేతికి తీసుకొనుడనెను. వారట్లే తీసుకొనిరి. అప్పుడు కుర్చి తెప్పించి యందు శిల్పాచార్యుని కూర్చుండబెట్టి యాయనచేతికా తాంబూలము నిచ్చి సాష్టాంగనమస్కార మొనర్చుడనెను. వారటులనే సాష్టాంగ మొనర్చిరి. ధర్మకర్త స్వామీ ! ప్రతిష్ఠాకాలమునకు భంగము రానీయకు డనునంతలో శిల్పాచార్యుడు ప్రతిష్ఠాకార్యము నెరవేర్చి సక్రమముగా సన్మానములందెను. ఆయూరివారును చుట్టుప్రక్కల గ్రామములనుండి వచ్చిన వారును ఇది తప్పుతాంబూలముల సంబరమని నవ్విరి. నాటినుండి లోకమున వ్యాపించిన కథయిది.

అతడే 1925 లో కాకుమానులో పోలేరమ్మ ప్రతిష్ఠయును, 1926 లో పమిడివారిపాలెంలో ఆంజనేయ ప్రతిష్ఠయును, 1927 లో కంకటపాలెం సీతారామాలయములో సీతారామలక్ష్మణ విగ్రహముల ప్రతిష్ఠయును, (అపుడు నేనుకూడ ఉన్నాను) 1928లో అబ్బినగుంటపాలెంలో బొడ్డురాయి యును, 1932 ప్రాంతమున తుర్లపాడు శివాలయములో అమ్మవారిప్రతిష్ఠ, 1948లో కాకుమాను శివాలయములో అమ్మవారి పునఃప్రతిష్ఠ శివలింగపునః ప్రతిష్ఠ, 1950లో అప్పికట్ల శివాలయములో నవగ్రహప్రతిష్ఠలు మొదలగునవి, 1951లో పూండ్ల శివాలయములో నవగ్రహప్రతిష్ఠలు, మున్నగునవి నెన్నియో చేసి గొప్పసన్మానముల నందెను. ఆయనకే ఉద్దండపండితస్థపతి యని ప్రసిద్ధి కలిగియున్నది.

మ॥ ప్రకటానర్గళ వాక్సుమాస్త్రముల విద్వచ్ఛ్రేణి నోడించినీ
సకలజ్ఞత్వజ యధ్వజంబు రిశలన్ స్థాపించి మూర్తి ప్రతి
ష్ఠకపశ్యంబగు యజ్ఞకార్యముల నాచార్యత్వముం గొంచునే
డకటా స్వర్గము చేరినావె ఫణిభూషాచార్య శిల్పిప్రభూ ॥

నాచే యిట్లు స్మరింపబడినాడు. అని స్వర్ణ సుబ్రహ్మణ్యకవి గారు స్మరించినారు.

—0—